అపరాధ పరిశోధన అనుబంధం—15

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సంపదల సమస్యలు

రచన: ఏ. వీ. మోహన్రావ్

## దోపిడీ దొంగలు

రచన: సంపత్

## బ్లాక్ మెయిలింగ్!

రచన: కంచర్ల రమణ

## అణ్వాస్త్ర మహాసభ

రచన: సుజనశ్రీ

"ఖైదీ" సీరియల్-10వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—15
మార్చి, 1975
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
30-3-'75 లోగా పంపితే 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాద్-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# సంపదల సమస్యలు??

## ఏ. వీ. మోహన్రావ్

అర్థరాత్రి దాటింది.

అంబాసిడర్ కారు 'క్వాలిటీ బార్ అండ్ రెస్టారెంటు' ముందాగింది. డోర్ తెరచుకుని దిగింది ఓ అందమైన అమ్మాయి. నల్లటి స్ట్రెచ్‌లాన్ బెల్ బాటమ్ తొడుక్కుని దానిపైన పసుపు పచ్చని పువ్వుల షర్టు వేసుకుంది. తలపైకెగదువ్వి, వెనుకవేపు రబ్బర్ బాండ్ వేసి బిగించింది.

సెక్స్ మ్యూజిక్ సన్నగా వినిపిస్తూంది స్టీరియోలోంచి.

రెక్స్ విస్కీ సీసాలు మెల్లగా ఖాళీ అవుతున్నాయి టేబుల్స్‌పైన. అందరూ మంచి ఎక్సయిట్‌మెంటులో వున్నారు.

కారులోంచి దిగిన అమ్మాయి బార్ దగ్గరకు వెళ్ళి వంద

కాగితం పర్సులోంచితీసి విసిరేసింది.

"ఏంకావాలి?" అడిగాడు బార్ మాన్.

"రెండుబాటిల్స్ విస్కీ!" అంది.

అతను అందించాడు.

రెండు చేతుల్లో పట్టుకుని కూర్చునేందుకు స్థలంకోసం వెతికింది. ఎక్కడా ఖాళీలేదు. ఏంచెయ్యడమాని ఆలోచిస్తూ నిలుచుంది.

డయస్ వైపునుండి ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం ఆమెవైపు కదలింది. రెండు క్షణాలలో సమీపించి నిలబడింది.

"నాపేరు మైకేల్! బాండ్ మాస్టర్ను. మీరు కూర్చుని త్రాగేందుకు స్థలం చూపిస్తాను. వస్తారా?" అడిగాడు.

"థాంక్స్! పదండి!!" అందామె.

మైకేల్ ఆమెను డయస్ వెనుకనున్న చిన్నరూంలోకి తీసుకెళ్ళాడు. "ఇది నా ప్రయివేట్ రూం. ఇక్కడికెవ్వరూ రారు. నిదానంగా త్రాగుతూండండి. ప్రోగ్రాం ముగిశాక వస్తాను" అన్నాడు.

"నైస్! కారీ ఆన్!" అంది ఆమె.

మైకేల్ గదితలుపు దగ్గరకులాగి వచ్చేశాడు.

లోనున్న ఆమె మెల్లగా త్రాగటం మొదలెట్టింది.

ఆమెకు గతం గుర్తుకురాసాగింది.

తల్లి చనిపోయింది. తండ్రి ఆర్మీలో ఆఫీసర్. అపురూపంగా పెంచాడు. పెద్దచేశాడు. ఇంటినిండా విస్కీ వుండటంతో చిన్నతనంలోనే త్రాగుడు అలవాటు చేసుకుంది. పెద్దయ్యేకొద్దీ అతిగా త్రాగటం అలవాటయింది. ఉన్నట్టుండి యుద్ధంలో తండ్రి చనిపోయాడు. కాంపెన్

జేషన్ డబ్బు అందింది. హారతికర్పూరంలా ఆరునెలల్లో తాగుడుకు హరించుకుపోయిందా మొత్తం డబ్బు.

రెండేళ్ళక్రితం వరల్డ్ బ్యూటీ కాంపిటిషన్‌లో ఆ సంవత్సరపు సుందరిగా ఎన్నికైంది అమెరికాలో.

అక్కడే ఆమెకు రాజా రఘునందనరావు కలిశాడు. తనే పరిచయం చేసుకొన్నాడు. కావాలనే పెంచుకున్నాడు. అంతకుముందు డబ్బుకోసం ఎందరి ప్రక్కల్లోనో పొర్లాడిన తనకు విసుగెత్తిపోయింది. ఒకర్ని అంటిపెట్టుకుని బ్రతకటం మంచిదనిపించింది. రాజాగారు చేతికి అంది వచ్చాడు. పెళ్ళాడుతానని ప్రాధేయపడ్డాడు. కాదనలేకపోయింది. ఇద్దరూ అక్కడే పెళ్ళాడారు. సంవత్సరం రోజులు ప్రపంచమంతా తిరిగి ఇండియాకు వచ్చారు.

ఇండియాకు వచ్చింతర్వాత ఆమెకు అసలు సమస్యలు అర్థమైనాయి. అందరూ తన్ను 'రాణీగారూ' అని పిలవటం, మనస్సిచ్చి మాట్లాడకుండా దూరంగా వుండి పోవడం, ప్రతి చిన్న పనికీ ఎలా చెయ్యాలో చెప్పేందుకు ఎందరో వుండడం చిరాకు కలిగించింది. దాంతో మళ్ళీ విస్కీ త్రాగటం ఎక్కువ చేసింది.

పెదాలపైని విస్కీతడి ఆరిపోయినట్లనిపించింది.

ఆలోచనలు ఆపి సీసా ఎత్తి మరో గ్రుక్క మింగింది.

మైకేల్ లోనికొచ్చాడు. కోటు విప్పి హాంగరుకు తగిలించి, సింగిల్ సోఫాలో కూర్చున్నాడు.

"మిమ్మల్ని ఎప్పుడూ చూచినట్లులేదు!" అన్నాడు మైకేల్.

"ఇదే మొదటిసారి ఇక్కడకు రావడం" త్రాగుతూనే చెప్పిందామె.

"మీ పేరు తెలుసుకోవచ్చా?"

"శోభారాణి. రాజా రఘునందనరావుగారి భార్యను" అంటూ మైకేల్ కళ్ళలోకి తీక్షణంగా చూస్తూ "ఇక్కడ గంజాయి దొరుకుతుందని చెప్పారు. నిజమా!" అడిగింది.

"ఎవరు?"

"నా ఫ్రెండ్ ఒకామె!"

"దొరుకుతుంది. మీకు కావాలా?"

"కావాలి. విస్కీ త్రాగి త్రాగి విసుగెత్తిపోయింది. ఈ మత్తు చాలడంలేదు. దాంట్లో ఎంతో ఆనందం వుంటుందని చెప్పిందామె. రుచి చూద్దామనిపించింది. అసలు దానికే వచ్చాను" అంది శోభ.

"దాన్ని అందరికీ ఇవ్వరు. అందులోనూ తెలీని వాళ్ళకు అసలు అమ్మరు" అన్నాడు మైకేల్.

"నే నెవరో చెప్పానుగా."

"నాకు చెప్పి లాభంలేదు. ఈ బార్ ప్రొప్రయిటర్ విష్ణుమూర్తికి చెప్పాలి. అతనికి నమ్మకం కలగాలి. ఆ తర్వాతే అమ్ముతాడు" అన్నాడు మైకేల్.

"అతనికెలా కలుగుతుంది నమ్మకం."

"అతని ఆత్మీయులెవరన్నా కలిగించాలి."

"ఆ మాత్రం నువ్వు సాయం చెయ్యలేవా. దానికి ప్రతిఫలంగా నీకు కొంత డబ్బు కావాలంటే ఇస్తాను" అంది శోభ.

మైకేల్ మాట్లాడలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని మెదడు చకచక పనిచెయ్యడం మొదలెట్టింది. రాజా రఘునందనరావు పేరు ఈ మధ్య తరచుగా అనుకోవడం జరిగింది. అతను ఒక గాంగులో మెంబరు. వాళ్లు, రాజాగారి బంగళాలో వున్న విలువైన వజ్రాలను, నగలను, దొంగిలించేందుకు పథకాలు సిద్ధంచేస్తూ వుండటం గమ

నించాడు. ఆమె ఫోటో అక్కడే చూశాడు. అందువల్లే ఆమెను చూడగానే పోల్చుకోగలిగాడు.

"మీ రిక్కడే కూర్చొనుండండి. మాట్లాడి వస్తాను!" అంటూ మైకేల్ వెళ్ళిపోయాడు.

శోభ ఆలోచిస్తూ కూర్చుంది. డబ్బుకు దాసోహం అనని వెధవ లేడనిపించింది. తనుకూడా డబ్బుకోసం రఘునందనరావును పెళ్ళాడింది. అతనికి రాజా బిరుదు, డబ్బూ తప్ప మరేంలేవు. అందం అంతంతమాత్రం. రసికత నాసిరకం. అయినా రెండేళ్ళనుండి అతన్ని తను అంటిపెట్టుకుని వుండేందుకు కారణం అతని డబ్బుతో వున్న అవసరం తప్ప మరేంలేదు.

మైకేల్ లోనికొచ్చాడు.

"ఏమయింది?" అడిగింది శోభ.

"మాట్లాడాను" అంటూ చిన్న కాగితం పొట్లంతీసి ఇచ్చాడు. అందుకుంది శోభ.

"దీన్ని మరిగారంటే రోజూ కావాలనిపిస్తుంది. మీకు అవసరమైనప్పుడల్లా ఇవ్వడానికి కుదరదన్నాడు మా బాస్. మాకొచ్చే స్టాకు చాలా తక్కువ. ఇప్పటికే పర్మనెంటు మెంబర్లకు సర్దలేక సతమతమవుతున్నారట. మీకు భవిష్యత్తులో కావలసిన దానికి వేరే ఏర్పాట్లు చేసుకోమని చెప్పమన్నారు" అన్నాడు మైకేల్.

"దీని ఖరీదెంత?"

"ఐదొందలు."

వెయ్యి రూపాయలు తీసి ఇచ్చింది శోభ.

మైకేల్ డబ్బు అందుకుని లెఖపెట్టి, ఐదొందలు మాత్రం తీసుకున్నాడు. మిగిలింది తిరిగి ఆమె కిచ్చేశాడు.

"వుంచుకో! నీసాయం వృధాపోవడం నా కిష్టంలేదు!"

అంది శోభ ఆ డబ్బు అందుకునే ప్రయత్నం చెయ్యకుండా.

"మీకు కావలసినప్పుడల్లా గంజాయి నేను సప్లయి చెయ్యగలను. కానీ ఒక కండిషను. నాకు మీరో సాయం చెయ్యాలి."

"చెప్పు!" అంది.

"నేనో అమ్మాయిని ప్రేమించాను. ఆమెకు ఉద్యోగం కావాలి. అన్ని పనులు తెలుసామెకు. చదువుకుంది. మీ సెక్రెటరీగానో, మరేదన్నా ఇదిగానో వుంచుకుంటారా?" అడిగాడు.

"అందంగా వుంటుందా?"

"మీ అంత అందంగా వుండదు. కానీ నా కళ్ళకు రంభలా వుంటుంది. అందుకే ప్రేమించాను" అన్నాడు మైకేల్.

"మరి నే నెలా వుంటాను."

"రంభలా వుండరు. అంతకన్నా అందంగా వుంటారు."

శోభ నవ్వింది.

"రేపు నాదగ్గర కామెను పంపు. నువ్వు చెప్పినట్లు ఉద్యోగమిస్తాను. కానీ నాకు అవసరమయినప్పుడు సరుకు దొరకకపోతే ఆమెను ఉద్యోగంలోంచి వూడబీకుతాను" అంది శోభ.

"అలాగే! అటువంటి అవకాశం మీకు రానివ్వను" అన్నాడు మైకేల్. "నేను వస్తాను!" అంటూ లేచింది.

బార్ వెలుపలున్న కారుదాకా సాగనంపాడు మైకేల్. ఆమె కారెక్కి డోర్ మూసుకుంది. గుడ్ బై చెప్పాడు. కారు స్టార్టయి వెళ్ళిపోయింది.

## 2

గంట పదకొండయింది.

శోభ బెడ్‌రూంలో మంచంపైన పడుకుని నిద్రపో సాగింది. టెలిఫోన్ బెల్ గణగణ మంది. కళ్ళు తెరచి ఎదురుగావున్న వాల్ క్లాక్ కేసి చూసింది.

ఎడంచేత్తో రిసీవరు అందుకుని "యస్!" అంది.

"నీకోసం ఎవరో అమ్మాయి వచ్చింది. వెయిట్ చేస్తూంది" రాజాగారు చెప్పాడు.

"ఎవరినన్నా తోడిచ్చి నాగదికి పంపు" అని రిసీవరు పడేసింది క్రేడిల్ పైన.

మంచంమీద లేచి కూర్చుంది. దుప్పటి కాళ్ళవేపుకు నెట్టింది. ఆమె వొంటిపైన ఒక్క నూలుపోగులేదు. రాత్రిళ్ళు నగ్నంగా పడుకోవడం ఆమెకు అలవాటు.

మంచం దిగి వెళ్ళి ఫ్రిజ్ తెరచి, అందులోంచి విస్కీ తీసింది. కార్కు తెరచి రెండు గుక్కలు తాగింది. స్టాండ్ పైనున్న కోటుతీసి తొడుక్కుని సోఫాలో కూర్చుంది.

ఐదు నిముషాల తర్వాత ఆదెమ్మ వెంట అందమైన అమ్మాయిని లోనికి తీసుకొచ్చింది.

"ఈమెగారు..." అంటూ చెప్పబోయింది ఆదెమ్మ.

"తెలుసు. నువ్వెళ్ళి రెండు కాఫీలు పట్రా!" అంది శోభ. ఆదెమ్మ వెళ్ళిపోయింది గదిలోంచి.

శోభ తన కెదురుగా నిలుచున్న అమ్మాయిని నఖశిఖ పర్యంత పరీక్షగా చూసింది. మెకేల్ ఛేస్టును మెచ్చు కుంది. ఆమె తనంత అందమైంది కాకున్నా అనాకారి మాత్రంకాదు. పైకెచ్చు మంచి ఆరోగ్యంగా వున్నట్లు రబ్బరు బంతుల్లాంటి ఆమె రొమ్ములు, గుండ్రటి భుజాలు, యవ్వనంతో మెరుస్తున్న శరీరపు రంగు చెప్పకుండా తెలుపుతున్నాయి. తను త్రాగి త్రాగి మెరుగును మరుగు

పరిచేసుకొంటూంది.

ఆ అమ్మాయి జాకెట్ లోపల చెయ్యిపెట్టి రొమ్ముల మధ్యనుండి ఒక కవరు లాగి శోభకు అందించి "మైకేల్ పంపాడు" అంది.

"తెలుసు! నాకంతా చెప్పాడు నీ గురించి" అంటూ ఉత్తరం చించి చదివి, నలిపి డస్ట్ బిన్‌లో పడేసింది.

"నేను ఎప్పుడూ మత్తులో వుంటాను. నాకెప్పుడు ఏం కావాలో, ఏం చెయ్యాలో అన్నీ నువ్వు చూడాలి. కంటికి రెప్పలా అంటిపెట్టుకుని వుండాలి" అంది శోభ.

"అలాగే!" తలూపిందా అమ్మాయి.

"త్రాగిన మైకంలో ఆడుతుంటాను. కొడుతుంటాను. అల్లరి చేస్తుంటాను. అదంతా భరించగలవా?"

"త్రాగి చేస్తున్నారని తెలిశాక భరించడం కష్టం కాదు."

"నా భర్తకు ఉమెన్ వీక్‌నెస్ వుంది. ఏ పరిస్థితుల్లోనూ నువ్వాయన ముందుకు వెళ్ళకూడదు. ఒంటరిగా ఆయన వున్నప్పుడు మాట్లాడకూడదు."

"అలాగే!"

"నీ పేరు సుజాత కదూ!" అడిగింది శోభ.

"అవును" అందామె.

"ఈ గది నానుకుని మరో బెడ్‌రూం వుంది. నువ్వు అందులో వుండొచ్చు. అక్కడ అన్ని సదుపాయాలు వున్నాయి. ఒక బెల్ పెట్టిస్తాను, నిన్ను పిలిచేందుకు వీలుగా వుంటుంది."

"అలాగేనండీ!" అంది సుజాత.

"అన్నింటికన్నా ముఖ్యమైనది. అవసరమయినప్పుడు చెప్తాను. వెళ్ళి గంజాయి తెచ్చిపెడుతూ వుండాలి."

"దానికి నేను వెళ్ళనఖరలేదు. ఫోన్ చేస్తే పంపుతా నన్నాడు మైకేల్."

"అలా వద్దు! నువ్వే వెళ్ళి తెచ్చి పడుతుండు. రెండోది నీకోసం ఇక్కడికి ఎవ్వరూ అంటే మైకేల్ రాకూడదు."

"సరేనండీ!"

"అయితే నువ్వెళ్ళి ప్రక్కగదిలో నీ బట్టలు, సామగ్రి, సర్దుకో!" అంటూ పురమాయించింది.

సుజాత రూంబయట నడవలో పెట్టుకొన్న చిన్న సూట్ కేస్ తీసుకుని తన గదికి వెళ్లిపోయింది.

ఆదెమ్మ కాఫీ తెచ్చింది. కప్పందుకొని "ప్రక్క గదిలో వున్న అమ్మాయికి తీసుకువెళ్లి ఇవ్వు. నా పనులన్నీ ఇకపైన ఆమే చూస్తుంది. ఆమె మాట నా మాటగా గమనించి చెప్పినట్లు చేస్తూవుండు" అంది శోభ.

"అలాగేనమ్మా!" అంటూ వెళ్ళిపోయింది ఆదెమ్మ.

శోభకు మనస్సు ఉల్లాసంగా వుంది. ఆరునెలల నుండి ఆలోచించి వేసుకున్న పథకం అమలుజరపడానికి అవసర మయిన ఏర్పాట్లు చెయ్యడంలో సుజాతకు ఉద్యోగమిచ్చి ఆమెచేత బంగాళాలో మకాం పెట్టించడం తొలి మెట్టన్న విషయం తనకు తప్ప మరెవ్వరికి తెలీదు.

లేచి బాత్ రూంలోకి వెళ్ళి కాలకృత్యాలు ముగించు కుని, స్నానం చేసి వచ్చి ఫాన్ క్రింద కూర్చుని తలారుచ్చు కోవడం మొదలెట్టింది. మెల్లగా తలుపు తీసుకుని పిల్లిలా లోనికొచ్చాడు రాజాగారి బావమరిది భానుప్రకాష్.

"బోల్టు వేసిరా!" అంది శోభ.

అలాగే చేసివచ్చి ఎదురుగా వచ్చి కూర్చున్నాడు సోఫాలో.

"రాత్రి చాలాసేపు కూర్చున్నాను నీకోసం. నువ్వు

రాలేదు. ఎక్కడికి వెళ్లావ్?" అడిగాడు ప్రకాష్.

"నీకు చెప్పాలా?" అడిగింది కోపంగా.

"అదికాదు."

"నామీద అధికారమేదో వున్నట్లే ఆరాలు అడగడం నాకు అసహ్యం."

"అదికాదు శోభా!" అన్నాడు ప్రకాష్.

"ఇలా వేళాపాళా లేకుండా నా గదిలోకి రావద్దని చాలాసార్లు చెప్పాను. రాజాగారు అనుమానిస్తే నీ పని చెల్లవుతుంది. జాగ్రత్త!"

"ఆయన మొహం. కారాక్సిడెంటు జరిగాక కాళ్ళు చచ్చుపడి, ఎప్పుడూ ఆ చక్రాల కుర్చీలో క్రింది అంతస్తులోనే పడివుంటున్నాడు తప్ప పైకొచ్చింది లేదు. అందువల్ల మనం ఆయనకు భయపడి దూరదూరంగా వుండవలసిన అవసరం లేదు శోభా!" అన్నాడు ప్రకాష్.

"ఆయన గురించి కాదు నేను చెప్పేది. పనివాళ్ళ సంగతి. నన్ను గురించి ఎగాదిగా వాళ్ళుమాట్లాడుకోవడం కూడా నేను సహించను. నాకు అవసరమనిపించినపుడు, ఫోన్ చేస్తాను. ఎవ్వరి కంటపడకుండా రా! ఇలా ఎప్పుడూ రావద్దు" అంది శోభ.

ఆమె మాటలకు ప్రకాష్ విస్తుపోయాడు. ఆమె మనస్సులో ఏముందో ఎంత ఊహించినా అర్థంగాలేదు.

"నన్ను ప్రేమించడం లేదా శోభా!" అడిగాడు ప్రకాష్.

"నిన్ను తప్ప మరెవ్వరినీ ప్రేమించను. దమ్మిడీ లేని దగుల్బాజీవి. సిగరెట్లకూడా బావగారి ఎదుట చెయ్యి చాచి నిలబడే నీలాంటి వాళ్ళంటే నాకు ప్రేమమాటటుంచి, కనీసం సానుభూతి కూడా లేదు" అంది శోభ.

"మొన్న నాతో ఎందుకు గడిపావ్?"

"ఫూల్! నీతో నేను గడపలేదు. నాతో నువ్వు గడిపావ్. నా అవసరం. నిన్ను రప్పించాను. వాడు కున్నాను. పంపాను. అంతే!"

"నువ్వు మనిషివి కాదు" అన్నాడు కోపంతో ప్రకాష్.

"తెలిసిందిగా! ఇక వెళ్ళిపో!"

"పోతాను. పోయి నిన్ను ఏంచేస్తానో చూడు" అంటూ లేచాడు.

"ఇలాంటి మొరిగే కుక్కల్ని చాలా చూశాను. వెళ్ళు!" అంది తాపీగా శోభ.

ప్రకాష్ తలుపు తెరుచుకుని కోపంగా బైటపడ్డాడు.

శోభ చూసి నవ్వుకుంది.

ఫోన్ తీసి రాజాగారి సెక్రటరీతో ప్రక్కగదిలో వున్న సుజాతను పిలిపించేందుకు వీలుగా బెల్ ఏర్పాటు చేయించమని చెప్పింది. మెల్లగా లేచి బీరువా తెరచి అవసరమైన బట్టలు తీసుకుని వేసుకుంది. అందంగా అలంకరించుకుంది అద్దం ముందు కూర్చుని. కడుపులో ప్రేగులు కాలుతున్నట్లనిపించింది.

ఫ్రిజ్ లోంచి రెండు బ్రెడ్ ముక్కలు, విస్కీ సీసా తెచ్చి పెట్టుకొంది. బ్రెడ్ ముక్కల్ని విస్కీలో తడిపి మెల్లిగా నమల నారంభించింది. ఆకలి, దాహం, ఒకే దెబ్బకు తీర్చుకునేందుకు మామూలుగా ఆమె ఉపయోగించే మార్గమదే.

రాజాగారితో అంతకు రెండు దినాలముందు జరిగిన సంభాషణ గుర్తొచ్చింది. ఆ దినం ఆమె బాగా పొద్దు పోయాక ఇంటికొచ్చింది. బాగా త్రాగికూడా వుంది. హాల్లో చక్రాల కుర్చీలో వున్న రాజాగారు "శోభా!

ఇలారా!'' అని పిలిచాడు.

తను వెళ్ళి దగ్గరగా నిలుచుంది. రాజాగారు కళ్ళలోకి చూసి ''నేను వింటున్నదంతా నిజమేనా?'' అడిగాడు నిష్కర్షంగా.

''ఏమిటి?'' అడిగింది తను.

''నువ్వు విచ్చలవిడిగా కనుపించిన ప్రతి మగాడి కౌగిట్లో ఎక్కడం కాక అక్కడ బరితెగించి, తిరుగుతున్నా వటగా?'' అడిగాడు.

''ఎవరు చెప్పారు మీ కీ విషయం?'' అడిగింది తను కోపంగా.

''నమ్మకస్థులే చెప్పారు. నాకు కొంత గౌరవముంది. నా వంశానికి వెనుక పెద్ద మర్యాద వుంది. నాభార్యగా నువ్వు అలా ప్రవర్తించడం నేను సహించను'' అన్నాడు రాజా.

''ఎందుకు పనికిరాని నీకు పెళ్ళాంగా బ్రతుకంతా గడపడం నేనూ సహించను. అయినా సర్దుకుని పోతు న్నాను. ఎందుకో తెలుసా! నీ మర్యాద నిలబెడదామని. నువ్వు ప్రేమించి పెళ్ళిచేసుకొన్న అతిలోకసుందరి నిన్ను వదిలేసి వెళ్ళిపోయిందన్న అపవాదు నీ నెత్తిన పడకుండా చూద్దామని. నాకు విడాకులు అవసరంలేదు. నీ కవసర మయితే ఇచ్చెయ్యి'' చెప్పి తను ఆగకుండా గదిలోకి వచ్చేసింది.

ఆలోచించాలనుకుంది. కానీ గొంతునిండా వున్న విస్కీ ఆమెను మత్తుగా నిద్రలోకి లాక్కుపోయింది.

రాజా చేతి చిలుము వదలకుండా శోభను వదిలించు కోవాలనుకుంటున్నాడన్న విషయం ఆమెకు అర్థమయింది. అందుకే మొండి కేసుకుంది. అతని చేత ఎలాగైనా

విడాకులచ్చేట్లు చేస్తే ఆ స్తిలో దాదాపు సగం వస్తుంది. దాని విలువ యాభై లక్షలకు పైచిలుకు వుంటుంది. అడ్డమైన వాళ్ళతో అర్ధరాత్రిదాకా తాగుతూ, తిరుగుతూ వున్నట్లు చెప్పమని ఆదెమ్మను పురమాయించింది తనే. ఆ సంగతి రాజాగారికి తెలిసివుండదనుకుంది. తను వేసిన పాచిక త్వరగా పారితే, సుఖంలేని వాతావరణంలోంచి త్వరగా తప్పించుకొని పోవచ్చు ననుకుంది.

కాలింగ్ బెల్ నొక్కింది.

ప్రక్క గదిలో వున్న సుజాత రెండు నిముషాల్లో వచ్చింది కళ్ళు నులుముకుంటూ.

"నిద్రపోతున్నావా?"

"ఇప్పుడే కళ్ళుమూశాను. ఏంకావాలో చెప్పండి!" అడిగింది సుజాత.

"ఆకలిగా వుంది. ఏమైనా తెచ్చిపెడతావా తినేందుకు."

"భోజనం చేస్తారా?"

"ఆఁ!" అంది శోభ.

సుజాత గదిలోంచి తిన్నగా వంట గదికి వెళ్ళిపోయింది. తలుపులుమూసి గొళ్ళెంపెట్టి వున్నాయి. తెరుచుకుని వెళ్ళి స్విచ్ వేసింది.

గది మధ్యగా వీల్ ఛెయిర్‌లో కూర్చుని వున్న రాజాగార్ని చూసి కెవ్వున కేక వేసింది సుజాత.

"భయపడకు! నేనే! రాజాను" అన్నాడు.

"మీరు... ఇంత రాత్రప్పుడు... ఇక్కడ..." ఎలా అడగాలో అర్థంగాక ఆశ్చర్యం, భయం ప్రకటిస్తూ ప్రశ్నించబోయింది.

"అవును. నీతో మాట్లాడాలని ప్రొద్దుట్నుంచీ ఎదురు

చూశాను. నువ్వు పైనుండి క్రిందికి దిగిరాలేదు. ఖచ్చితంగా నువ్వు భోజనం చేసేందుకో లేక శోభకు భోజనం పెట్టేందుకో వస్తానని ఎదురు చూస్తున్నాను" అన్నాడు రాజా గారు.

"నాతో తమరికి ఏం పనివుంటుంది బాబూ!" వెండి కంచం కడిగి టేబుల్ పైన పెడుతూ అడిగింది.

"మనిషికి మనిషితో పని వుండటం సహజం. మీ అమ్మగార్ని చూశావా?"

"చూశాను."

"ఆమె ఎలా త్రాగుతుందో గమనించావా?"

"చేపలు నీళ్ళలో ఈదుతూ, త్రాగుతూ వుంటాయి. ఈమె విస్కీలో."

"ఆమెకోసం ప్రకాష్ వచ్చాడు కదూ!" అడిగాడు రాజా గారు.

సమాధానం తెలిసినా జవాబు చెప్పకుండా వుండి పోయింది.

"నువ్వు చెప్పకున్నా నాకు తెలుసు. ప్రకాష్ ఒక్కడే కాదు. కనపడ్డ ప్రతి మగాడితోనూ విచ్చలవిడిగా తిరుగుతూంది శోభ. నా మంచిచెడ్డలు, అవసరాలు, సుఖ సంతోషాలు ఆమెకు అవసరంలేదు. నావద్దనుండి కావల సింది డబ్బొక్కటే. నా డబ్బు రెండు చేతులా ఖర్చు పెడుతూ, నాకు తెలిసే ఇలా కట్టుకున్న పెళ్ళాం తిరుగుతుంటే ఎలావుంటుందో ఊహించగలవా?"

సుజాతకు ఆయన ఆవేదన అర్థమయింది. అయినా ఏమీ మాట్లాడకుండా వెండి కంచంలో కూరలు సర్దడంలో మునిగిపోయింది.

"నీ వల్ల నాకు సాయం కావాలి" అడిగారు రాజుగారు దీనంగా.

"నావల్ల నా? ఏం కావాలి? చెప్పండి!" అడిగింది సుజాత.

"శోభను మించిన అందం నీకు లేదు. కానీ ఆమెకన్నా గొప్ప హృదయం, కష్టాలలోవున్న మనిషి సమస్యలను అర్థం చేసుకోగల సానుభూతి నీ కున్నట్లు నాకనుపిస్తూంది. నేను శోభతో విడాకులు తీసుకునేందుకు నిర్ణయించుకున్నాను. అది త్వరలోనే సాధ్యమవుతుందనుకుంటున్నాను. ఆ తర్వాత నన్ను అంటిపెట్టుకొని వుంటూ, నా మంచిచెడ్డలు చూస్తూ, నన్ను నీకు చేతనైన విధంగా సుఖపెట్టగలవా?" అడిగాడు రాజాగారు.

"నేనా? మిమ్మల్ని సుఖపెట్టగలగడమా?" ఆశ్చర్యపోయింది సుజాత.

"నాకీ కాళ్ళు చచ్చుపడ్డాయి. అంతకు మించి మరే విధమైన లోపంలేదు. డబ్బుతో నువ్వు అనుభవించగల ఆనందమంతా అందుబాటులో కొచ్చేట్లు చేస్తాను. ఏమంటావ్?" అడిగాడు రాజాగారు.

ఫోన్ మ్రోగింది.

గబగబ వెళ్ళి రిసీవరు పైకెత్తింది సుజాత.

"సుజాతేనా?" శోభాదేవి కంఠం వినిపించింది.

"అవునమ్మగారూ!" పలికింది సుజాత.

"నువ్వెళ్ళి పదిహేను నిముషాలా ఇరవై సెకండ్లయింది. ఇంకా ఏం చేస్తున్నావ్. అక్కడెవరితోనన్నా..." వ్యంగ్యంగా అడిగింది.

"లేదండీ! వచ్చేస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది.

"అమ్మగారు కోప్పడుతున్నారు! వస్తాను!" అంటూ పళ్లెం పుచ్చుకొంది.

"నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు!" అడిగాడు రాజా గారు.

"ఆలోచించుకోనివ్వండి!" అంటూ పరుగెత్తింది సుజాత.

# 3

మంచంపైన పడుకుంది సుజాత.

రాజాగారితో వంటగదిలో జరిగిన సంభాషణంతా గుర్తొచ్చిందామెకు. ఆ తర్వాత శోభదేవి చేసిన హడావుడి, తిట్టిన తిట్లు, గావించిన పరిశోధన తలపుకొచ్చింది.

అన్నం పెట్టుకొచ్చిన పళ్లెం కాలితో ఒక్క తన్ను తన్నింది. తనపైన పడి జాకెట్ చింపి లోపల బ్రాసరీ పీకి, లైటు వెలుగులో నిశితంగా చూసింది. చీర లాగేసింది. చేతుల్తో తడిమి చూసింది. ఆమె ఎందుకలా చేస్తూందో అర్థంగాలేదు సుజాతకు.

"ఈ బోడిభోజనం తెచ్చేందుకు నీకు ఇంత టైము పడుతుందా? ఎవరి దగ్గర కెళ్ళావ్? ఏం చేస్తూవుండావ్?" అంటూ బెల్టుపట్టుకుని ధబీధబీమని వీపుపైన కొట్టసాగింది శోభ.

"నాకు తెలీదు! నే నెక్కడికీ పోలేదు!!" అని అరచింది సుజాత.

శోభ కోపంగా వెళ్ళి మంచంపైన పడింది. సుజాత చల్లగా ఆరూంలోంచి జారుకుని తన గదిలోకి వచ్చేసింది.

ఎవరో సన్నగా తలుపు తట్టిన శబ్దమైంది. తక్కున మంచంమీద లేచి కూర్చుంది.

ఆమె శోభారాణి కావడానికి వీలులేదు. ఆమె పిలిచేందుకు బెల్ వుంది. రాజాగారేమో ననుకుంది. ఆయన పిల్ ఛెయిర్ మొదటి అంతస్తుకు రాదు. ఆయనెప్పుడూ

క్రింది గదుల్లోనే తిరుగుతూంటాడు. మరెవరాని ఆలోచిస్తూ, మంచం దిగి తలుపు దగ్గరకు వెళ్ళింది.

"ఎవరు?" అడిగింది చిన్నగా.

"నేనే! తీ తలుపు."

ఆ గొంతు ఎక్కడా విన్నట్టు లేదామెకు.

"నేనంటే ఎవరు?"

"ప్రకాష్‌ను. త్వరగా తెరువు."

సుజాత తలుపు తెరచింది. ప్రకాష్ లోనికొచ్చి తలుపు మూశాడు. అతన్ని చూసి భయంగా గోడకానుకుని నిలుచుంది.

"భయంలేదు! కూర్చో!" అన్నాడు తను కూర్చుంటూ.

"ఇక్కడికెందుకొచ్చారు?"

"నీతో పనుండి..."

"ఏంపని?"

"ఇందాక మా బావగారు వంటగదిలో నీతో మాట్లాడటం చూశాను. నా గురించి అడిగాడా?"

అడిగాడన్నట్లు తలూపాడు.

"ఏమడిగాడు?" అడిగాడు ప్రకాష్.

"ఆయన భార్య గదిలోకి నువ్వు వెళ్తున్నావా లేదా అని."

"నువ్వేం చెప్పావ్?"

"ఏం చెప్పానని ఊహించావ్. ఏం చెప్పించాలని వచ్చావ్?" అడిగింది సుజాత అతన్ని నిశితంగా చూస్తూ.

"నువ్విక్కడ వున్నన్ని రోజులూ చూసింది చూడనట్లు, విన్నవి విననట్లు వుండాలి. ఎవరేమడిగినా నాకు తెలియదని చెప్పాలి. అది చెప్పేందుకే వచ్చాను" అన్నాడు ప్రకాష్.

"నీ క్రిందకాదు నేను పనిజేసేది. అమ్మగారివద్ద. నీ మాటెందుకు వినాలి?" అడిగింది సుజాత.

"అలా అంటావని తెలుసు. అందుకే సిద్ధంగా వచ్చాను" అంటూ వందరూపాయల కాగితం తీసి అందించాడు ప్రకాష్.

సుజాత మాట్లాడకుండా, అందుకుని చిన్నగా మడచి జాకెట్ లో పెట్టుకుంది.

"వారానికి వంద ఇస్తాను. సరేనా?" అడిగాడు ప్రకాష్.

"సరే!"

"నీతో ఇంకో పనికూడా వుంది."

"చెప్పు!"

"వీలైనప్పుడల్లా శోభకు నా గురించి చెప్పు. నన్నెలాగైనా ఆమె ప్రేమించేట్లు చెయ్యి. నీకు పెద్ద మొత్తం డబ్బిస్తాను" అన్నాడు ప్రకాష్.

"అది కష్టం! ఆమె అసాధ్యురాలు. ఇందాక పది నిముషాలు ఆలస్యంగా వచ్చినందుకు నే నెవరితోనో రాసక్రీడలాడానని అనుమానించి, శల్య పరీక్ష చేసింది. నీ గురించి పొగడడం మొదలుపెడితే, మనకిద్దరికీ ఏదో అక్రమ సంబంధం వుందని అనుమానపడుతుంది. నీ ప్లాను చెడుతుంది. జాగ్రత్త!" అంది సుజాత.

"అదీ నిజమే! కానీ ప్రయత్నించు. వస్తాను" అంటూ లేచాడు ప్రకాష్.

"మంచిది! ఇలా గదిలోకి రాకండి. ఎవరన్నా చూస్తే నాకన్నా మీకే ప్రమాదం" అంది సుజాత.

"రాను" అంటూ వెళ్ళిపోయాడు.

సుజాత తలుపులు వేసి బోల్టులాగి వచ్చి కూర్చుంది.

ఆ బంగళాలోని మనుషులు, వాళ్ళ మమతలు, పద్ధతులు వింతగా విచిత్రంగా తోచాయి.

అసలు తనొచ్చిన పని గుర్తొచ్చింది.

అక్కడి వాళ్ళ కెవ్వరికీ తనపైన అనుమానంలేదు. కాని మైకేల్ తన్ను పంపింది పెద్ద పనిమీద. రాజాగారి బంగళాలో వున్న ఐరన్ సేఫ్‌లో దాదాపు రెండు కోట్ల రూపాయల ఖరీదుచేసే వజ్రాలు, మణులు, వున్నాయి. వాటిని తస్కరించడానికి అంతకుముందు నాలుగైదు ముఠాలు ప్రయత్నించాయి. తలుపులు తెరచేలోగానే పోలీసులువచ్చి, చేతులకు బేడీలు వేసి పట్టుకెళ్ళారు. అటువంటి పొరపాటుచేయకుండా పకడ్బందీగా పని నేరవేర్చుకునేందుకు, ఆ ఐరన్ సేఫ్ రహస్యాలు సేకరించేందుకు శోభారాణి పనికత్తెగా తన్ను ప్రవేశపెట్టారు.

సుజాతకు తల్లితండ్రులు లేరు. ఆమెకు పదహారేళ్ళ ప్రాయంలోనే చనిపోయారు. ఆ తర్వాత పొట్టకోసం ఎన్నో పాడు పనులు చేసింది. చివరకు చిన్నచిన్న దొంగతనాలుకూడా చేసింది. అలాంటి చిన్న దొంగతనం చేస్తూ మైకేల్‌కు చిక్కింది. అది మొదలు అతని రక్షణలో వుండిపోయింది. అతను ఇష్టంవచ్చినట్లు వాడుకొని, కొద్దిగా డబ్బిచ్చేవాడు.

మంచి చీరలు కట్టుకోవాలని, మంచి నగలు వేసుకోవాలని, కార్లలో తిరగాలని ఆమెకు కోరికగా వుండేగి. కానీ మైకేల్ తనకొచ్చే జీతం రెండొందలని చెప్పి, అందులోంచి సగం ఇచ్చి సర్ది పుచ్చేవాడు సుజాతకు.

ఆమెకు డబ్బుపైనున్న వ్యామోహాన్ని తీర్చేందుకు మైకేల్ మధ్యపెట్టి, చిన్నగా ఒప్పించి శోభారాణి దగ్గర పనిపిల్లగా కుదిర్చాడు.

సుజాతకు తనొచ్చినపని గుర్తొచ్చింది, అప్పుడే ఒకరోజు దాటిపోతూంది. ఆ సేఫ్ ఎక్కడుందో, ఎలా తెరుస్తారో, అందులో ఏముందో, తెలుసుకోనేలేదు. కానీ రాజాగారు చెప్పిన మాటలు ఆమె మనస్సుపై చెరగని ముద్ర వేశాయి.

బంగళాలో వున్న నిధికి సంబంధించిన రహస్యాలు కనిపెట్టి మైకేల్‌కు చెప్తే, వాళ్ళు దొంగతనం చేస్తారు. పోలీసులు ఖచ్చితంగా తన్ను అనుమానిస్తారు. ఆ తర్వాత పరిశోధనచేస్తే, తను మైకేల్ అధీనంలో వున్న విషయం సులభంగా ఋజువు అవుతుంది.

చీకటి కొట్లో వేసి చితక బాదితే అసలు రహస్యం మైకేల్ చెప్పెయ్యవచ్చు. అదే జరిగితే ఇద్దరూ ఆజన్మ ఖైదు అనుభవించవలసిందే.

అంతకన్నా సులభంగా కావలసినంత డబ్బూ, ఆనందం, పొందే విధానం రాజాగారు చూపిస్తున్నప్పుడు దాన్నెందుకు అందుకోగూడదు! ఆలోచిస్తూనే పడుకుంది. తెలీకుండానే కళ్ళు మూసుకుపోయాయి. నిద్రలో కూరిగి పోయింది సుజాత.

తెల్లవారింది. సుజాత కళ్ళు నులుముకుంటూ వుండగానే బెల్ మోగింది. తల ముడేసుకుని, ఎకాయెకిన పరుగెత్తింది శోభారాణి గదిలోకి.

"కాఫీ కావాలి!" అంది ప్రక్కపైనే పడుకుని.

"తెస్తానమ్మా!" అంటూ వంటగదివేపు వెళ్ళిపోయింది. క్రిందకు దిగి వంటగదిలో ఆయమ్మ నడిగి చిన్న ఫ్లాస్కు నిండా కాఫీ పోయించుకుని, ట్రేలో ఒక కప్పు, ఫ్లాస్కు పెట్టుకుని తిరిగి శోభ గది కొచ్చింది.

ఫ్లాస్కులో కాఫీ అందిస్తూండగా చూసింది మంచం వారగా పడున్న సిగరెట్ పెట్టి. అదేరకం పెట్టి అంతకు

ముందు రాత్రిపూట ప్రకాష్ జేబులో చూచింది. అంటే రాత్రి ప్రకాష్ శోభారాణి గదిలో గడిపాడన్న విషయం అర్థమైంది సుజాతకు.

"రాజాగార్ని చూశావా?" అడిగింది సుజాతను శోభ.

"ఆఁ!" తలూపింది సుజాత.

"చూశావా? ఎప్పుడు? ఎక్కడ? ఆయన్ను చూడవలసిన అవసరం నీకెందుకొచ్చిందో తెలుసుకోవచ్చా?" నిలదీసి అడిగింది.

"హాల్లో వీల్ ఛెయిర్‌లో కూర్చుని పేపరు చదువుకుంటూవుంటే అటువేపుగా వెళ్తూ చూశాను. అంతే!" అంది సుజాత.

"అంతే అయితే ఫరవాలేదు! అంతకుమించి ఆయనతో మాట్లాడినట్లుగానీ, మరేదైనా జరిగినట్లుగానీ తెలిస్తే ప్రాణాలు తీసేస్తాను. తెలిసిందా?" బెదరింపుగా అంది.

సుజాతకు చిర్రెత్తుకొచ్చింది."అమ్మగారూ! తిండికిలేక పనిచేసుకుని బ్రతుకుతున్నాను తప్ప, శరీరం అమ్ముకునే అవినీతి జాతిదాన్నిగాదు. అది మీరు తెలుసుకోవడం చాలా అవసరం" నొక్కి చెప్పింది.

"అంటే... నేను నీతిలేని కుక్కలా బ్రతుకుతున్నాననా? రస్కెల్. ఒక్క రోజు మా యింటి వంటకాలు తింటేనే ఇంత పొగరు వచ్చిందన్నమాట" అంటూ వేడి కాఫీ కప్పు సుజాత మొహాన గిరవాటు వేసింది.

మొహం నిండా కాఫీ పడింది. చెంపలు పగలకొడదామనిపించింది. తనొచ్చిన కార్యం, తనకు రాజాగారు చూపెట్టిన ఆశ, గుర్తొచ్చి తన్ను తనే తమాయించుకుంది సుజాత.

"నువ్వు నాదగ్గర పనిచెయ్యనవసరంలేదు. వెళ్ళిపో!

నిన్ను డిస్మిస్ చేశాను'' అంది శోభ.

"సారీ! మేడమ్! ఏదో ఆవేశంలో అలా అన్నాను. అంతేగాని మిమ్మల్ని నొప్పించాలనికాదు. ఇకపైన అటు వంటి పొరపాటు జరగకుండా చూసుకుంటాను'' అంది దీనంగా.

"లాభం లేదు. వెళ్ళిపో!'' శోభ చెప్పింది.

"అలా అనకండమ్మా! ఇలా ఒక్క రోజులోనే నా ఉద్యోగం ఊడిపోయిందని తెలిస్తే మరెవ్వరూ నాకు పని ఇవ్వరు. బ్రతకడం కష్టమవుతుంది. మీరు చెప్పినట్లే వింటాను'' అంది సుజాత.

శోభకు మైకేల్ మాటలు గుర్తొచ్చాయి. అవసరమైనంత గంజాయి సప్లయిచేసేందుకు, సుజాతను ఆమె దగ్గర వుంచుకొని తీరాలన్న అతని ఆంక్షకూడా మెదలింది మనస్సులో.

"జాగ్రత్త! మళ్ళా మాటలు పేలకు, వెళ్ళి నీ పనులు చూసుకొని త్వరగా రా! నేను మహాబలిపురం వెళ్ళాలి. నాకు కావలసిన సామాన్లు సర్దిపెట్టాలి!'' అంది శోభ.

తిరిగి సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది సుజాత.

## 4

పదకొండింటికి కార్లో వెళ్ళిపోయింది శోభ. ఆమెను సాగనంపి తిరిగి గదిలోకి వచ్చింది సుజాత.

స్నానంచేసి బట్టలు కట్టుకుంటూ వుండగా ఆదెమ్మ గది తలుపు తట్టింది. సుజాత తలుపు తెరచింది.

"అమ్మా! మీ బావగారట వచ్చారు'' అంది.

"బావగారా? ఎక్కడున్నారు?'' అడిగింది సుజాత.

"హాల్లో కూర్చోబెట్టాను. ఇక్కడికి పిల్చుకు రమ్మంటారా?''

"వద్దు. నేనే వస్తున్నానని చెప్పు. రాజాగారు ఎక్కడున్నారు?" అడిగింది అనుమానంగా.

"వారు కూడా హాల్లోనే వున్నారు. వారే నన్ను పిలిచి చెప్పారు. మీ బావగారితో మాట్లాడుతున్నారు" చెప్పింది ఆదెమ్మ.

"సరే నువ్వెళ్ళు!" అని డ్రస్ చేసుకోవటంలో నిమగ్నురాలైంది.

బావగారని చెప్పుకుంటూ వచ్చింది ఎవరైవుంటారని ఆలోచించసాగింది. మైకేల్ కు తప్ప మరెవ్వరికీ తను అక్కడ వున్న విషయం తెలియదు గాబట్టి అతనే వచ్చివుండాలనిపించింది.

మెట్లు దిగుతూ చూసింది. రాజాగారు వీల్ ఛైర్ లో కూర్చున్నారు. వారి కెదురుగా కూర్చున్న మైకేల్ కనుపించాడు.

"నమస్తే!" అంది ఇద్దరికీ, కాస్త దూరంగా నిలబడి.

"ఓ! సుజాతా? రా! నిన్ను చూచి ఎన్నో రోజులైనట్లుంది. బాగున్నావా?" అడిగాడు మైకేల్.

"ఆఁ! అక్కయ్య, పిల్లలూ అంతా బావున్నారా?"

"ఆఁ! ఆఁ! నీ కీ స్వీట్స్ పాకెట్ మీ అక్కయ్య పంపింది. తర్వాత మరో విషయం. ఆవిడ తనకో చీర కొనుక్కురమ్మంది. నీచేత సెలెక్టు చేయించమని చెప్పింది. నీకు సాయంత్రం ఓమారు బజారుకు వచ్చేందుకు వీలుంటుందా?" అడిగాడు మైకేల్ రాజాగారికేసి చూస్తూ.

జవాబు చెప్పకుండా రాజాగారికేసి చూసింది.

"వెళ్ళిరా! శోభారాణి కూడా ఎటో వెళ్ళినట్లుంది. కానీ త్వరగా వచ్చెయ్యి" అన్నాడు రాజాగారు.

"థాంక్స్! సుజాత చాలా అమాయకపు పిల్ల, మీరే

జాగ్రత్తగా చూచుకోవాలి!" అన్నాడు మైకేల్.

"అలాగే! ఆ మెగురించి మీరేమీ బెంగపెట్టుకోకండి" అన్నాడు రాజాగారు.

"అయితే నేను సాయంత్రం వస్తాను సుజాతా! సిద్ధంగా వుండు" అంటూ లేచాడు మైకేల్

అలాగే నన్నట్లు తెలూపింది సుజాత.

మైకేల్ లేచి వెళ్ళిపోయాడు.

సుజాత చూస్తూ నిలుచుంది.

"సుజాతా! కాసిని మంచినీళ్ళు తెచ్చి పెడతావా?" అడిగాడు రాజాగారు.

"తెస్తానండీ!" అంటూ పాకెట్‌తో సహా కదల బోయింది.

"మీ అక్కయ్య పంపిన స్వీట్స్ మొత్తం నీకేనా? మాకేమన్నా కాస్త పెడతావా?" అడిగాడు రాజాగారు.

సుజాతకు ముచ్చెమటలు పోశాయి. అందులో ఏముందో తనకు తెలీదు. ఆయన ముందు విప్పితే తమ రహస్యం విప్పి చెప్పినట్లవుతుంది. తన నిజరూపం తెలిశాక రాజాగారు అంతకుముందు చూపించిన ఉత్సుకత పోయి దాని స్థానంలో కోపం చోటు చేసుకుంటుంది. ఏం చెయ్యాలాని ఆలోచిస్తూనే నిలుచుంది.

"డోన్ట్ వర్రీ! మాట వరసకన్నాను. ఆమె నీకు ప్రేమతో పంపినదాంట్లో భాగం కోరే అవివేకిని కాను నేను. మంచినీళ్ళు తెచ్చిపెట్టు" అన్నాడు రాజాగారు.

బ్రతుకుజీవుడా అనుకుంటూ లోనికి పరుగెత్తిపోయింది సుజాత.

మంచినీళ్ళిచ్చి వచ్చింది సుజాత గదిలోకి. పాకెట్ విప్పింది. అందులో చిన్న రివాల్వరుంది. దాని ప్రక్కనే

చిన్న పొట్లం వుంది. విప్పింది. అందులో గంజాయి వుంది. ఏదైనా ఉత్తరం వుందేమోనని వెతికింది. కనుపించలేదు. పాకెట్ రాజాగారి ముందు విప్పకుండా వచ్చినందుకు తన్ను తనే అభినందించుకుంది సుజాత.

ఆ సాయంత్రం వచ్చాడు మైకేల్. అతనితో వచ్చేసింది సుజాత. ఇద్దరూ కూర్చున్నారు.

"పాకెట్ విప్పి చూచుకున్నావా?" అడిగాడు మైకేల్.

"ఆఁ! రివాల్వరు ఎందుకు?"

"మనపని పూర్తిచేసుకునే రోజు అవసరం రావచ్చు. అందుకే సంపాదించాను. దాంతో ఎవరినన్నా కాల్చి చంపినా ఫరవాలేదు. అది రాజాగారి కుటుంబంలోని వ్యక్తుల్లో ఒకరిది."

"ఐ. సీ. నాకు అక్కడ వుండడం పెద్ద బాధగా వుంది. ఆ శోభకు నామీద అనుమానం. నేను రాజాగార్ని వల్లో వేసుకుంటానేమోనని భయం. ఆమెకు దూరంగా పది నిముషాలుంటే చాలు, పిలిచి బట్టలు విప్పి చెక్ చేస్తుంది, నోరు సరే! చెప్పడానికిలేదు. ఆ తిట్లు పడుతూ, నేనుండలేను. అక్కడ ఉద్యోగం మానేద్దామనుకుంటున్నాను" అంది సుజాత.

"డోంట్ బీ సిల్లీ! బాస్ నీపైన చాలా ఆశలు పెట్టుకొని వున్నాడు. ఈ పని మనం సాధించామంటే పెద్ద మొత్తంలో డబ్బు దొరుకుతుంది. కలకత్తాకు వెళ్ళి నైట్ క్లబ్ పెట్టుకొందాం. జల్సాగా జీవితం గడుపుదాం."

"నాకు నమ్మకంలేదు. రాజాగారు చాలా తెలివిగల మనిషి. ఆ చక్రాల కుర్చీలో కూర్చునే అన్ని వ్యవహారాలు నడుపుతుంటారు. ఆ శోభారాణి ఎక్కడ తిరుగు

తుందో ఏంచేస్తుందోనని ఆయన ఆరాటం. ఆమెను ఎవరో ఎప్పుడూ వెంటాడుతున్నారని నాకు అనుమానంగా వుంది'' అంది సుజాత.

''ఆ నిధి ఎక్కడ దాచిందీ తెలుసుకోగలిగావా?''

''ఇంతవరకు లేదు.''

''ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తూ వుండు. అన్ని వివరాలు తెలుసుకో. ఆ తర్వాత నాకు చెప్పు. దాన్ని ఎలా చేజిక్కించుకోవాలో ఆలోచించి పథకం తయారు చేస్తాను'' అన్నాడు మైకేల్.

''నన్నంతదాకా ఆమె ఆ యింట్లో వుండనివ్వాలికదా?''

''ఆమెకు నీ అవసరం వుంది. గంజాయి మత్తులో పడ్డ తర్వాత అది లేకుండా క్షణం వుండలేదు. నీద్వారా తప్ప అది దొరకదు. మన మనిషిని మహాబలిపురం పంపాను. అక్కడ శోభారాణి ఏంచేస్తూందో తెలుసుకు రమ్మన్నాను. ఆమెకు సంబంధించిన రహస్యమేదైనా మనకు చిక్కితే కుక్కిన పేనులా పడివుంటుంది'' అన్నాడు మైకేల్.

''ఏడవుతోంది! ఇక నేను వస్తాను'' అంది మైకేల్‌తో సుజాత.

''చెప్పింది బాగా గుర్తుంచుకో! ఏ పరిస్థితుల్లోనూ అక్కడనుండి నువ్వు వెళ్ళిపోవలసిన పరిస్థితుల్ని సృష్టించుకోకు. అలాంటిదే జరిగితే నిన్ను శాశ్వతంగా ఈ లోకం నుండే పంపేందుకు తగిన ఏర్పాట్లు చేసివుంచాడు బాస్!'' అన్నాడు మైకేల్ లేస్తూ.

ఆ మాటతో అదిరిపడింది సుజాత.

''అంటే నన్ను నువ్వు ప్రేమించడం బూటక మన్న మాట! అవసరానికి వాడుకునేందుకే నాకు నీడ చూపించావని తెలుస్తోంది. అవునా?'' అడిగింది సుజాత.

"అది బాస్ అభిప్రాయం. కానీ నాకు నువ్వంటే ప్రేమ" చెప్పాడు మైకేల్.

"థ్యాంక్స్! ఈపని పూర్తయ్యాక నా జీవితం గురించి, భవిష్యత్తు గురించి నేనే ఆలోచించి నిర్ణయించుకుంటాను. వస్తాను" అంటూ చకచక నడచుకుంటు పార్కు వెలుపలకివచ్చి, ఆటో ఎక్కి రాజాగారి బంగళా అడ్రసు చెప్పి పోనియ్యమంది.

హాల్లో కడుగుపెట్టబోతూ ఎదురుగా చూసింది సుజాత.

రాజాగారు వీల్ ఛైయిర్‌లో కూర్చుని వున్నారు. ఆయన కాళ్ళపైన ఆకుపచ్చ రంగు కప్పివుంది. ఒక చేత్తో కళ్ళజోడు తీసి పట్టుకున్నాడు.

"సుజాతా! ఇలారా!" పిలిచాడు.

దగ్గరగా వెళ్ళి నిలుచుంది సుజాత.

"ఇంట్లో ఎవ్వరూ లేరు! నీతో మాట్లాడాలని అందర్ని పంపేశాను. కూర్చో!" అన్నాడు రాజాగారు.

సుజాత భయపడుతూ కూర్చుంది.

"మీ బావగారు వెళ్ళారా!"

వెళ్ళారన్నట్లు తలూపింది.

"మీ అక్కయ్యకు చీర కొన్నాడా!"

దానికీ అవునన్నట్లు తలూపుతూ సమాధానం చెప్పింది.

"సుజాతా! శోభ, ప్రకాష్, నువ్వూ అనుకునేంత దద్దమ్మను కాను నేను. ఎవరు ఏమిటో, ఎందుకు నా చుట్టూ తిరుగుతారా, నావెంట బడతారా, తెలుసుకోవలసిన అవసరం నాకు ఎప్పుడు వుంటూనే వుంటుంది. అందుకే నా పద్ధతులు కొన్ని విచిత్రంగా వుంటాయి. నిన్ను గురించి నీకు తెలిసిందానికన్నా ఎక్కువ నాకు తెలుసు" ఆగాడు రాజాగారు.

సుజాతకు చెమటలు పట్టాయి.

"నువ్వు గుంటూరులో పుట్టావు. నీకు పదహారేళ్ళకే తల్లి తండ్రులు లేకుండాపోయారు. ఆ తర్వాత కొన్నాళ్ళు వ్యభిచారం చేసుకుని బ్రతికావు. ఆ తర్వాత నీకు జేబు దొంగతో పరిచయమైంది. దొంగతనాలు ప్రారంభించావ్. నిన్ను పోలీసులు పట్టుకున్నారు. జైల్లో తోశారు. రెండు మాసాల శిక్ష అనుభవించావ్. వాళ్ళు వదిలాక తిన్నగా మద్రాసు వచ్చావ్. క్వాలిటీ బార్‌లో పనిచేసే మైకేల్‌తో పరిచయమయింది. అతనితో వున్నావ్. ఇందాక వచ్చింది అతనే!" అన్నాడు రాజాగారు.

వివరాలు వింటూ గుడ్లప్పగించి చూడసాగింది సుజాత.

"నేను చెప్పేవి నిజంకదూ!"

"నిజమే!" అంది సుజాత. ఆమె కళ్ళముందు జైలు గోడలు, దాని ద్వారాలకున్న పదహారు కమ్ములు గుర్తొచ్చాయి.

"నువ్వీ యింట్లో పనిచేయాలని ఎందుకన్నావ్?"

"అన్ని వివరాలు సేకరించారు. అది తెలుసుకోలేక పోయారా?"

"తెలుసుకున్నాను. కానీ నీ నోటినుండి వినాలని అడిగాను" అన్నాడు రాజాగారు సిగరెట్ తీసి వెలిగించుకుంటూ.

సుజాతకు తను కట్టుకున్నది పేకమేడనీ, కూలిపోయి చాలాకాలమైందనీ, అర్థమయింది. అటు మైకేల్‌తో చేతులుకలిపి, నిధిని దొంగిలించి దాని ద్వారా వచ్చే డబ్బును పొందే అవకాశంగానీ, ఇటు రాజాగారి ఉంపుడుకత్తెగా వుండి సర్వసుఖాలు చవిచూచే ఆశగానీ లేదని తెలుసుకొంది.

"అంతా మీకు తెలిసిపోయాక నేను చెప్పవలసిందేమీ లేదు. పోలీసుల్ని పిలిపించండి!" అంది సుజాత.

"అవసరం లేదు! ఇప్పటికైనా నీ మనసు మార్చుకో గలిగితే నీకు నేను ఇచ్చిన మాట నిలబెట్టుకుంటాను" అన్నాడు రాజాగారు.

"నన్నేం చెయ్యమంటారు?"

"ఆ దొంగల్ని పట్టుకునేందుకు సహకరించు. నా నిధి క్షేమంగా వుంటుంది.దొంగల్ని పట్టుకునేందుకు సహాక రిస్తావు గాబట్టి పోలీసు డిపార్టుమెంటులో నీకున్న చెడ్డ పేరుకూడా పోతుంది. ఆ తర్వాత నా రక్షణలో నువ్వు వుండవచ్చు" అన్నాడు రాజాగారు.

"అలాగే చేస్తాను. కానీ నన్ను ఇక్కడ నియమించిన ముఠా చాలా బలమైంది. హత్యలు చెయ్యడం, దొంగ తనాలు జరపడం వెన్నతో బెట్టిన విద్య వాళ్ళను. మీతో కుమ్మక్కయి వాళ్ళకు పట్టించింది నేనేనని తెలిసిన మరు క్షణం నన్ను యమలోకానికి పంపేందుకు పాస్‌పోర్టు తెచ్చిస్తారు" అంది భయంగా సుజాత.

"అసంభవం! ఆ ముఠా మొత్తాన్ని పట్టించేస్తాను. పోలీసులకు నువ్వు అన్ని వివరంగా చెప్పాలి. వాళ్ళవల్ల నీకు అపాయం లేకుండా వాళ్ళే చూస్తారు."

"అలాగే! మీ కోరిక తీరాక నన్ను వదిలేస్తే..."

"నీకు ముందుగా లక్షరూపాయ లిస్తాను. చాలా!"

"చాలు!" అంది సుజాత.

"గుడ్ గర్ల్! రేపు వీలు చూచుకొని వెళ్దాం పోలీసుల దగ్గరకు. శోభారాణి ఎప్పుడొచ్చేదీ తెలుసా?"

"తెలీదు!"

"ఇంక నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడు రాజాగారు.

సుజాత తన గదివేపు వెళ్ళిపోయింది.

## 5

"మైకేల్!" పిలిచాడు గాడ్సే.

"యస్ బాస్!" పలికాడు మైకేల్.

"ఏమిటి మన ప్రోగ్రెస్. సుజాత ఏమైనా వివరాలు సేకరించిందా?"

"ఇంకా లేదు బాస్!" అన్నాడు మైకేల్.

"ఇంకా లేదా? ఆమె ఏంచేస్తూందక్కడ. ఆమె ఏం చెయ్యవలసిందీ వివరంగా చెప్పావా?" అడిగాడు గాడ్సే.

వాళ్ళతోపాటు కూర్చున్న మరో ఇద్దరు మనుషులు సిగరెట్లు కాలుస్తూ రింగులు రింగులు తిరుగుతున్న పొగను గమనించసాగారు.

"చెప్పాను. ఈ దినం ఆమెను కలుసుకున్నాను. అక్కడ వుండడం పెద్ద బాధగా వుందంటూ పని మానేసు కుని వస్తానంది...అలా రావద్దని నచ్చచెప్పి పంపాను" అన్నాడు మైకేల్.

"ఆమె నమ్మకమయిన మనిషేనా? కొంపదీసి మనల్ని చిక్కులో పెట్టదుగదా?" సిగరెట్ పారేసి అన్నాడు మస్తాన్.

"ఆ విషయం మైకేల్ కే తెలియాలి. ఆమె అతని మనిషి. నెల రోజులుగా అతని గదిలోనే వుంది" అన్నాడు గాడ్సే.

"ఆ భయం లేదు బాస్. కానీ కాస్త పిరికిపాలు ఎక్కువ. అందువల్లే మాటిమాటికీ వెనకడుగు వేస్తూవుంది."

"ఘట్టిగా చెప్పేందుకు మైకేల్ కు ఆమెపైనున్న అను రాగం అడ్డొస్తూ వుందేమో! నన్నొకక్కమారు హెచ్చ

రించమంటారా?'' మళ్ళా మస్తాన్ మాట్లాడాడు.

''వద్దు బాస్! అంతా సవ్యంగా జరుగుతుంది'' హామీ ఇచ్చినట్లు చెప్పాడు మైకేల్.

గాడ్సే రివాల్వరు లోడ్ చెయ్యటం మొదలెట్టాడు. గదంతా కలయజూసి ''మైకేల్! ఇప్పటికి నాలుగు ముఠాలు ఆ నిధిని దక్కించుకోవాలని ప్రయత్నించాయి. అందరు పోలీసుల వాత పడ్డారు. వాళ్ళంతా నిధిపైన చెయ్యి వేసిన క్షణంలోనే పోలీసులు ప్రత్యక్షమైనారు. ఆ నిధిని దాచిన స్థలానికీ, పోలీసులకూ మధ్య ఏదో రహస్య సంకేతం వుంది. బర్గలర్ అలారం అమర్చి వుండాలనుకుంటున్నాను. దాన్ని పని చెయ్యకుండా ఎలా చెయ్యాలో ముందు తెలుసుకోవాలి. ఆ తర్వాత ఆ నిధిని దాచిన రహస్య ప్రదేశానికి ముందున్న ద్వారానికి తలుపుంది. ఆ తలుపుకు తాళంవుంది. దాన్ని తెరచేందుకు కాంబినేషను నెంబర్లు కావాలి. వాట్ని కనుక్కోవాలి. ఇదే నువ్వు సుజాత ద్వారా రాబట్టవలసిన సమాచారం'' అన్నాడు రివాల్వరు సేఫ్టీ కాచ్ బిగిస్తూ.

''చెప్పాను. బాస్!'' అన్నాడు మైకేల్.

''అది తెలుసుకున్న తర్వాత, దొంగతనానికి ముహూర్తం పెడతాను. ఆమె ముందుగానే తలుపులు తీసివుంచాలి. మన మనుష్యులని వెంటపెట్టుకొని నిధి దగ్గరకు వెళ్ళాలి. అక్కడ అలారం పనిచెయ్యకుండా చెయ్యడం, తలుపు తెరవడం ఆమె పనులు. మనవాళ్లు డబ్బు తీసుకుని వచ్చేస్తారు. ఆమె అక్కడే వుంటుంది'' అన్నాడు గాడ్సే.

''పోలీసు లామెను అనుమానిస్తే!''

''అనుమానిస్తారు. అరెస్టు చేస్తారు. నిజం చెప్పమని

తంతారు. తనకేం తెలీదని చెప్పాలి'' అన్నాడు గాడ్సే.

''ఆడమనిషి. అందులోనూ పిరికిది. ఒక వేళ పోలీసులు పెట్టే చిత్రహింసలకు తట్టుకోలేక నిజం చెపితే...'' తన అనుమానం వ్యక్తం చేశాడు మస్తాన్.

''అందరం జైలుకుపోతాం! అలాంటిది జరగకుండా దొంగతనం జరిగాక ఆమెను మనతో తీసుకొద్దాం!'' అన్నాడు మైకేల్.

''వద్దు! అప్పుడు పోలీసుల అనుమానమంతా సుజాతపైనే వుంటుంది. ఆమె మన మనిషని తెలుసుకోనేందుకు ఎక్కువ కాలం పట్టదు. ఆమె అక్కడే వుండటమే మనకు క్షేమం!'' అన్నాడు గాడ్సే.

''అంతకన్నా ఆమెను మాట్లాడనీకుండా ఒక్క గుండు దెబ్బతో గుండెకాయ పనిచెయ్యడం ఆపుతే...'' అందాకా నోరు మూసుకున్న నాలుగో మనిషి మాట్లాడాడు.

''ఖాన్ సలహా కూడా బాగానే వుంది. ఇంత పెద్ద కార్యం జయప్రదంగా నిర్వహించడానికి మనం ఆమెను బలిచేసినా తప్పులేదు!'' అన్నాడు గాడ్సే.

''సారీ బాస్! ఆమె నా మనిషి. ఆమెవల్ల మీకు ఏ విధమైన ఆపదారాకుండా చూసే పూచీ నాది'' అన్నాడు మైకేల్.

''గుడ్! ఆమెవల్ల మాకు హానిజరుగుతుందని అనుమానమొస్తే ఆమెనేకాదు, నిన్నుకూడా చంపుతాం! ఈ విషయం అవసరమనుకుంటే ఆమెక్కూడా చెప్పు!'' అన్నాడు గాడ్సే.

మైకేల్ మాట్లాడకుండా మౌనంగా వుండిపోయాడు.

గాడ్సే ఖాన్‌ను, మస్తాన్‌ను చూసి ''మీ రిద్దరూ సుజాతకు సాయంచెయ్యాలి. మైకేల్ కారులో వెలుప

లుంటాడు. ఒకరు రాజాను, మరొకరు శోభారాణిని కాపలా కాస్తూ వుండాలి. వాళ్ళు కదలకుండా చూడాలి. అనుమానమొస్తే కాల్చి పారెయ్యండి. మన పనిమాత్రం నిర్విఘ్నంగా సాగిపోవాలి!'' అన్నాడు.

''అలాగే బాస్!'' అన్నారు ముక్తకంఠంతో.

''సుజాత నిధిని తెచ్చి నీకు అందిస్తుంది. అంతా లోనికి చేరాక రెండుసార్లు హారను మ్రోగించు. మస్తాన్, ఖాన్ ఇద్దరూ వచ్చేస్తారు. ఆ తర్వాత ముగ్గురూ ఇక్కడి కొచ్చెయ్యండి. అర్థమయిందా మన ప్లాను'' చెప్తూ చూశాడు మైకేల్ వైపు.

అర్థమయిందన్నట్లు తలూపాడు మైకేల్.

''మీరంతా వెళ్ళవచ్చు'' అన్నాడు గాడ్సే.

అందరూ సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

గాడ్సే కుర్చీ వెనుకనున్న కేస్ అల్మైరా తెరచుకుంది. అందులోనుండి శోభ వెలుపలికొచ్చింది.

''కూర్చో డియర్!'' అన్నాడు గాడ్సే.

సోఫాలో కూర్చుంది శోభ.

''ప్లాను రెడీచేశాను. ఎవరెవరికి ఏంచెయ్యాలో అంతా వివరంగా చెప్పాను'' అన్నాడు గాడ్సే.

''నేనూ విన్నాను. నాకుకూడా ఒకడ్ని కాపలా పెడుతున్నావ్. వాడ్ని కదిలితే కాల్చి పారెయ్యమనికూడా పురమాయిస్తున్నావ్. అంటే నన్ను మోసంచేద్దామనా నీ ఊహ!'' అడిగింది కోపంగా శోభ.

''కాదు!'' అన్నాడు గాడ్సే.

''నేనెలా నమ్మాలి!''

''పిచ్చిదానా! చేజిక్కిన బంగారు పిచికను, వయ్యారాల మొలకను చంపుకునే అవివేకి కాదీ గాడ్సే. నువ్వు

నాతో చేతులు కలిపావనీ, నీ కోరికపైనే ఈ నాటకం ప్రారంభమైందనీ ఎవ్వరికీ తెలియడం నా కిష్టంలేదు. అందుకే అలా అన్నాను" అన్నాడు గాడ్సే.

"నాన్సెన్స్! నీ కాకమ్మ కబుర్లు కట్టిపెట్టు. అంత సులభంగా మోసపోదీ శోభ" అంది ముక్కులు పెద్దవి చేసుకుని.

"నిజం శోభా! నిన్ను కాపలా కాయమని మస్తాన్‌కు చెప్పాను. అతనికి గుళ్ళులేని పిస్తోలిస్తాను. కాల్చినా నీకేం భయంలేదు. అతను పిచ్చిగా నీపైనబడితే నిన్ను నువ్వు రక్షించుకునేందుకు నీకూడా రివాల్వరు ఇస్తాను. వుంచుకో!" అన్నాడు గాడ్సే.

"నన్ను నేను ఎలా రక్షించుకోవాలో బాగా తెలుసు నాకు. నాకు అన్యాయం జరిగాక అట్టే కాలం స్వేచ్ఛగా నువ్వు తిరిగేదారి లేకుండా కట్టుదిట్టం చేసిపెడతాను. అది మాత్రం గుర్తుంచుకో. దొంగతనం జరిగాక నాకు మూడొంతుల నిధి ఇవ్వాలి. దాంతో మనకున్న సంబంధం సమసిపోతుంది" అంది శోభ.

"అలాగే!" అన్నాడు గాడ్సే.

"వస్తాను!" అంటూ చకచక వెలుపలికొచ్చింది. బార్‌కు వెనుక వేపు వీధిలో వున్న కారెక్కి బంగళా వేపు పోనిచ్చింది.

బంగళా ఇంకో రెండు ఫర్లాంగులుందనగా కారు ఆగిపోయింది ఠక్కున. ఎందుకాగిందో అర్థంగాక క్రిందికి దిగి చూసింది. ముందు టైరు గాజుపెంకుకు గ్రుచ్చుకుని పంచరయి గాలిపోటంతో రోడ్‌కు కిర్రుమని గీచుకుని ఆగిపోయిందని అర్థంచేసుకుంది శోభ.

కారు నక్కడే వదిలేసి నడచుకుంటూ బంగళాకు

బయలుదేరింది. నడవడం అంతగా అలవాటు లేకపోవడం తోనూ, త్రాగిన మత్తులో వుండడంతోనూ అడుగులు తడబడ్డాయి. రెండు ఫర్లాంగులు నడిచేసరికి దాదాపు అరగంట పట్టింది.

గేటు దాటింది. అక్కడనుండి పోర్టికోదాకా తోట మధ్యగా వేసిన కాంక్రీటురోడ్ వారగా చెట్లను చూసుకుంటూ నడవసాగింది. పోర్టికో మెట్లెక్కి హాల్లోకి అడుగు పెట్టబోతూ ఆగింది. లోపల్నుంచి ఏవో మాటలు వినిపించడంతో ఆగి, అక్కడ్నుంచి కదలి కిటికీవద్దకు నడచింది. దానికున్న కర్టెన్ తొలగించి లోనికి చూసింది.

రాజాగారు వీల్ ఛెయిర్‌లో వున్నారు. దగ్గరగా వున్న సోఫాలో సుజాత కూర్చునుంది. ఆమె వొంటిపైన తను అంతకుముందు రోజు కట్టి విప్పిన చీర వుంది. దాంట్లో అందంగా మెరసి పోతూంది సుజాత. తనకు తెలీకుండానే పళ్ళు కొరింది శోభ.

చెవులు రిక్కించి లోపలి ఇద్దరి మధ్య జరుగుతున్న సంభాషణ వినసాగింది.

"అనవసరంగా నువ్వు బెంబేలు పడుతున్నావు. నీకు ఏ విధమైన ఆపద రాకుండా కాపాడే పూచీ నాది. నా హోదా, పలుకుబడి నీకు తెలుసనుకుంటాను. నువ్వు నిర్భయంగా నిజం చెప్పు" అని ధైర్యం చెపుతున్న రాజా మాటలు వినిపించాయి.

"నాకు పోలీసులంటే భయం. అంతా చెప్తాను ఆ ముఠా వాళ్ళ చేతుల్లోంచి తప్పించుకుందంటే నన్ను వేటాడుతారు" అంటోంది సుజాత.

"ఆ అవకాశం వుండదు. కావాలంటే నా వెంటరా. నీకు ఆ నిధివున్న రహస్య స్థలం చూపిస్తాను" అన్నాడు.

"వద్దండీ! నాకు మీ ఆదరణగానీ, వాళ్ళ పొత్తుగానీ అవసరంలేదు. నే నెక్కడికన్నా పారిపోయి పడుపు వృత్తిలోనే బ్రతుకుతాను. వీటికన్నా అదే మేలులాగుంది" అంది సుజాత.

"పూర్ క్రీచర్! జీవితంలోకి మజా వచ్చేది డబ్బుతో. స్వంత బంగళా, కారు, బట్టలు, డబ్బు, నౌకర్లు, ఇవన్నీ ఈ జీవితంలో నువ్వు పొందగలవా? నేను చెప్పినట్లు విన్నావంటే అవన్నీ నీకు సులభంగా అమరుతాయి. ఆలోచించు. ధైర్యం తెచ్చుకో!" చెప్పాడు రాజాగారు.

సుజాత రెండు కణతలూ నొక్కుకుంది. తల క్రిందకు వంచుకుంది. రాజాగారు సిగరెట్ ఎడతెరిపి లేకుండా త్రాగుతూ వుండిపోయారు.

"సరే! చావుకు భయపడ్డంతవరకూ, బ్రతుకుకు వెలుగు రాదు లాగుంది. చూపించండి" అంది సుజాత.

రాజాగారు కుర్చీలోంచి లేచారు.

"మీ కాళ్ళు..." అంది ఆశ్చర్యంగా సుజాత.

"చచ్చుబడ్డాయి. కానీ ఈమధ్య బాగయినాయి. ఆ విషయం ఎవ్వరికీ తెలీదు. తెలుసుకొన్న మొదటి వ్యక్తివి నువ్వే! పద!!" అన్నాడు రాజాగారు.

"ఎందుకలా రహస్యంగా దాచుకున్నారు?"

"డబ్బుగలవాడి బ్రతుకే ఒక పెద్ద రహస్యం. అనవసరమైన విషయం గురించి ఎక్కువగా ఆలోచించడం, ఆరాలు తీయడం అంత మంచిపనికాదు. నా వెంటరా!" అంటూ ముందుకు నడిచాడు.

సుజాత ఆయన్ను అనుసరించింది.

శోభ చెప్పులు వదిలేసి హాల్లో కురికింది. వీల్ చెయిర్ పైనున్న నల్లటి గుడ్డ తీసుకుని కప్పుకుంది. ముందుపోతున్న

ఇద్దరికీ కొంత దూరంగా వెంటాడుతూ నడవసాగింది.

రాజాగారు పెరటి గుమ్మంగుండా తోటలోకి ప్రవేశించాడు. తోట మూలగావున్న చిన్న మండపం మెట్లెక్కాడు. ఆ మండపానికి నాలుగు స్తంభా లున్నాయి. ఒక స్తంభానికున్న చిన్న స్విచ్ నొక్కారు. మండపం మధ్యనున్న నేల రెండుగా చీలింది.

ఆశ్చర్యంగా చూస్తూ నిలుచుంది సుజాత.

"ఈ స్విచ్ నొక్కకుండా మనిషి మండపంలోకి అడుగుబెడితే వెంటనే పోలీస్ కంట్రోల్ రూంలో అలారం మ్రోగుతుంది. వెంటనే పోలీస్ వేన్ బయలుదేరివస్తుంది" అన్నాడు రాజాగారు.

"ఇప్పుడు ఆ అలారం మ్రోగదా?"

"మ్రోగకుండా స్విచ్ ఆఫుచేశాను. నా వెంట లోనికిరా!" అంటూ రాజాగారు చీలిన నేలభాగంనుండి క్రిందికి పోతున్న మెట్లవద్ద ఆగి పిలిచాడు. సుజాత ఆయన్ను అనుసరించింది. ఇద్దరూ పది మెట్లు క్రిందకు దిగారు. అక్కడ అడ్డంగా ఒక పెద్ద తలుపు కనుపించింది. దానికి మూడు లీవర్ల లాక్ వుంది. దాని డయల్స్ పైన ఒకటినుండి తొమ్మిది దాకా అంకెలు వున్నాయి.

"ఈ అంకెలు చూసి దీనికేదో కాంబినేషన్ వుందను కుంటారు దొంగలు. వాళ్ళను మోసం చెయ్యడానికే అలా ఏర్పాటు చేయించాం. మూడు డయల్స్ ఒకటిలోకి వచ్చాయంటే మరో అలారం మ్రోగుతుంది. వెంటనే పోలీసులు వస్తారు" అన్నాడు రాజాగారు.

శోభ మండపంలోనే నిలుచుంది. మెట్లు దిగి వెళ్తే తన్ను లోనున్న వాళ్ళు చూస్తారన్న భయం పట్టుకుంది. చెవులు నేలమాళిగవేపు పెట్టి మాటలు వినవస్తాయేమోనని

ఆశగా కూర్చుంది.

"అయితే దీన్ని తెరవడం ఎలా?" అడిగింది సుజాత.

"ఆ డయల్స్‌పైన వేలుపడకుండా మధ్యనున్న పద్మంలో స్విచ్‌ను వేలితో నొక్కితే చాలు. తలుపులు తెరచుకుంటాయి. అలా చెయ్యడంలో పొరపాటున ఒక్క వేలు డయల్‌కి తగిలినా అలారం పనిచేస్తుంది," అని విడమర్చి చెపుతూ చూపుడువేలు జాగ్రత్తగా పద్మం మధ్యనున్న చిన్న స్విచ్‌పైన పెట్టి నొక్కాడు రాజా గారు. తలుపులు తెరచుకున్నాయి.

ఎదురుగా చీకటి గుయ్యారంలా కనుపించసాగింది.

"రా లోపలకు!" అన్నాడు సుజాతను.

"చీకటి గావుంది" అంది.

జేబులోంచి పెన్ టార్చి తీసి వెలిగించాడు. సన్నటి వెలుతురులో ముందుకు నడిచాడు రాజాగారు. అతన్ననుస రించిందామె.

"ఇక్కడ లైటు లేదా?"

"వుంది."

"మరి దాన్ని వెలిగించగూడదు."

"ఆ స్విచ్ నొక్కామంటే లైటు వెలుగుతుంది. దాంతోపాటే ఆ తలుపులు మూసుకుపోతాయి. మళ్ళీ ఎవ రన్నా తెరిస్తేనే దిక్కు. ఎవ్వరూ తెరవకుంటే గాలి ఆడక, ఊపిరి పీల్చలేక గిలగిల కొట్టుకొని చావాల్సిందే" అన్నాడు రాజాగారు. ఆయన చేతిలోవున్న టార్చి వెలుగులో ఒక పెద్ద పెట్టె కనుపించింది. రాజాగారు దానిమూత పైకెత్తారు. లోపలున్న వస్తువులపైన టార్చి వేశారు.

కళ్ళు జిగేలుమన్నాయి సుజాతకు. అంత విలువైన నగలు, వజ్రాలు, హారాలు, ముత్యాలు, రాసిపోసివుండగా

జీవితంలో ఎప్పుడూ చూచింది గాకపోవడంతో, మైకం క్రమ్మినట్లయి తూలిపడింది ఆ పెట్టెపైనే.

రాజాగారు తట్టి లేపారు.

సుజాత కళ్ళు తెరచింది.

"ఏమిటలా పడిపోయావ్?"

"మైకం క్రమ్మింది."

"నువ్వు సుఖపడటానికి ఈ నిధి చాలా?" నవ్వుతూ అడిగాడు.

"ఇంకో ఇరవైమార్లు చచ్చి పుట్టినా తరగనంత సంపదుంది మీ అధీనంలో" అంది సుజాత.

"నాకు ఇది ఎంత విలువైందో, నీ పొందుకూడా అంతే విలువైంది. నేను చాలామంది ఆడవాళ్ళ చేతిలో మోసపోయాను. ముఖ్యంగా శోభ చేతిలో. ఎన్నడూ ఇవ్వనిది నీదగ్గర చిక్కుతుందన్న ఆశవుంది."

"శోభ నెలా వదలించుకుంటారు."

"అదో పీడ కుక్క. దానికి కావలసింది డబ్బు. తనకై తనే విడాకులు పుచ్చుకునేట్లు చేస్తాను. అటువంటి పరిస్థితిలో ఒక లక్ష పారేస్తే చాలు."

"ఏమో అనుకున్నాను. మీరు చాలా అసాధ్యులే!" అంది సుజాత.

"కానీకి కొరగాని వెధవల్లో అసాధ్యులున్నారు. అన్నీవున్న నేను అసాధ్యుడిని కాకుంటే ఆశ్చర్యపడాలి! అంతే!" అంటూ వెలుపలికొచ్చాడు. అన్ని ద్వారాలు యథాప్రకారం మూసివేసి తోటలో కొచ్చారిద్దరూ. అంతకు ముందే శోభ తన గదికి వెళ్ళిపోయింది.

రాజాగారు హాల్లోకి రాగానే ఈజీ ఛెయిర్ లో జేరబడ్డాడు. సుజాత తన గదికి వెళ్ళిపోయింది.

# 6

తెల్లవారిందాకా నిద్రపోకుండా త్రాగుతూ కూర్చుంది శోభ. అద్దంలో ముఖం చూచుకుంది. కళ్ళు ఎరుపెక్కిపోయాయి.

రాజాగారి కపటనాటకం, సుజాత ద్వంద్వ వేషం కళ్ళారా చూసింది. గాడ్సేతో చేతులు కలిపింది డబ్బు కోసం. అది తనకు దక్కకుండా పైఎత్తు వేసిన రాజాగార్ని ఎలా చిత్తు చెయ్యటమాని ఆలోచించసాగింది.

జరుగుతున్న ఘోరాన్ని గాడ్సేకి చెప్పాలనుకుంది ఆవేశంలో. ఆలోచించాక అది అంత తెలివైన పనిగా తోచలేదామెకు. ఎలాగైనా ఆ నిధిని పొందాలనుకుంది. దాంతోనే వీలైతే గాడ్సే ముఠాను కూడా మట్టుపెట్ట దలచుకుంది. దానికి మార్గమేమిటా అన్నదే ఆమె రాత్రంతా వెతికింది.

తెల తెలవారుతూండగా మెరుపులా వచ్చింది ఆలోచన. లేచి మొహం కడుక్కుని బట్టలు మార్చుకుని బెల్ కొట్టింది.

సుజాత పరుగెత్తుకొంటూ వచ్చింది.

"అమ్మగారూ! మీరు వచ్చారా? ఎప్పుడూ?" అడిగింది ఆతృతగా.

"బాగా ప్రొద్దుపోయింది. నా కోసం ఎవరన్నా వచ్చారా?"

"రాలేదండీ!"

"అలా కళ్ళు ఎర్రబడ్డాయేం. నిద్రపోలేదా?"

"బాగానే నిద్రపోయానండీ!" అంది కళ్ళు నేలకేసి త్రిప్పుకుని.

"నా దగ్గర గంజాయి స్టాకు అయిపోయింది. నువ్వెళ్ళి

మైకేల్ దగ్గరనుండి తెచ్చిపెట్టాలి'' అంది శోభ.

''అలాగేనమ్మా!'' అంది.

''గుడ్! నువ్వు ఇప్పుడే వెళ్ళిపోవచ్చు. నాకు కొన్ని ముఖ్యమైన పనులున్నాయి. అవి చూసుకుని ఒంటిగంటకు వస్తాను. ఆలోగా వచ్చెయ్యి, చాలు!'' అంది శోభ.

''గంటలో వచ్చేస్తాను'' అంత టయిం అవసరం లేదన్నట్లు చెప్పింది సుజాత.

''నీ ఇష్టం! నువ్వు వెళ్ళవచ్చు. ప్రస్తుతం నీతో నాకేం పనిలేదు!'' అంది శోభ.

సుజాత గదికి తిరిగి వచ్చింది.

తను రాత్రి తెలుసుకున్న నిధి రహస్యాలు, అక్కడికి వెళ్ళవలసిన పద్ధతి మొత్తం మరచిపోకుండా వుండేందుకు రాసి వుంచుకున్న కాగితంతీసి మడతపెట్టి జాకెట్‌లో దోపుకుంది. బట్టలు మార్చుకుని బయలుదేరింది.

హాల్లో వున్న రాజాగారు ''వెళ్తున్నావా?'' అడిగాడు మెల్లగా రెండో మనిషికి వినిపించకుండా జాగ్రత్త పడుతూ.

''ఆс!'' అంది.

''వివరాలు మరచిపోకుండా చెప్పిరా.''

''అలాగే!''

''శోభ లేదా గదిలో.''

''వుంది. ఆవిడ తన పనిపైన వెళ్ళి రమ్మంది.''

''ఎన్నింటికొస్తావ్.''

''గంటలో వస్తాను.''

''ఎదురుచూస్తూ వుంటాను. త్వరగా వచ్చెయ్యి'' అన్నాడు రాజాగారు.

అలాగేనంటూ తలూపి వెళ్ళిపోయింది.

ఆమె కనుమరుగుకాగానే, కుర్చీని మూలనున్న ఫోన్ వద్దకు నడిపించుకు వెళ్ళాడు. పోలీస్ స్టేషనుకు డయల్ చేశాడు. కనక్షను దొరికింది. అవతలివేపునుండి 'హలో' అని రెస్పాన్సు రాగానే "నేను. రాజారఘునందనరావును మాట్లాడుతున్నాను. మీరో గంట తర్వాత నా వద్దకు రావాలి" అన్నాడు.

"అలాగే!" అని ఇన్స్పెక్టరు అన్నాడు.

"మీ కోసం ఎదురుచూస్తూ వుంటాను" అంటూ ఫోన్ పెట్టేసి, కుర్చీని హాలుమధ్యకు నడిపించుకొచ్చాడు.

నాలుగు సిగరెట్లు కాల్చడం పూర్తయ్యాక వాచీ చూసుకున్నాడు. సుజాత వెళ్ళి గంటపైన ఇరవై నిముషాలయింది. అంటే పోలీసులకు తను ఫోన్ చేసి కూడా అంతే టయిము వుండాలి. ఎవ్వరూ రాలేదు. ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

శోభ వచ్చింది.

"మార్నింగ్!" అంటూ విష్ చేసింది.

"మార్నింగ్ శోభా!అర్జంటు పనిమీద వెళ్తున్నావా?" యధాలాపంగా అడిగాడు రాజాగారు.

"అఁ! నాతో మీ కేమైనా అర్జంటు పనుందా?"

"లేదు! నువ్విలా బరితెగించి తిరిగి నా పరువు బజారు పాలు చెయ్యడం న్యాయంగాలేదు" అన్నాడు రాజా.

"కాళ్ళు నచ్చుబడి చక్రాల కుర్చీలో కూర్చున్న నీ కళ్ళముందు కూర్చుని నా అందాన్ని, యవ్వనాన్ని, కాలాన్ని వృధా చేసుకోమనడం నీకు న్యాయంగా వుందా?" ఎదురు ప్రశ్న వేసింది.

"నన్ను భర్తగా తలచుకోవడం నీకు అయిష్టంగా వుంటే విడాకులు పుచ్చుకోరాదూ!"

"అదే మాట నేనడిగితే!"

"నేను నీపట్ల అన్యాయంగా ప్రవర్తించడం లేదే!"

"నీ ఎత్తు నాకు తెలుసు. నాకై నేను విడాకులు పుచ్చుకుంటే చేతి చిలుము వదలకుండా పీడ విరగడ చేసుకోవచ్చు ననుకుంటున్నావ్. అలా ఎన్నటికీ జరగదు. నీకై నువ్వు విడాకులు కోరుకునేదాకా నిన్ను వదలను. నీ కళ్ళముందే పరాయి మగాళ్ళతో రాసక్రీడలు జరుపుతాను. నా జీవితం నాశనం చేశావ్. నీపైన పగ రేగుతూంది నాలో" అంది కోపంగా శోభ.

"అలాగే కానీ! గెలుపెవరిదో విధి నిర్ణయిస్తుంది. నేను చెప్పదలచుకుంది చెప్పాను" అన్నారు రాజాగారు.

శోభ మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

ఆమెపోయిన పదినిముషాలకు సుజాత వచ్చింది.

"ఆమె వెళ్ళిపోయిందా?" అడిగింది.

"ఆc! ఇంతకుముందే!"

ఠక్కున సోఫాలో కూలబడింది. "ఆ గాంగును కలుసుకున్నాను. అంతా వివరంగా చెప్పాను. మరచిపోకుండా వుండేందుకు మీరు దగ్గరుండి రాయించిన కాగితం కూడా ఇచ్చాను. వాళ్ళంతా ఆనందంతో గంతులేశారు. రేపు రాత్రికి దాడిచేస్తారట" అంది సుజాత.

"గుడ్! నీపైన అనుమానం కలిగిందా?"

"లేదు!" అంది సుజాత.

అంతలోనే పోలీస్ ఇన్‌స్పెక్టర్, మరో ఇద్దరు సూట్‌వాలాలను వెంటబెట్టుకుని వచ్చారు. వాళ్ళను కూచోమని సైగచేశారు రాజాగారు. ముగ్గురూ కూర్చున్నారు.

"ఇన్‌స్పెక్టరుగారూ!" అంటూ తన నిధిని తస్కరించేందుకు గాడ్సే ముఠా వేసిన పథకం మొత్తం వివరంగా

చెప్పాడు రాజాగారు.

"నిన్నెక్కడో చూసినట్లుంది!" అన్నాడు సుజాతను చూడగానే ఇన్‌స్పెక్టర్.

"ఆవిడ పాత కేడీ!" అన్నాడు ప్రక్కనున్న సూట్ వాలా.

"నిన్ను గాడ్సే గాంగు ఇక్కడికి పంపిన మాట నిజమేనా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

అవునన్నట్లు తలూపింది.

"వాళ్ళగురించి మాకు చెప్పావ్. ఈ విషయం వాళ్ళకు తెలిస్తే నిన్ను దారుణంగా హత్య చేస్తారు. అలాంటి ఘోరం జరగకుండా తగిన బందోబస్తు చెస్తాం. కానీ నాకన్నా వాళ్ళగురించి నీకు తెలుసు ఎక్కువగా. ప్రాణాలతో ఎన్నో రోజులు వుండనివ్వరు. ఆ సంగతి ఆలోచించావా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఫరవాలేదు! రాజాగార్ని మోసం చెయ్యడానికి మనసొప్పలేదు. అందుకే యీ నిర్ణయం తీసుకున్నాను."

"గుడ్! వాళ్ళెప్పుడు దొంగతనానికి వచ్చేదీ నిర్ణయమైందా?" అడిగాడు ఇన్‌స్పెక్టరు.

"రేపు రాత్రికి."

"ఎలా వస్తారు లోనికి."

"నన్ను సింహద్వారం తెరచిపెట్టమన్నారు. ఖాన్, మస్తాన్ లోనికొస్తారు. మైకేల్ వెలుపల కార్లో వుంటాడు. నన్ను నిధి దొంగిలించి మెల్లిగా మైకేల్‌కు అందించమన్నారు. నా ఒక్కదానివల్ల ఆ పనికాదని చెప్పాను. దాంతో మైకేల్‌ను నాకు తోడుగా వెళ్ళమన్నారు. మేమిద్దరం దాన్ని కార్లోకి చేరుస్తాం. ఆ తర్వాత రెండుసార్లు హారను మ్రోగిస్తాం. లోపలున్న ఇద్దరూ వస్తారు.

ఆ తర్వాత వాళ్ళు ముగ్గురూ వెళ్ళిపోతారు'' అంది సుజాత.

''నువ్వు ఇక్కడే వుంటావా?''

''వుంటాను. అలా వుండటం వాళ్ళకు మంచిదని చెప్పారు.''

''ఆ క్షణంనుండి ఆమెను మీరు కాపాడాలి'' అన్నాడు రాజాగారు.

''ఆల్ రైట్! నేను అన్ని ఏర్పాట్లు చేస్తాను'' అన్నాడు ఇన్ స్పెక్టర్ లేస్తూ.

''రేపు రాత్రికి నేనూ శోభా ఇంట్లో వుండం. వీలైనంత వరకు వెలుపలే అర్ధరాత్రిదాకా గడిపేందుకు ప్రయత్నం చేస్తాను. పన్నెండింటికి ఫోన్ చేసి ఆ తర్వాత వస్తాను'' అన్నాడు రాజాగారు.

''దట్స్ గుడ్!'' అంటూ శెలవు పుచ్చుకుని వెళ్ళి పోయాడు ఇన్ స్పెక్టర్.

''ఆయనముందు ధైర్యంగా మాట్లాడానుగానీ నాకు భయంగా వుంది'' అంది సుజాత.

''భయపడకు. అంతా సవ్యంగా జరుగుతుంది. ఈ ముతాను మట్టుబెడితే మన నిధికోసం మరెవ్వరూ ఈ జన్మకు ప్రయత్నం చెయ్యరు. రేపు రాత్రికే శోభకు విడాకులిచ్చే విషయం గురించి నిర్ణయం చేస్తాను. ఎల్లుండి నుండి మనం క్రొత్త జీవితం ప్రారంభం చేద్దాం!'' అన్నాడు రాజాగారు.

సుజాత మాట్లాకుండా కూర్చుంది.

''మనల్నిద్దర్నీ మీ అమ్మగారు ఇలా చూస్తే లేనిపోని అనుమానాల్తో నా ప్రాణాలు తీస్తుంది నువ్వెళ్ళు'' అన్నాడు.

సుజాత లేవలేక లేచి, తడబడే అడుగుల్తో తన గది వైపు కదలిపోయింది.

# 7

ఆ మరుసటి దినం.

ఏడుగంటల ప్రాంతంలో శోభ గదిలో వున్న ఇంటర్ కామ్ మ్రోగింది.

రిసీవరు పైకెత్తి "హల్లో" అంది.

"నేను. త్వరగా డ్రస్ చేసుకుని రా. బయటకు వెళ్ళొద్దాం!" అన్నాడు రాజాగారు. శోభకు ఆశ్చర్యం, అనుమానం ఒక్కసారే కలిగాయి. "ఎందుకు?" అడిగింది.

"నీకు విడాకులివ్వదలుచుకొన్నాను. మన లాయరుతో మాట్లాడి వచ్చాం. చట్టప్రకారం నా ఆస్తిలో ఎన్నోవంతు నీ కివ్వాలో అడిగి తెలుసుకుని అందుకు కావలసిన కాగితాలుతయారు చేయించాలనుకున్నాను."

"ఏ. సీ. దాని కివాళే ముహూర్తం పెట్టారేం! నాకు వీలుకాదు. రేపయితే వస్తాను!" అంది శోభ.

"ఇవాళే జరిగితే బాగుంటుంది. రేపటికి నా మనస్సు మారవచ్చు" అన్నాడు రాజాగారు.

ఆలోచనలోపడింది శోభ. రాజాగారికి తన మనస్సులో జరుగుతున్న గందరగోళం తెలిసి పిలుస్తున్నాడో, లేక నిజంగానే విడాకులిచ్చేందుకు సిన్సియర్‌గా నిర్ణయించుకున్నాడో అర్థంకాలేదు.

"ఆల్ రైట్! పదినిముషాల్లో వస్తాను" అంది శోభ ఫోన్ పెట్టేస్తూ.

డ్రెస్ చేసుకుని, హాండ్ బ్యాగ్ తీసుకుని హాల్లోకి వచ్చింది. రాజాగారు కుర్చీలో కూర్చుని వున్నారు. చేతిలో చిన్న ఫైలుంది. డ్రయివరు లోనికొచ్చాడు. అతనూ,

శోభా కలిసి రాజాగార్ని ఎత్తుకుపోయి కారులో కూర్చోబెట్టారు. మనస్సులోనే నవ్వుకుంది అతను ఆడుతున్న కపట నాటకానికి. నడవడం చేతవచ్చి కూడా నటించడం ఎందుకో ఆమెకు అంతుబట్టలేదు.

కారు లాయరు ఇంటి ముందాగింది.

ఇద్దరూ దిగి లోపలికి వెళ్ళారు. లాయరు గారి గుమస్తా వచ్చి సాయంపట్టాడు. రాజాగారు స్వయంగా వచ్చినందుకు లాయరు బాధపడ్డాడు. కబురుచేస్తే తనే వచ్చి వుండేవాడినని నాలుగుసార్లు చెప్పాడు.

లాయరుతో వచ్చిన పని చెప్పాడు. ఆయన కేస్ లా పుస్తకాలు వేరే కాగితాలు అన్నీ తిరగేసి ఆస్తిలో సగానికి తక్కువగాకుండా శోభ పేర రాయవలసి వుంటుందని సలహా చెప్పాడు.

గంట తొమ్మిదయిందప్పటికే. శోభకు విసుగ్గా వుంది.

“మీరు చెప్పినంత ఇవ్వటం నా కిష్టంలేదు. నా ఉప్పు తింటూ, నా పెళ్ళాన్నని చెప్పుకుంటూ, నా కళ్ళముందే పరాయి మగాళ్ళతో కులికే ఈ నీచురాలికి అంత మొత్తం ఇవ్వడం నా కిష్టంలేదు.లక్షరూపాయలిస్తాను. విడాకులివ్వమనండి!” అన్నాడు లాయరుతో రాజాగారు.

“మీరు విన్నారా ఆయన చెప్పింది” అడిగాడు లాయరు శోభను.

“విన్నాను. పెళ్ళి పేరుతో నా భవిష్యత్తుకు బేడీలు వేశాడాయన. నన్ను సుఖపెట్టడం మాని కేవలం కామ దాహం తీర్చే పశువుగా మార్చాడు. ఆయన భార్యను నేను. ఆస్తిలో సగంవాటా ఇవ్వాలిసిందే!” అంది శోభ.

“ఆమె అవినీతి ప్రవర్తన గురించి మీ దగ్గర ఋజువు

లుంటే ఏదైనా చెయ్యగలను. లేకుంటే ఆమెకు ఆస్తిలో అర్ధభాగం ఇవ్వక తప్పదు!'' అన్నాడు లాయరు.

శోభ కళ్ళు విజయగర్వంతో మెరిశాయి.

''ఇవ్వను!'' అన్నాడు రాజాగారు.

''ఎలా ఇవ్వవో చూస్తాను. ఆ దారికొచ్చిందాకా నీదారి కడ్డంగా వుంటాను. నీ గుండెలు పిండేట్టు నీముందే పరాయి మగాళ్ళతో తిరుగుతాను. గుడ్ బై!'' అంటూ చకచక వెళ్ళిపోయింది శోభ.

లాయరుగారు మౌనంగా కూర్చున్నారు.

''నేను కూడా వస్తానండీ!'' అన్నాడు రాజాగారు.

''తమర్ని కారెక్కిస్తాను.''

''కారామె తీసుకుని వెళ్ళివుంటుంది. టాక్సీకానీ, రిక్షా గానీ చూడండి'' అన్నాడు రాజాగారు.

లాయరుగారు రిక్షా మాట్లాడి లోనికొచ్చి, రాజాగార్ని సాయంపట్టి అందులో కూర్చోబెట్టాడు. రిక్షా వెళ్ళి పోయింది.

తొమ్మిదింటికల్లా ఆదెమ్మను పంపించేసింది సుజాత. హాలు తలుపులు తీసిపెట్టింది. నల్లచీర కట్టుకొని జాకెట్ తొడుక్కుంది చీకట్లో ఎవ్వరికీ కనిపించకుండా వుండేం దుకు. ఆ తర్వాత వీధిలోకొచ్చి నిలుచుంది.

తొమ్మిదిగంటలా ఇరవై నిముషాలకు కారాగింది. మస్తాన్, ఖాన్ దిగారు. మైకేల్ కారును మరో ఇరవై గజాలు ముందుకు తీసుకెళ్ళి ఆపి ఇంజన్ ఆన్ చేసే వుంచి వచ్చాడు.

అందరూ బంగళాలోకి ప్రవేశించారు.

''వాళ్ళెక్కడున్నారు?'' అడిగాడు మైకేల్.

''ఇద్దరూ ఎక్కడికో వెలుపలకుపోయారు. ఇంకా

రాలేదు" అంది సుజాత.

"నీతో ఏమీ చెప్పలేదా?" అడిగాడు మస్తాన్.

లేదన్నట్లు తల అడ్డంగా ఊపింది.

"అయితే మేము వెలుపలే ఉంటాము" అన్నారిద్దరూ మైకేల్ తో.

"అందరం నిధి దగ్గరకు పోదాం" అంది సుజాత.

ఆమె సలహాకు ఒప్పుకున్నారు

"మీ దగ్గర టార్చిలైటు వుందా?" అడిగింది.

"లేదు! మర్చిపోయాం. నీ గదిలో లేదా?" అడిగాడు మైకేల్.

"వుంది. వెళ్ళి తెస్తాను" అంది సుజాత.

"వద్దు. నేను వెళ్ళి వస్తాను" అంటూ మైకేల్ వెళ్ళిపోయాడు.

సుజాత మొదట స్విచ్ నొక్కింది. నేల అడ్డంగా చీలింది. మెట్లుకనుపించాయి. ఆమె ముందూ మిగిలిన ఇద్దరూ వెనుక క్రిందకు నడిచారు. రెండో తలుపుకూడా పద్మంలో చెయ్యిపెట్టి స్విచ్ నొక్కి తెరచింది. ఆ తలుపులు కూడా తెరచుకున్నాయి.

"టార్చిలైటు వస్తే వెలిగించి నిధిని మెల్లగా వెలుపలికి చేరుద్దాం!" అంది సుజాత.

రెండు క్షణాలు మైకేల్ కోసం చూశారు. అతని జాడలేదు.

"లైటు ఎక్కడ పెట్టావో కనుపించినట్లులేదు" అన్నాడు ఖాన్.

"టైం వృధా చెయ్యకూడదు. ఆ పెట్టె మొత్తం వెలుపలకు లాగుదాం. మనం ముగ్గురం సాయంపడితే పెట్టెను లాక్కురావచ్చు" అన్నాడు మస్తాన్.

సుజాతను వెంటబెట్టుకొని లోనికి పోయారు. పెట్టెను చేతులతో తడిమి ఆరు చేతులపైన పైకెత్తారు. లోపలున్న స్థలం చాలా ఇరుకు కావటంతో అటూ ఇటూ మెదిలేందుకు స్థలం లేకపోయింది. గోడకున్న పియానో లైట్ స్విచ్‌కు మస్తాన్ వీపు అనుకుంది.

కళ్ళు మిరుమిట్లు గొలిపేలా లైటు వెలిగింది. దబ్బున శబ్దం చేస్తూ లావుపాటి ఇనుపగోడ అడ్డం పడిపోయింది. ముగ్గురూ లోపల చిక్కుకుపోయారు.

మైకేల్ కారిడార్‌లో కొచ్చి నిలుచున్నాడు. సుజాత గది ఏదో అతనికి సరిగ్గా తెలీదు. ఒక తలుపు నెట్టాడు. లోపల శోభ కనిపించింది. అటుకేసి తిరిగి నిలుచుని రివాల్వర్‌లో గుండ్లు సర్దుతోంది. చప్పుడు కాకుండా మెల్లగా తలుపు మళ్ళీ మూసేసి ప్రక్కగదిలో జొరపడ్డాడు. సుజాత బట్టలు కనుపించాయి అందులో. టార్చిలైటు కోసం వెతికాడు. దాదాపు ఐదు నిముషాలు పట్టింది దాన్ని చేజిక్కించుకుందుకు. తలుపు తెరుచుకుని కారిడార్‌లోకి వచ్చాడు.

ధన్ ధన్ మని రివాల్వరు కాల్చిన చప్పుడు వినిపించింది.

'అమ్మా' అంటూ ఆడమనిషి చేసిన ఆర్తనాదం వెను వెంట హృదయవిదారకంగా చెవుల్లో జొరబడింది.

మైకేల్ శోభ గదిముందు చూశాడు. అక్కడ్నుంచి నల్లసూటులో వున్న ఆకారం తిన్నగా పరుగెత్తిపోయింది. మైకేల్ దాని వెంటపడ్డాడు. నడవ చివర్లో మలుపు తిరిగాక అతను కనుపించలేదు. కానీ అక్కడ రివాల్వరు పడివుంది.

వంగి చేతికి తీసుకొని చూశాడు. అది తనదే. అంతకు

ముందు ఆత్మరక్షణ కోసం సుజాతకు ఇచ్చాడు.

కారిడార్‌లో లైట్లు వెలిగాయి.

పోలీసులు పరుగెత్తుకొచ్చారు. మైకేల్‌ను పట్టుకొన్నారు. క్రిందికి తీసుకొచ్చారు.

హాల్లో చక్రాల కుర్చీలో కూర్చున్న రాజాగార్ని చూసి ఆశ్చర్యపోయాడు ఇన్‌స్పెక్టర్.

"మీరొచ్చి ఎంత సేపైంది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఇప్పుడే వచ్చాను. కూర్చుంటూండగా మీరు వచ్చారు. ఏమయింది?" అడిగాడు తాపీగా.

"చాలా దారుణం జరిగింది. ఆ మైకేల్ శోభను కాల్చి చంపాడు."

"డబ్బుకోసం వస్తున్నారనుకున్నాను గానీ, ఇలా ప్రాణాలు తోడుకు పోయేందుకు వస్తున్నారనుకోలేదు" అన్నాడు రాజాగారు.

"నాకేం తెలీదు! నేను హత్య చెయ్యలేదు. సూటుతో వున్న మనిషి కాల్చి వెళ్ళిపోవడం చూశాను" అన్నాడు మైకేల్.

"మిగిలిన వాళ్ళేమయినారు" అడిగాడు రాజాగారు.

"నిధి దగ్గర వున్నారు. మా వాళ్ళు వెలుపల కాపలా వున్నారు. ఇంకా వెలుపలికి వచ్చినట్లు లేదు. రాగానే పట్టుకుంటారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అంబులెన్స్, పోలీసు బలగం అంతట్లోనే వచ్చి శోభ శవాన్ని పరిశోధన చెయ్యడం ప్రారంభమైంది.

తోటలో కాపలావున్న ఇన్‌స్పెక్టర్ వచ్చి "సార్! వాళ్ళు లోనికిపోయి అరవై నిముషాలయింది. ఇంతదాకా రాలేదు. నేను వెళ్ళి చూశాను. తలుపులు మూసి వున్నాయి. వాళ్ళెవ్వరూ కనుపించలేదు" అన్నాడు.

"లోపలి లైటుస్విచ్ కమర్చిన అలారం తగిలి, తలుపులు

మూసుకొని వుంటాయి. బహుశా అంతా లోపలే చిక్కబడి పోయారేమో" అన్నాడు రాజాగారు.

"అయితే తెరచే మార్గం లేదా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

దాన్ని తెరచే స్విచ్ ఎక్కడుందో చెప్పాడు రాజాగారు. అలా ప్రయోజనం లేదని రాజాగార్ని ఎత్తుకుని తీసుకుపోయారు అక్కడికి. తలుపులు తెరచారు. ఊపిరాడక, గాలిలేక, గిలగిల కొట్టుకొని చనిపోయిన సుజాత, ఖాన్, మస్తాన్‌ల శవాలు కనిపించాయి.

"దారుణం!"అన్నాడు కళ్లు మూసుకుంటూ రాజాగారు.

"నిజమే!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అంతా తిరిగి హాల్లోకి వచ్చారు. రాజాగార్ని చక్రాల కుర్చీలో కూర్చోబెట్టారు.

ఇన్‌స్పెక్టరు శోభ గదంతా వెతికాడు.ఆ సూటువాలా ఎవరో తెలుసుకునే క్లూ కోసం ఎంతో ప్రయత్నించారు. కానీ లాభం లేకపోయింది.

"ఆమెను ఎవరు చంపివుంటారో మీరూహించలేరా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఎంతో మందితో తిరిగే మనిషి. ఎవరు చేసివుంటారని చెప్తాం?" అన్నాడు రాజాగారు.

"మైకేల్ చంపి వుంటాడా?"

"అతనికీ అవకాశం, అవసరం రెండూ వున్నాయి. వాళ్ళ గాంగులీడరు గాడ్సేతో కూడా తిరుగుతోంది శోభ. అందర్నీ మోసంచేసి డబ్బుతో, సుజాతతో చెక్కేద్దామని ప్లానులోవున్నాడు మైకేల్. తన రహస్యం తెలిసిన శోభను చంపడం మంచిదనుకుని వుంటాడు" అన్నాడు రాజాగారు.

"దాంతో అతని సమస్య తీరదు. మిగిలిన వాళ్ళున్నా రుగా?"

"వాళ్ళను ట్రాప్‌లో వేసివచ్చి వుంటాడు. శోభను చంపాక వెళ్ళి, నిధిని తీసుకొని పారిపోదామనుకున్నాడేమో?"

"మరి సుజాత కూడా లోపలే వుందిగా?"

"డబ్బుంటే వందమంది సుజాతలు చిక్కుతారు" అన్నాడు రాజాగారు.

"మిస్టర్ రాజాగారూ, మీరు ఇంకా బుకాయించి ప్రయోజనం లేదు. శోభను చంపింది మీరే. అందుకు సాక్ష్యాలు చాలా వున్నాయి. ముఖ్యంగా కాళ్ళు చచ్చుబడి వున్న మీరు ఎవరి సహాయం లేకుండా ఇంట్లోకి ఎలా రాగలిగారు. అదీ మీరు సింహద్వారం నుండి రాక పెరటి గుమ్మం దాటి రావలసిన అవసరం మీకు ఏమిటి? మీరు వీధి మలుపులో రిక్షా దిగి పెరటి గుమ్మం ద్వారా రావటం, అక్కడ బట్టలు మార్చుకోవడం అంతా, ఇంటిచుట్టూ రహస్యంగా కాపలా కాస్తున్న మా మనుషులు చూశారు. ఇంకా..."

"ఇకచాలు, ఆపండి. శోభను నేనే హత్య చేశాను. శోభ నా ఊపిరి తీస్తూంది. నా పరువు రచ్చకెక్కించింది. ఆమెను చంపి ఆ నేరం రాకుండా వుండాలని సుజాతను లోబరుచుకుని పథకం వేశాను. ఆమె గదిలో వున్న రివాల్వరు దొంగలించాను. దాంతోనే శోభను చంపాను. ఆమెను చంపకుంటే నన్నామె చంపి ఆ నేరం వీళ్ళపైకి త్రోసివుండేది" అన్నాడు రాజాగారు నిట్టూరుస్తూ.

ఇన్‌స్పెక్టర్ రాజాగార్కి బేడీలు వేశాడు.

వాను బయలుదేరింది పోలీస్ స్టేషన్ వైపు.

—: ఐపోయింది :—

# దోపిడి దొంగలు!

## సంపత్

ఎండ నిప్పులు చెరుగుతూంది. గాలి ఆడటంలేదు.

అదంతా బీడు ప్రాంతం.

కనుచూపు మేరవరకు పిచ్చిగా పెరిగిన పొదలు తప్ప మరేమి కన్పించటంలేదు. బీడు మధ్యగా ఎర్రటి మట్టితో చిన్న మార్గం ఒకటి ఉంది.

ఆ సమయంలో ఒక యువకుడు ఆ దారమ్మట వస్తున్నాడు గుర్రంమీద.

తలపై హేట్ ఉంది. అది ఎగిరిపోకుండా చిన్న తాడు గడ్డం చుట్టూ ఉంది. ఆలివ్ రంగు దుస్తులు అక్కడక్కడ మాసిపోయి, దుమ్ము కొట్టుకొని ఉన్నాయి. ఇన్‌షర్టు చేశాడు. నడుముకి తూటాల బెల్టు. నడుముదగ్గర కుడి

వైపున కేస్‌లో రివాల్వర్ వేలాడుతూంది. కాళ్ళకు గట్టి తోలు చెప్పులు.

ఆ గుర్రం చాలా నెమ్మదిగా నడుస్తోంది. ఆ యువకుడు తలఎత్తి చుట్టూ చూశాడు. ఎండకి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. నోరు పిడచకట్టుకు పోతోంది. కనుచూపు మేరలో కొండలు నీలిరంగులో సాక్షాత్కరించాయి.

ఆ యువకుడు సోలిపోయి ఉన్నాడు. దాహంతో నోరు ఎండిపోతోంది. మధ్యమధ్య పెదాలను నాలికతో తడుపుకుంటున్నాడు. గుర్రంకూడా నెమ్మదిగా అడుగులు వేస్తోంది. అతని కళ్ళు భారంగా వాలిపోయాయి. దబ్బున గుర్రంమీద వాలిపోయాడు నిస్త్రాణతో. కాని గుర్రం ఆగలేదు. నెమ్మదిగా అడుగులు వేస్తూనే ఉంది. ఆ యువకుడికి స్పృహపోయింది.

ఇలా సుమారు గంట గడిచింది.

దూరంగా కన్పించిన రెండు, మూడు గాడిదలను చూసి సకిలించింది గుర్రం. ఆ యువకుడికి మెలుకువ రాలేదు.

అక్కడొక పల్లె ఉన్నదనటానికి నిదర్శనంగా దూరంగా ఇళ్ళు కన్పిస్తున్నాయి. ఆ గుర్రం నెమ్మదిగా పల్లెవైపు సాగింది.

ఊరిబయట ఉన్న పెద్ద బావిదగ్గర ఎవరో ఒక యువతి నీళ్ళు చేదుకుంటూంది. దూరంగా గుర్రం రావటం చూసిందామె. తను తెచ్చిన కుండను అలాగే వదిలి, ప్రక్కనే ఉన్న ఇంట్లో దూరింది. కిటికీలో గుండా చూడసాగింది.

ఆ గుర్రం నెమ్మదిగా బావిదగ్గరకు వచ్చి ఆగింది. అటూ ఇటూ చూసి పెద్దగా సకిలించింది.

ప్రక్కనే ఉన్న కుండలో నీళ్ళున్నాయి. మూతి పెట్టబోయింది కాని పట్టలేదు. గట్టిగా నూర్పింది. కుండపగిలి

నీళ్ళు నేలపాలయ్యాయి.

ఇదంతా ఆమె చూస్తూనే ఉంది.

ఆ గుర్రం అక్కడే నిలబడి పోయింది అటూ ఇటూ చూస్తూ.

ఆ యువతి కూడా అయిదు నిమిషాలు అలానే నిలబడి పోయింది గుర్రంవంకే చూస్తూ. గుర్రంమీద వ్యక్తి కన్పిస్తున్నాడు కాని, అతను వాలిపోయి ఉన్నాడు. ఏదో నిర్ధారించుకొని నెమ్మదిగా బయటకు నడిచింది. ఆమెను చూస్తూనే పెద్దగా సకిలించింది గుర్రం. ఆశగా ఆమె వేపుచూడ సాగింది.

దానివైపే చూసి, లోనికి పరుగెత్తి మరో కుండ తెచ్చింది ఆమె. చేద ప్రక్కనే ఉన్న తొట్టి నిండుగా పోసింది నీళ్ళు. ఆత్రంగా తొట్టిలో నీళ్ళు తాగసాగినదా గుర్రం. ఆ యువకుణ్ని నెమ్మదిగా క్రిందకు లాగింది ఆమె. ప్రక్కనే ఉన్న చెట్టు నీడలో పడుకోబెట్టింది. కుండ నిండుగా నీళ్లుతోడి, ముఖంమీద జల్లింది. కొద్దిగా కదిలాడతను. మరోసారి చల్లేసరికి అతనిలో చలనం కలిగింది.

నెమ్మదిగా కళ్ళు విప్పి చూశాడతను.

ఆమె పరుగెత్తి గుర్రం జీనుకి వేలాడుతున్న నీళ్ళ తిత్తిలో నీరుపోసి అందించింది. ఎత్తి గటగటా తాగేశాడతను. ఆమె అతని వంక చిత్రంగా చూస్తూండి పోయింది.

దాహం తీర్చుకొని ఆమెవంక చూశాడతను. సుమారు ఇరవై మూడేళ్లు ఉంటాయి ఆమెకి. వయసుకు మించిన శరీరం. ఉబుకుతున్న అవయవాలు, మత్తుగా ఉన్న కళ్లు చాలా సెక్సీగా ఉందా యువతి.

అతను తనవంక అలా పరీక్షగా చూడటం గమనించి

సిగ్గుపడింది ఆ యువతి. కళ్ళు వాల్చుకొని నిలబడింది.

"నా పేరు రాజా! మీ మేలు ఈ జన్మలో మరవలేను. పోయే నా ప్రాణాన్ని, నా గుర్రం ప్రాణాన్ని నిల బెట్టారు" ఆమెవంక కృతజ్ఞతగా చూస్తూ అన్నాడు అతను.

ఆ యువతి మాట్లాడకుండా రోడ్ వైపు చూస్తూండి పోయింది భయంగా. ఆమె చూస్తున్న వైపుకు చూశాడు రాజా.

ఆ పల్లెలో ప్రధానమైన మార్గం అదే. గట్టిగా, చదును చేయబడిఉంది. ఆ మార్గం ఏ వంపులేకుండా తిన్నగా ఉంది. బాట కిరువయిపులా గృహా లున్నాయి. వీధులు కూడా నాలుగయిదు కంటే ఎక్కువలేవు. ఆ ఊళ్ళో అయిదారు వందలకంటే ఎక్కువ గృహాలులేవు.

రాజా పరీక్షగా చూశాడు. ఆ మార్గం అవతలి చివర ఎవరో మార్గం మధ్య నిలబడి వారివంకే చూస్తున్నారు. వారి మధ్య దూరం సుమారు ఫర్లాంగు ఉంది.

రాజా తల త్రిప్పి తనకు సహాయంచేసిన యువతి వైపు చూశాడు. ఆమెకూడా అతని వైపు బెదురుగా ఒకమారు చూసి, చెంగున ముందుకు దూకి నీటికుండలో నీళ్ళు చేదు కొని, మార్గంపై నడవసాగింది తలవంచుకొని.

రాజా లేచాడు నెమ్మదిగా. ఒంట్లో శక్తి వచ్చింది కొద్దిగా. గుర్రం దగ్గరికి నడిచి దాని కళ్ళెం పట్టుకొని, ఆమె వెళ్ళిన వైపు నడవసాగాడు. ఆమె ఆగి, రాజా వంక ఒకసారి చూసి, తిరిగి నడక సాగించింది. రాజా నెమ్మ దిగా గుర్రాన్ని నడిపించుకుంటూ నడవసాగాడు. కొద్ది దూరం నడిచి ఆగిపోయాడు రోడ్ మీద.

అతనికి ఎదురుగా దాదాపు వంద అడుగుల దూరంలో

ఇద్దరు వృద్ధ దంపతులు నిలబడిఉన్నారు. వృద్ధుడి చేతిలో గన్, రాజా వైపు గురి పెట్టబడి ఉంది. రాజాకు నీళ్ళు ఇచ్చిన యువతి వృద్ధురాలి వెనక నిలబడి ఉంది.

రాజా ముందుకు నడిచాడు.

"ఎవర్నువ్?" వృద్ధుడి గొంతు కరుగ్గాఉండి, రాజాని అడిగింది.

"నా పేరు రాజా! మాది రామాపురం!" చెప్పాడు రాజా.

"ఇక్కడికి ఎందు కొచ్చావు?" అధికారం ఉంది ఆ కంఠంలో.

"ఇటువేపు పోతూ వచ్చాను. దారిలో గొంతు ఎండి పోతుంటే మీ అమ్మాయి మంచినీళ్ళు ఇచ్చి నా ప్రాణాలు నిలబెట్టింది. ఆమెకు కృతజ్ఞతలు చెబుదామని ఆగాను" ఆరిగా చెప్పాడు రాజా.

రెండు క్షణాలు ఆ వృద్ధుడు మాట్లాడలేదు. గన్ సరిగ్గా పట్టుకున్నాడు.

"నువ్వు రామసేన సభ్యుడివా?"

"రామసేనా?" ఆశ్చర్యపోయాడు రాజా. "దాని పేరు విన్నాను. కాని నాకు దానితో సంబంధంలేదు."

"నేను నమ్మను. దానికి నీకు సంబంధం లేకపోతే నీ యీ వేషం ఏమిటి? ఆ తుపాకులు, తూటాలతో పని ఏమిటి?" కర్కశంగా వుంది వృద్ధుడి గొంతు.

ఆ ప్రశ్న వినటంతోనే రాజా కళ్ళు ఎరుపెక్కాయి. పళ్ళు పటపట కొరికాడు.

"ఈ వేషమా? పగ, నా తల్లిని పొట్టన పెట్టుకున్న రాక్షసుణ్ని చంపాలి. అతనికోసం ఊరు, వాడ గాలి స్తున్నాను."

అయిదు నిమిషాలు అలాగే నిలబడి పోయారంతా. చివరకు వృద్ధుడే అన్నాడు. "సరే! నీమాట నమ్ముతున్నాను. యింట్లోకి రా! పిచ్చి వేషాలు వేస్తే ప్రాణాలు దక్కవు. గుర్తుంచుకో!"

అందరు ఇంట్లోకి నడిచారు. రోడ్డు ప్రక్కనే ఉన్న చిన్న పూరిల్లు అది. ముందుభాగాన గుమ్మం, దాని ప్రక్కనే అటూ ఇటూ రెండు కిటికీలు ఉన్నాయి. గుమ్మం చాలా క్రిందగా ఉండటంవలన రాజా హేట్ తీసి, వంగుని లోనికి నడిచాడు. బయటకు చిన్నదిగా కన్పిస్తున్నా, అది పెద్ద రెండు నిట్టాళ్ళ పూరిల్లు. అటువేపు మరోగది ఉన్నట్లు మధ్యలో తడిక ఉంది.

"రా! మంచంమీద కూర్చో!" అన్నాడా వృద్ధుడు.

రాజా మౌనంగా కూర్చున్నాడు. "నా పేరు సీతారామ్. ఆ ముసలిది నాభార్య లక్ష్మమ్మ. ఆమె నా కూతురు సుశీల" తమని తాము పరిచయం చేసుకున్నాడు.

"సరేగాని తాత! ఈ పల్లె అంతా నిర్జనంగా ఉందేమిటి? మీ రొక్కరే కనబడుతున్నారు?" సందేహంగా అడిగాడు రాజా.

సీతారామ్ నిట్టూర్చాడు. "ఆ రామసేన దురాగతాలు మితిమీరి పోయాయి బాబు. ఎక్కణ్ణుంచి వస్తారో పిడుగులాగా వచ్చి పడతారు. అంతా దోచుకుని తగల బెట్టేస్తారు. అయిదు రోజుల క్రితం మా గ్రామాన్ని దోచుకున్నారు. మా అదృష్టం కొద్ది తగలబెట్టలేదు. ఆ దోపిడీలో ఎంతో మందిని చంపారు. ఎంతో మంది యువతులు మానాల్ని కోల్పోయారు."

చెప్పటం ఆపి, కళ్ళు తుడుచుకున్నాడు వృద్ధుడు. అతడి గొంతు జీరపోయింది. మరల ప్రారంభించాడు:

"ఆ దోపిడీ జరిగిన సమయంలో మేమిక్కడ లేము. ప్రక్క ఊరిలో స్నేహితుడి కూతురి పెళ్ళి జరుగుతుంటే వెళ్ళాము. తిరిగివచ్చి చూస్తే ఈ ఘోరం జరిగిపోయి ఉంది. ప్రజలంతా తిండి, బట్టలేక అల్లల్లాడి పోతున్నారు. దానికి తోడు ఈ కరువు. అందుకే బాబు! ఎవరిదోవ వారు చూసుకున్నారు. అందరూ కూడబలుక్కుని ఈ గ్రామాన్ని విడిచి తలాక దేశం వెళ్ళిపోయారు. నేను మాత్రం వెళ్ళలేక పోయాను. అందుకే ఒంటరిగా, అ స్తమానం, అనుక్షణం భయపడుతూ ఎవరూ మిమ్మల్ని గమనించకుండా బ్రతుకుతున్నాము."

ఆయన గాథ రాజాలో జాలిని రేపింది.

"సరేగాని రాజాబాబు! ఇందాక ఏదో పగ అన్నావు. ఏమిటది?" అడిగాడు వృద్ధుడు. రాజాకి గతం అంతా లీలగా మెదిలింది కళ్ళల్లో. చెప్పటం ఆరంభించాడు.

## 2

"సోదరులారా! సాటి గ్రామస్తులారా! ఈ సంవత్సరం ఎంతో మంచిది మనకి. గ్రామదేవత కాళికాదేవి దయవల్ల పంటలు విపరీతంగా పండాయి. కాకపోతే మరేమిటి? ఎల్లప్పుడూ కరువు కాటకాలతో మాడిపోయే మన గ్రామంలో ఈ సంవత్సరం ఇంతగా పండటం నిజంగా కాళికాదేవి మహిమే.అందుకే మనం ముందు అనుకున్నట్లు జాతర జరిపించి, అమ్మవారికి బలులు యివ్వాలి. అందుకు మీరంతా మీ శక్తికొద్ది యివ్వాలి. ఎల్లుండే జాతర!"

గ్రామ పెద్ద గొంతు ఖంగున మోగింది. ప్రజలంతా హర్షధ్వానాలు చేశారు. ప్రతివారి మనసు ఉప్పొంగి పోయింది. అదంతా గ్రామదేవత చలవేనని ప్రతి ఒక్కరూ మనస్ఫూర్తిగా విశ్వసించారు.

ఆ రోజు రాత్రి వెంకటేశ్వర్లు ఇంటికి వచ్చాడు పొలం నుంచి. అతని భార్య మీనాక్షి, కొడుకు రాజా బయట గుమ్మం దగ్గిర నిలబడి ఎదురు చూస్తున్నారు. తండ్రిని చూడగానే రాజా ఆనందంతో ఎదురు పరుగెత్తాడు. వెంకటేశ్వర్లు అతణ్ని ఎత్తుకున్నాడు. రాజాకి అప్పుడు అయిదేళ్ళుంటాయి. చురుకయినవాడు.

ముగ్గురూ యింట్లోకి నడిచారు.

"మీనాక్షీ! భోజనం వడ్డించు" కాళ్ళు కడుక్కుంటూ అన్నాడు వెంకటేశ్వర్లు. మీనాక్షి, రాజాకి, వెంకటేశ్వర్లుకి వడ్డించింది భోజనం.

"ఏమండి!" చిన్నగా అంది మీనాక్షి.

"ఏమిటి!" అన్నం కలుపుకుంటూ అన్నాడు వెంకటేశ్వర్లు.

"కాళికాదేవి దయవల్ల మన కష్టాలు గట్టెక్కాయి. నేను ఒక మేకపోతును బలియిస్తానని మొక్కుకున్నాను."

"అలాగే!" అన్నాడు వెంకటేశ్వర్లు.

మూడో రోజు సంరంభాలు ప్రారంభమయ్యాయి. ఉదయమే లేచి కార్యక్రమాలు ప్రారంభించారు. పల్లె ప్రజలంతా ఏకమై తమ సంతోషాన్ని, కృతజ్ఞతను వ్యక్త పరుచుకుంటున్నారు.

సరిగ్గా అదే సమయంలో ఎవరో ఒకడు పరుగెత్తుకుంటూ వచ్చి, గ్రామ పెద్ద చెవిలో ఏదో చెప్పాడు. ఆయన ముఖం వెలవెల పోయింది. సంరంభాలు ఆపించి అందరితోను ఆ వార్త చెప్పాడు. అంతా కళవళపడ్డారు అది విని. వెంటనే జాతర ఆగిపోయింది.

"అంతా మల్లుగాడి ముఠాని ఎదుర్కోవటానికి సిద్ధపడండి."

ప్రజల్లో కలవరం పెరిగిపోయింది. ఊరిలోని మగ వాళ్లు, యువకులు, వృద్ధులనే తేడాలేకుండా బరిశెలు, గొడ్డళ్ళు తీసుకొని తయారయ్యారు. ఆడవాళ్ళు, పిల్లలు ఇళ్ళల్లో దాక్కున్నారు భయంతో.

మధ్యాహ్నం అయేసరికి మల్లుగాడి ముఠా వచ్చిపడింది ఊరిమీద. ఆ ముఠాలో మొత్తం అరవై మందివరకు ఉన్నారు. మోటుగా, దున్నపోతుల్లా ఉన్నారు. దయా దాక్షిణ్యాలనేవి లేవు వారికి. పైగా మోటు తుపాకులున్నాయి వారి దగ్గర. గుర్రాలమీద వొచ్చి పడ్డారు.

వచ్చీ రావటంతోనే పెద్దగా కేకలు వేస్తూ జనం మీద పడ్డారు. ముందే తయారుగా ఉన్న ఆ ప్రజలు ఎదురు తిరిగారు. పోరు భయంకరంగా సాగుతోంది. గుర్రాలు ఎక్కి ఉన్నవారిని పడగొట్టటం సులభంకాదు. ఎదురు తిరిగిన వారిని ఊచకోత కోశారు వారు. మోటు తుపాకులతో తలలమీద బాదుతూ, కాలుస్తూ, గుర్రాలచేత తొక్కిస్తూ మల్లుగాడి ముఠా విజృంభించింది.

పోరు ఘోరంగా సాగింది. నాలుగయ్యేసరికి అందరూ హతమయ్యారు. అలా చనిపోయిన వారిలో వెంకటేశ్వర్లొకడు. యింట్లో ఉన్న మీనాక్షి గుండె గుబులుగా ఉంది. రాజాని గుండెలకు హత్తుకొని ఒక మూలగా ఒదిగి కూర్చుంది.

అదేక్షణంలో బయట హాహాకారాలు చెలరేగాయి. ఆడవాళ్లు, పిల్లల ఏడ్పులతో ఆ ప్రదేశం దద్దరిల్లిపోయింది. మల్లు ముఠా దొరికిన ఆయుధంతో చంపేస్తున్నారు వారిని. ఇంతలో ఎవరో ఇళ్ళకు నిప్పు అంటించారు. క్షణాలమీద అంటుకుంది ఊరు. అన్నీ పూరిళ్ళు కావటం వలన, వాయుదేవుడితోడ్పాటు ఉండటంతో అగ్ని దేవుడు

విజృంభించాడు.

మల్లుగాడి ముఠా ఇళ్ళల్లోకి చొరబడి దొరికిన ధాన్యం, విలువయిన వస్తువులు బయటికి చేరవేస్తున్నారు.

మీనాక్షి భయంతో తలుపు తెరిచి బయటకు రాబోయింది. ఇంతలో ఎవడో లోనికి ప్రవేశించాడు ఆమెని నెట్టుకుంటూ. మీనాక్షి అదిరిపడింది. ధాన్యంకోసం లోనికి ప్రవేశించిన ఆ రాక్షసుణ్ని మీనాక్షి అందం రెచ్చగొట్టింది. వికటంగా నవ్వుతూ ఆమెని సమీపించాడు.

"రాజా! నువ్వు వెళ్ళి ఆ ప్రక్క గదిలో దాక్కో" అరిచింది మీనాక్షి. రాజా పరుగెత్తాడు. ఆ రాక్షసుడు మీనాక్షి చేతులు పట్టుకున్నాడు. విదిలించి కొట్టింది మీనాక్షి. అయినా వదల్లేదు. భయంకరంగా నవ్వుతూ ఆమెని గట్టిగా ఒడిసి పట్టుకొని, కౌగిలిలోకి లాక్కున్నాడు. మీనాక్షి అతన్ని కొరికింది. అవి అన్నీ అలవాటే అయినట్లు అతని పట్టు ఏమాత్రం సడలలేదు. మీనాక్షి కట్టుకున్న చీర, రవిక పీలికలయిపోయాయి. వాడి చేతుల్లో విలవిల లాడుతోందామె.

ఇదంతా చూస్తూనే ఉన్నాడు రాజా తలుపు చాటు నుంచి. ఆ పసిమనస్సులో ఆవేశం పెల్లుబికింది. చేతిలోకి దొరికిన చిన్న చెక్కను పట్టుకొని ఆ గదిలో ప్రవేశించాడు. మీనాక్షిమీద ఉన్న అతడి తలమీద బాదాడు గట్టిగా శక్తికొద్ది. అతడు ఉగ్రుడైపోయాడు. మీనాక్షిని వదలి, రాజాని రెండు చేతులతో ఎత్తి గదిమూలకు విసిరాడు. దెబ్బ తగిలింది గట్టిగా. అంతే స్పృహ కోల్పోయాడు రాజా.

స్పృహ వచ్చేసరికి, చిరిగిన పీలికలతో, కొన ఊపిరితో

ఉన్న తల్లి రూపం కన్పించింది. రాజా ఆమె దగ్గరకు పోకాడు. "అమ్మా!" అన్నాడు పెద్దగా. నెమ్మదిగా కళ్లు తెరిచి చూసిందామె.

"నాయనా! రాజా! నేను చనిపోతున్నానురా, మీ నాన్నగారితోబాటే. నిన్ను ఒంటరివాణ్ని చేసి మేము వెళ్ళిపోతున్నాము. నువ్వు తాతయ్యగారింటికి వెళ్ళు."

"అమ్మా!" అరిచాడు రాజా.

"ఇక బయటికిపో బాబు! యిల్లు అంటుకుంది. త్వరగా పారిపో!"

రాజా పరుగెత్తాడు బయటికి. అదే క్షణంలో యిల్లు అంటుకొని భగ్గున మండసాగింది. "అమ్మా!" పిచ్చిగా అరిచాడు రాజా.

# 3

చెప్పడం ఆపాడు రాజా. అతని కంఠం జీరవోయింది.

"తరవాత?" ప్రశ్నించాడు సీతారామ్.

"ఆ తరవాత నేను మా తాతగారి ఊరు చేరాను. ఆయన దొరల దగ్గర పనిచేస్తుండేవారు. ఆయనే నా చదువుసంధ్యలు చూశారు. కానీ నాలో ఆ పగ మాసిపోలేదు. ఏనాటికయినా వాణ్ని నాశనం చేసి తీరుతాను" ఉద్రేకంగా అన్నాడు రాజా.

"ఎలా రాజా! యిరవై సంవత్సరాలు గడిచాయి. ఇప్పుడతన్ని నువ్వు గుర్తుపట్టగలవా? అసలతను ఉన్నాడో లేదో నీకు తెలియదుగా?"

"లేదు తాతా! నాకతని రూపం బాగా గుర్తే. నీవన్నట్లు వాడు చనిపోయి ఉంటే చాలా అదృష్టవంతుడు. బతికుంటే చిత్రహింసలు పెట్టి చంపుతాను" పళ్ళు కొరికాడు రాజా.

"నన్ను క్షమించు బాబు! నీ గతమంతా గుర్తుచేశాను. సరేగాని సుశీలా భోజనం వడ్డించమ్మా!" అన్నాడు సీతారామ్.

ఆకలిమీద ఉండటం వలన బాగా భోజనం చేశాడు రాజా. మిక్కిలి బడలికగా ఉండటం వలన ముందు గదిలో మంచంపై పడుకున్నాడు. గాఢంగా నిద్రపట్టిం దతనికి. ఎంత సేపు నిద్రపోయాడో తెలీదతనికి.

"ధన్...ధన్...ధన్."

ఉలిక్కిపడి లేచాడు రాజా. చీకట్లు కమ్ముతున్నాయి. నడుం దగ్గర కేస్‌లో రివాల్వర్ ఉందో లేదో ఓమారు చూసుకొని, బయటికి నడిచాడు.

బయట సీతారామ్, డబుల్ బారల్ గన్‌తో నిలబడి ఉన్నాడు. దానినుంచి పొగలు వస్తుండటం స్పష్టంగా కన్పిస్తూంది. అప్పటికే లక్ష్మమ్మ, సుశీల బయటకు చేరి ఉన్నారు.

"ఏమయింది?" బయటకు వస్తూ అన్నాడు రాజా.

సీతారామ్ మాట్లాడలేదు. మార్గం వైపు చూస్తూండి పోయాడు. అటువేపే దృష్టిని సారించాడు రాజా.

రోడ్ మీద కొద్ది దూరంలో ఎవరో పడిపోయి ఉన్నారు. దూరంగా గుర్రం పరుగెడుతూ కన్పించింది. రాజా ఆ వ్యక్తి దగ్గరకు నడిచి, పరీక్షించాడు. అతని ప్రాణం ఎప్పుడో పోయింది. చేతిలో చిన్న తుపాకీ ఉంది.

"తాతా! యితను రామసేన మనిషా?" ప్రశ్నించాడు రాజా.

"అవును రాజా!"

"మళ్ళీ ఎందుకొచ్చాడు? యిక్కడెవరూ లేరని

తెల్సునా?"

"తెలియదు బాబు. గుర్రంమీద యిటు వస్తూ కన్పించాడు. నేనూ అతన్ని తప్పించుకు పోదామనే ఉద్దేశంతో చాటుకి పోబోయాను. కాని నన్ను గమనించి తుపాకీ తీశాడు. నేను కాల్చాను."

రాజాకి చాలా ఆశ్చర్యంగా ఉంది. అరవై ఏళ్లైనా ఆ వృద్ధుడిలో పటుత్వం తగ్గిపోలేదు. అతనివంక ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు.

సుశీల, లక్ష్మమ్మ ఆ చనిపోయిన వ్యక్తి వైపు భయంగా చూస్తూండి పోయారు.

"ఇవ్వాళ కాకపోయినా రేపయినా ఆ రామసేన ముఠాకి ఈ సంగతి తెలిసిపోతుంది, తమ సభ్యుడొకడు మాయమయ్యాడని. ఇతని శవం యిక్కడ కన్పిస్తే ప్రమాదం. తాతా! మరి యిప్పుడేం చేద్దాం?"

సీతారాం మాట్లాడకుండా హతుడి శరీరం ప్రక్కకు లాగి, తుపాకి, నడుముకున్న తూటాల బెల్టు తీసేసి, అతని డ్రస్సు విప్పాడు. రాజా అతను చేస్తున్నది ఆశ్చర్యంగా చూ స్తుండిపోయాడు.

"రాజా! నీ గుర్రాన్ని ఒకసారి యివ్వు!" అన్నాడు.

"నా గుర్రమా? యింత ముసలివారు మీరు, స్వారీ చేస్తారా!" ఆశ్చర్యపోయి అడిగాడు రాజా. సీతారామ్ నవ్వాడు. "నాకు చిన్నప్పటినుంచి గుర్రపుస్వారీ వచ్చు బాబు" అన్నాడు.

సీతారామ్ మృతశరీరాన్ని తాళ్ళతో కట్టి, ఆ తాడును గుర్రం జీనుకి కట్టాడు. గుర్రం ఎక్కి ముందుకు దూసుకు పోయాడు. అతనితోపాటే శవం కూడా మార్గంమీద ఈడ్చబడుతూ వెళ్ళిపోసాగింది.

కన్పించినంత మేరచూసి, లోనికి నడిచాడు రాజా. రాత్రి అయ్యింది. వెన్నెల కాస్తోంది. భోజనం ముగి స్తుండగా వచ్చాడు సీతారామ్.

"ఏం చేశారా శవాన్ని?" అడిగాడు రాజా.

"దూరంగా చిన్న లోయ ఉంది కొండప్రక్కనే. దాంట్లో పడవేసి వచ్చాను."

రాజా బయటికి నడిచి, గుర్రం దగ్గరకు నడిచాడు. అది ప్రక్కనే ఉన్న చిన్న కొయ్యకి కట్టివేయబడి ఉంది. గుర్రానికి దాణా వేశాడు రాజా.

"రాజా! ఈ ముందుగదిలో మంచం మీద నీవు పడుకో. మేము ఆ వెనక గదిలో సర్దుకుంటాము" అన్నాడు వృద్ధుడు.

రాజా వద్దని వారించ బోయాడు. కానీ అతడు అంగీక రించలేదు. రాజాకి ఒప్పుకోక తప్పింది కాదు. దాణా వేసి లోనికి వచ్చాడు. సుశీల మంచంమీద బట్టలు పరుస్తోంది. అమాయకమయిన ఆమె ముఖాన్ని చూస్తూ నిలబడి పోయాడు రాజా. ఇరవై ఏళ్ళ అందగత్తె ఆమె. అవ యవాలన్నీ పొందిగ్గా అమర్చబడి ఉన్నాయి. ఆమెను చూస్తున్నకొద్దీ రాజాలో ఉద్రేకం కలగసాగింది. తనని తాను తమాయించుకున్నాడు.

ప్రక్క సిద్ధపరచి, వెళ్ళబోతు వెనక్కి తిరిగింది సుశీల. రాజా కన్పించగానే ఉలిక్కిపడింది. ఇద్దరి చూపులు కల్సుకున్నాయి ఒక్క క్షణం.

"రాత్రికి వస్తాను. మేలుకొని వుండండి."

చిన్నగా గుసగుస లాడుతున్నట్లు అని వెళ్ళిపోయింది ఆమె.

అదిరిపడ్డాడు రాజా! తనతో ఏంపని ఆమెకి? ఒంటరి

ఆడపిల్ల రాత్రిపూట ఓ పరాయి మగవాడి దగ్గరకు రావటం? ఆలోచనలు మాని పడుకున్నాడు రాజా. మధ్యాహ్నం నిద్ర పోవటం వలన నిద్ర రావటం లేదు. సుశీల కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

సుమారు పదకొండు గంటలవుతుండగా వచ్చింది సుశీల. తెల్లటి చీర, అక్కడక్కడ చిరిగిపోయి, మాసికలు వేయబడి ఉంది. ముఖం అమాయకంగా, స్వచ్ఛంగా ఉంది.

ఇద్దరు చప్పుడు కాకుండా బయటికి నడిచారు. పిండార బోసినట్లున్న వెన్నెలలో వాతావరణం ఆహ్లాదంగా ఉంది. నిర్జనంగా కన్పిస్తున్న పల్లె భయాన్ని కలిగిస్తోంది.

ఇద్దరు ఊరి చివరకు చేరుకున్నారు. బాట పక్కనే గడ్డిలో చతికిల బడ్డారు. "ఇంత సాహసం చేసినందుకు నన్ను మన్నించండి!" సుశీల తల వంచుకొని అంది.

"సుశీలా! మీతో ఒకమాట చెబుతాను వింటారా?"

"మీరేం చెబుతారో నాకు తెలుసు."

సిగ్గుతో తల మునకలవుతూ అంది సుశీల.

"నన్ను పూర్తిగా చెప్పనియ్యి సుశీలా! యిన్నాళ్ళ వరకు నా తల్లిని నాశనంచేసి, ఆమె మరణానికి కారకుడైన వాడిని మట్టుపెట్టటమే నా పరమావధిగా ఉండేది. ఆ ఆశయంతోనే పిస్టలు కాల్చటం, గుర్రపుస్వారి, కర్ర సాము మొదలైన విద్యలు నేర్చుకున్నాను. ఆ ఆశయంతోనే నేనిన్నాళ్లు జీవించాను. నిన్ను చూడగానే నాకూ కోరికలున్నాయని, నిన్ను పెళ్ళి చేసుకొని ఆనందం పొందాలని భావించాను. నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నీకిష్టమయితే పెళ్ళి చేసుకుంటాను" ఆవేశంగా అన్నాడు రాజా.

"నన్ను పెళ్ళాడతాననటం నా అదృష్టం. కాని ఎన్నాళ్ళు ఈ నరకంలో బ్రతకటం?" నిరాశగా అంది సుశీల.

"నరకమా?" ఆశ్చర్యపోయాడు రాజా.

"కాదా మరి? ఎవరూ లేని ఈ ఊళ్ళో, ఒంటరిగా, దొంగచాటుగా బ్రతుకుతూ, ఏ క్షణంలో రామసేన మీద పడుతుందో భయపడుతూ బ్రతకటం నరకం కాక మరేమిటి? బహుశా ఆ రామసేన ముఠాలోనే మీకు కావల్సిన వ్యక్తి ఉన్నాడేమో?"

రాజా కళ్ళు ఎర్రబడ్డాయి. కోపంతో పిడికిళ్ళు బిగించాడు.

"ఇప్పుడే బయలుదేరండి. ఆ రామసేన ముఠాని నాశనం చేయండి. నాకెందుకో మీరే ఆ పని చేయగలరనిపిస్తోంది. ఆ ముఠాలో మీకు కావలసిన వ్యక్తి లేకపోయినా ఫరవాలేదు. ప్రజల్ని పీడించే ఒక ముఠాని నాశనం చేశారన్న ఖ్యాతి దక్కుతుంది" ఆవేశంగా అంది సుశీల.

"సుశీలా! యికనుంచి ప్రతిక్షణం నేను ఆ ప్రయత్నం నిర్వర్తించడంలోనే ఉంటాను. నన్ను నమ్ము" ఆవేశంగా, సుశీల చెయ్యి తన చేతిలోకి తీసుకొని ప్రమాణంలా చేస్తూ అన్నాడు రాజా.

కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు. అంతసేపు సుశీల చేయి, రాజా చేతిలోనే ఉంది.

"ఇక లేవండి వెళ్దాం" లేచినిలబడి అంది సుశీల.

రాజా ఆమెవంక చూశాడు. వెన్నెల్లో వెలిగిపోతూంది వెన్నవలె ఆమె. చటుక్కున ఆమె చేయి పట్టుకొని క్రిందికి లాగాడు. సుశీల విసురుగా వచ్చి అతని కౌగిలిలో పడింది. తెల్లబోయింది సుశీల. తేరుకునే

లోపునే రాజా చేతులు ఆమె వీపుని చుట్టివేశాయి. అతని పెదాలు, ఆమె పెదవులను అదిమి పట్టాయి. అతన్ని ఘట్టిగా కౌగలించుకుంది సుశీల.

# 4

ఉదయాన్నే బయలుదేరాడు రాజా గుర్రం ఎక్కి.

"సీతారాంజీ! మీ ఆతిథ్యం మర్చిపోను. అంతేగాదు తిరిగి వచ్చేటప్పుడు మీకో శుభవార్త తెస్తాను" అన్నాడు రాజా. అతని కళ్ళు సుశీలకోసం వెదికాయి. కాని ఆమె కన్పించలేదు. నిరాశగా కాలిబూటుతో గుర్రం డొక్కలో తన్నాడు. ఎర్రమట్టిదుమ్ము రేపుకుంటూ ముందుకు పరుగెత్తింది వేగంగా అది కొండలవైపు. తిరిగి తిరిగి సుశీల కోసం వెనక్కి చూస్తూ వేగంగా స్వారిచేయసాగాడు. వృద్ధ దంపతులు గుడిసె లోపలికి వెళ్ళిపోయారు.

వేగంగా వెళ్ళిపోతున్న రాజా ఎవరో కేక వేయటంతో కళ్లెం పట్టుకొని గుర్రాన్ని ఆపాడు. వెనక్కి తిరిగి చూశాడు. సుశీల రొప్పుతూ పరుగెత్తుకు రావటం కన్పించింది. రాజా ముఖం ఆనందంతో వెలిగిపోయింది. గుర్రం దిగి నిలబడ్డాడు రాజా. సుశీల పరుగెత్తుకుంటూ వచ్చి రాజాకి ఎదురుగా నిలబడింది. ఆయాసంతో నోట మాట రావటంలేదు. గుండెలు ఎగసి ఎగసి పడుతున్నాయి.

"సుశీల! ఎక్కడికి వెళ్ళావు? నీకోసం ఎంతగా చూశానో తెలుసా?" ఆనందంతో అన్నాడు రాజా. సుశీల తేరుకుంది ఆయాసంనుంచి.

"మీ కోసమే యిందాకణ్ణుంచి ఆ పొదచాటున ఉన్నాను. ఇదిగో! మీ కోసం తయారుచేసి తెచ్చాను" అంటూ గుడ్డలో మూటకట్టి ఉన్న చపాతీలను అందించింది. వాటిని అందుకున్నాడు రాజా.

"వస్తాను సుశీలా! నీకిచ్చిన మాటప్రకారం ఆ రామసేన ముఠాని నాశనంచేసి వస్తాను" ఉత్సాహంగా అన్నాడు రాజా.

"నువ్వు త్వరలో తిరిగిరావాలని భగవంతుణ్ని కోరుకుంటున్నాను రాజా!"

రాజా గుర్రం ఎక్కబోయాడు.

"రాజా!" అంది సుశీల తలవంచుకుని. ఎక్కబోయి ఆగాడు రాజా. "ఏమిటి సుశీలా?" అని ప్రశ్నించాడు.

"రాత్రి నువ్వు నాకు ఇచ్చింది ఇవ్వాలనుకుంటున్నాను" అంది.

"రాత్రి నీకు ఇచ్చానా?" ఆశ్చర్యపోతూ అడిగాడు రాజా. ఆమెకేమి ఇచ్చినట్లు గుర్తులేదతనికి. "ఏమిటది!" అన్నాడు.

"ఇది" చటుక్కున అతన్ని కౌగలించుకుని, పీపుచుట్టు చేతులేసి అతన్ని అదుముకుని అంది సుశీల. అతని పెదాలపై ముద్దుపెట్టుకుని, అతన్ని వదిలి పరుగెత్తింది వెనక్కి.

రాజా ఉలిక్కిపడ్డాడు. అతని హృదయం ఆనందంతో గంతులు వేసింది. సుశీల కనుమరుగయేంతవరకు చూసి, ఉత్సాహంతో తిరిగి గుర్రాన్ని ఎక్కి అదిలించాడు. ముందుకు దూసుకుపోసాగింది అది కొండలవైపుగా.

ఆ కొండల అవతల సుమారు మూడు నాలుగు మైళ్ళ దూరంలో మరొక పల్లె ఉంది. ఆ కొండ మార్గం తప్ప మరో మార్గంలేదు అటువైపు వెళ్ళటానికి. మధ్యలో కొండలబారు ఉంది అడ్డంగా. ఆ కొండలలోని మార్గం అయినా సులువుగా ఉండదు. అంతా ముళ్ళు, పొదల మయం. మధ్యలో లోయ. ఆ లోయలో చిన్న సెలయే రొకటి ప్రవహిస్తుంటూంది. ఆ సెలయేరులో తప్పితే

ఆ చుట్టుప్రక్కల కొండలలో మరి నీళ్ళు దొరకవు. అందు చేతనే కాస్త కష్టంగా ఉన్నా ఆ కొండ మార్గాన్నే అందరూ ఉపయోగిస్తుంటారు.

రాజా గుర్రం అతిత్వరగా పరుగెడసాగింది. ఇప్పుడు రాజా దొక్కటే ధ్యేయం. రామసేనను హతమార్చాలి. అందులో తప్పకుండా తనకు కావాల్సిన మనిషి ఉంటాడు.

ఇంతలో కొండల దాపుల్లోకి వచ్చింది గుర్రం.

ఆ కొండలబారుని పరిశీలించి, సీతారామ్ తనకు చెప్పిన దారిని సులభంగానే గుర్తుపట్టాడు. ఆ కొండ చాలా ఏటవాలుగా ఉంది. కళ్ళెం పట్టుకొని, గుర్రాన్ని పైకి ఎక్కించటం ప్రారంభించాడు. ఏటవాలుగా ఉండటం వలన కొండను ఎక్కటం సులువుగానే ఉంది.

కొండశిఖరానికి ఎక్కి వెనుదిరిగి చూశాడు. దూరంగా, అస్పష్టంగా కన్పించింది సుశీల ఉండే ఊరు సీతానగరం. అటునుంచి దృష్టిని ముందుకు సారించాడు రాజా. ఎదురుగా నిలువుగానున్న కొండలు కన్పించాయి. తానున్న కొండ కూడా వాలుగా కాకుండా, శిఖరంనుంచి కొద్దిగా నిట్ట నిలువుగా వాలిపోయి ఉంది.

నెమ్మదిగా గుర్రాన్ని నడిపించుకుంటూ కొండ దిగటం ప్రారంభించాడు రాజా.

కొండరాళ్ళు నున్నగా ఉండి, జారిపోతున్నాయి. అయినా జాగ్రత్తగా అడుగులు వేస్తూ కొండ దిగ సాగాడు. ఒకేసారి సూటిగా దిగటం ప్రమాదం. అందు వల్ల కొద్దిగా వాలుగా దిగటం ప్రారంభించాడు.

పూర్తిగా దిగేటప్పటికి మధ్యాహ్నం అయింది. చాలా అలసట అన్పించింది రాజాకి. ఆ లోయనిండా రకరకాల చెట్లు ఉన్నాయి. వాటిమధ్య సెలయేరు ప్రవహిస్తోంది.

ఆ రెండు కొండల నడుమ మధ్య సుమారు ఫర్లాంగు దూరం ఉంది. ఆ కొండలవైపు పోవాలంటే చెట్లను, సెలయేరును దాటుకుని పోవాలి.

గుర్రం ఎక్కి ఆ చెట్లమధ్యగా బయలుదేరాడు. చెట్ల మధ్యగా సెలయేరు కన్పించింది. సెలయేరు కటు ఇటు చెట్లున్నాయి. కొండ ఎగువనుండి సెలయేరు నున్నటి రాళ్ళమీద ప్రవహిస్తోంది.

సెలయేరు దగ్గిర దిగి స్నానం చేశాడు. సుశీల ఇచ్చిన చపాతీలు తిని, నీళ్ళు తాగాడు. దాపుల్లో ఉన్న చెట్ల క్రిందకు నడిచి, గుర్రాన్ని ఒక చెట్టుకి కట్టివేసి నడుం వాల్చాడు. తలపైనున్న టోపీని ముఖంమీదకు లాక్కొని ఎండపడకుండా చేసుకున్నాడు.

సరిగ్గా అదేసమయంలో ధన్ ధన్ మంటూ ఆ లోయ అంతా దద్దరిల్లిపోయింది. ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు రాజా. టోపీ సరిచేసుకొని, రివాల్వర్ తెరిచి చూశాడు. నిండా గుళ్లున్నాయి. లోయ అంతా ఆ శబ్దం ప్రతి ధ్వనించటంవలన శబ్దం ఎటునుంచి వస్తోందో అర్థంకాలేదు. రివాల్వర్ కేసులో పెట్టి, సెలయేరు దగ్గరకు నడిచి, అటూ ఇటూ చూశాడు.

మరోమారు ధన్ మన్న శబ్దం, దానితోపాటు ఎవరిదో ఆర్తనాదం, గుర్రాల సకిలింపులతో లోయ మార్మోగి పోయింది. అటూ ఇటూ చూశాడు. కాని ఎవరూ కన్పించు లేదు. సెలయేటిలోనుండి అవతలివైపు వెళ్లాం అను కున్నాడు. తీరా దిగాక చూస్తే మోకాలు లోతుకంటే ఎక్కువ లోతులేదని. గుర్రంమీద ఎక్కి బయలుదేరాడు. రివాల్వర్ చేతిలో తయారుగా పట్టుకొని, జాగ్రత్తగా అటూ ఇటూ చూస్తూ నెమ్మదిగా గుర్రాన్ని నీళ్ళలోకి దింపాడు.

ఆ సెలయేరు దాదాపు నాలుగయిదు వందల గజాల వెడల్పు ఉంది. అవతలివైపు దట్టంగా చెట్లున్నాయి. సరిగ్గా మధ్యలోకి వచ్చేసరికి, దూరంగా సెలయేరు ఎగువ భాగంనుండి ఎవరో సెలయేటి నీళ్ళల్లో కొట్టుకొని రావటం కన్పించింది. రాజా గుర్రం దిగి, నీళ్ళల్లో నిలబడ్డాడు.

ఎవరో ఒక ముసలివ్యక్తి నీళ్ళల్లో కొట్టుకువస్తున్నాడు. అతన్ని పట్టుకొని వెనక్కి లాక్కొచ్చాడు రాజా. పిస్టలు గుండు పొట్టలో తగిలింది కాబోలు, అక్కడంతా రక్తం పోయింది. శ్వాస నీరసంగా ఆడుతోంది. చకచక ప్రథమ చికిత్స చేశాడు రాజా. రక్తం కారకుండా పొట్టకి కట్టు కట్టాడు. సెలయేటి నీరు దోసిలినిండా తెచ్చి అతని ముఖంమీద చల్లాడు. అతడు నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

దాదాపు యాభైఏళ్ళ వయసుంటుంది అతనికి. ముఖం ముడతలు పడిపోయి ఉంది. కట్టుకున్న గుడ్డలన్నీ పీలక లయిపోయి ఉన్నాయి. కొరడాలతో కొట్టినట్టు శరీరం నిండా వాతల గుర్తులున్నాయి. ముఖం అంతా వాచి పోయింది. చేతులు, మోకాళ్ళు, పొట్ట గీసుకుపోయాయి.

"ఎవరు మీరు? ఎవరు మిమ్మల్ని కాల్చారు? ఎందుకు కాల్చారు?" ఆదుర్దాగా అడిగాడు రాజా ఆ ముసలతను ముఖందగ్గర వంగి.

అతికష్టంమీద నోరు విప్పి చెప్పసాగాడా వృద్ధుడు:

"నా పేరు రాయుడు! మాది ఆ కొండల అవతల ఉన్న రాంపల్లె. మాది పెద్దజమీందారీ కుటుంబం. మా ఆస్తి అంతా బంగారు రూపంలో ఒకచోట భద్రంగా ఉంది. ఆ రహస్యం ఆ రామసేన ముఠాకి తెల్సిందెలాగో. మా పల్లెపై దాడిచేసి నన్ను పట్టుకున్నారు. ఆ బంగారం ఉన్న చోటు చెప్పమని హింసించారు. నేను పెదవి విప్పలేదు.

నేను వారి బారినుండి తప్పించుకొని ఇటుగా పరుగెత్తు కొచ్చాను. కాని వాళ్లు నన్ను చూశారు. చూచి వెంట బడ్డారు. నేను చావు తప్పదనుకొని సెలయేటి నీళ్ళలో అడుగు బెట్టాను. కాని వాళ్ళు కాల్చిన గుండు నా పొట్టలో దూరింది. నీళ్ళల్లో పడిపోయిన నన్ను చూసి వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు. నేను శక్తిలేక నీటివాలుకి యిటుగా వచ్చాను."

ఆ వృద్ధుడు చెప్పినది వినగానే రాజాలో కోపం రగులు కుంది. పిడికిళ్ళు బిగుసుకు పోయాయి. "తాతా! నీకింత చేసిన వాళ్ళకోసమే బయలుదేరాను. వారిని నాశనం చేసి తీరుతాను" ఉద్రేకంగా అన్నాడు రాజా.

ఆ వృద్ధుడు తృప్తిగా చూశాడు రాజా వైపు.

"బాబు! నా ప్రాణాలు బలికొంటున్న నిధి రహస్యం. చెబుతాను. చెవి తీసుకురా" అన్నాడు ఆయాసంగా. రాజా మరింత ముందుకు వంగాడు. ఆ ధనాన్ని దాచిన చోటు చెప్పాడు రాయుడు. ఏదో అడగబోయేంతలో తల వాల్చేశాడు అతను.

రాజా అతను చనిపోయాడని గ్రహించాడు. ప్రక్కనే గొయ్యితీసి పాతి పెట్టాడు. గుర్రం ఎక్కి, సెలయేరు దాటి బయలుదేరాడు.

ఆ చెట్లమధ్య కొంత దూరం పోయేటప్పటికి బురదగా ఉండిన చోటుల్లో గుర్రపు డెక్కల గుర్తులు కన్పిం చాయి. వాటిని అనుసరిస్తూ బయలుదేరాడు రాజా. చీకట్లు కమ్ముకుంటున్నాయి.

రాజా వెళ్ళటం ఆపి, గుర్రాన్ని ఒకచోట కట్టివేసి, దాపుల్లో ఉన్న చెట్లఫలాలు తిని, ఒకచెట్టు క్రింద నడుం వాల్చాడు.

# 5

రాజా వెళ్ళి గంట దాటింది. సీతారామ్ నెమ్మదిగా లేచి, మంచినీళ్ళు తాగి, చుట్టముట్టించుకున్నాడు. అప్పటి వరకు రాయును గురించే ఆలోచిస్తున్నాడతను.

"సుశీలా! సుశీలా!" జ్ఞాపకం వచ్చి పిలిచాడు. సుశీల పలకలేదు.

"లేదండి! ఎక్కడికో వెళ్ళింది!" లోపలనుంచి సమాధానం యిచ్చింది లక్ష్మమ్మ.

"ఎక్కడికి వెళ్ళింది? ఒంటరిగా బయట ఎప్పుడూ తిరగొద్దంటే వినదు" గొణుక్కున్నాడతను. అతని మెదడులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. గతం అంతా కళ్ళ ముందు మెదులుతూంది.

"పాపం! అబ్బాయి చాలా చిన్నవాడు. ఇంత వయస్సులోనే ఎన్ని కష్టాలు?" అంది లక్ష్మమ్మ లోపల్నుంచి. సీతారామ్ మాట్లాడలేదు. మరల లక్ష్మమ్మే అంది.

"ఎన్నాళ్ళిలా ఒంటరిగా ఈ అడవిలో ఉండటం? నాకు విసుగు పుడుతోంది." ఆమె కంఠంలో కోపం, విసుగు ధ్వనించాయి. అప్పటికీ సీతారామ్ మాట్లాడలేదు. గుప్పున పొగ వదులుతూ కూర్చున్నాడు.

లక్ష్మమ్మ ఏదో అనబోయింది. ఇంతలోనే బయట గుర్రపుడెక్కల చప్పుడు విన్పించింది. సీతారామ్ ఉలికిపడి లేచాడు. రాజా తిరిగి వస్తున్నాడేమో ననుకున్నాడాయన. కాని వచ్చేది ఒక్క గుర్రం కాదని, ఒకటికంటే ఎక్కువేనని గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు ఆయనకు.

"అయ్యో! ఎవరో వస్తున్నారు. ఆ రామసేనే కాబోలు, సుశీల ఎటు వెళ్ళిందో?" ఆదుర్దాగా అంది లక్ష్మమ్మ. సీతా

రామ్ మాట్లాడకుండా లేచి గన్ అందుకున్నాడు. కిటికీ దగ్గరకు చేరి చూశాడు. బయట రోడ్ మీద ఆరుగురు వ్యక్తులు గుర్రాలమీద ఎక్కి ఆగి ఉన్నారు వరసగా. వారంతా రామసేన సభ్యులేనని వారి దుస్తులు తెలియ చేస్తున్నాయి.

వారంతా వరసగా ఆగి, బాటమీదుగా చూస్తున్నారు కొండవైపు. వాళ్ళల్లో వాళ్ళు ఏదో మాట్లాడుకుంటు న్నారు గాని, సీతారామ్‌కి వాళ్ల మాటలు విన్పించడం లేదు. సీతారామ్ గన్ని కిటికీలో వాళ్ళకి గురిగా పెట్టి కూర్చున్నాడు. లక్ష్మమ్మ సుశీల గురించి ఆదుర్దా పడుతూ, నెమ్మదిగా భర్తపక్కన చేరింది.

వాళ్ళంతా ఆగి ఎందుకలా అటు చూస్తున్నారో అర్థం కాలేదు సీతారామ్‌కి. వారికి తన ఇంటికి మధ్య సుమారు నూటయాభై గజాల కంటే ఎక్కువ దూరం ఉండదు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. వారెందుకలా చూస్తున్నారో అర్థంకాని సీతారామ్ ఉలిక్కి పడ్డాడు.

ఒకవేళ సుశీల గాని రావటం లేదుగదా? ఉదయాన్నే వెళ్ళింది ఎక్కడికో! ఈ ఆలోచన రాగానే ఒళ్ళు ఝల్లు మంది సీతారామ్‌కి.

ఇంతకు బయట ఆ ఆరుగురు చూస్తున్నది సీతారామ్ అనుకున్నట్లు సుశీలనే.

రాజాని సాగనంపి హుషారుగా యింటికి పరుగెత్తుతూ, గుర్రాలమీద వచ్చే మనుషులను చూసి ఆగిపోయింది, తమ యిల్లు ఊరిచివరే కావటంవల్ల. భయంతో వణికి పోయింది వాళ్ళని గుర్తించగానే.

ఆ గుర్రాలమీద నున్న వ్యక్తులు కూడా సుశీలను చూశారు.

ఆరుగురిలో ఒకడన్నాడు. "ఒరేయ్ కోటీ! ఎవర్రా ఈ పిల్ల? ఒంటరిగా ఉంది."

"తెలియదు దొరా! బహుశా ఈ పల్లెదేనేమో?" కోటి గాడు జవాబిచ్చాడు.

"ఈ పల్లెని దోచుకున్నాం కదరా! ప్రజలంతా ఊరు విడిచిపెట్టి వెళ్ళిపోయారని విన్నామే?"

"తెలియదు దొరా! బహుశా ఎవరన్నా తిరిగొచ్చారేమో?"

"ఆ పిల్లని పట్టుకోండి. మజా చేసుకోవచ్చు" వెకిలిగా నవ్వుతూ అన్నాడు దొర. వెంటనే యిద్దరు రౌతులు గుర్రాల్ని ముందుకు దూకించారు. సుశీల వెనక్కి తిరిగి పరుగెత్తసాగింది. కాని గుర్రంముందు ఆమె పరుగెంత? ఆమె కాళ్ళు చేతులు కట్టివేసి ఒక గుర్రంమీద వేసుకొని తీసుకవచ్చారు. ఆరుగురు వెకిలిగా నవ్వుతూ ఆమెనిచూసి పెదాలు తడిచేసుకోసాగారు.

గుర్రంమీద బంధించబడి ఉన్న సుశీలని చూడగానే అదిరిపడ్డారు సీతారామ్, లక్ష్మమ్మలు. కెవ్వున అరవబోయింది లక్ష్మమ్మ. సీతారామ్ చప్పున ఆమె నోరు మూశాడు.

ఒకడు సుశీలని గుర్రంమీద నుంచి క్రిందకి దింపాడు. తమ ఇంటికి దాదాపు ఎదురుగానే ఆగటంవలన వీరిచర్యలన్ని స్పష్టంగా కనిపిస్తున్నాయి సీతారామ్‌కి. సుశీల గింజుకొంటూంది. ఇద్దరు వ్యక్తులు ఆమెని మోసుకొని సీతారామ్ ఇంటికి అయిమూలగా ఉన్న ఇంట్లోకి తీసుక వెళ్ళారు.

సీతారామ్‌లో క్రోధం పెచ్చు పెరిగిపోయింది. ముందు వెనుక లాలోచించలేదు. ఒకడిని గురిచూసి కాల్చాడు. కుప్పకూలాడతను.

తుపాకిశబ్దం కావటంతోనే మిగిలినవాళ్ళు తలలు వెనక్కి తిప్పి చూశారు. మరొకడు నేలకూలాడు. చటుక్కున సుశీలను తీసుకెళ్ళిన ఇంట్లోకి పరుగెత్తారు నలుగురు. అది కూడా సీతారామ్ ఉంటున్న ఇల్లులాంటిదే.

ఒక గుర్రాన్ని కాల్చాడు సీతారామ్. పెద్దగా సకిలిస్తూ గుర్రాలు పరుగెత్తాయి. ఇప్పుడు ఆ ఇంటికి, ఈ ఇంటికి మధ్య అడ్డంలేదు.

ఆ నలుగురు వ్యక్తులకు సీతారామ్ ఉంటున్న ఇంట్లోంచి కాల్పులు జరుగుతున్నాయన్న సంగతి తెల్సిపోయింది. నలుగురూ అతని ఇంటికి గురిచేసి కాల్పులు సాగించారు. వాళ్ళ తుపాకీ కాల్పులకు సీతారామ్ ఇంటి పెచ్చులూడి పోయి క్రిందపడసాగాయి.

సీతారామ్ కాల్పులు ఆపుచేశాడు. అటువైపునుంచి నాలుగయిదుసార్లు కాల్పులు సాగాయి. సీతారామ్ వేపు నుంచి కాల్పులు రాకపోవటంతో వాళ్ళూ ఆపారు. కొద్ది సేపు నిశ్శబ్దం అయిపోయింది.

ఒకడు నెమ్మదిగా పాకుతూ బయటికి వచ్చాడు. అంతే! అతడి ముఖం పచ్చడయిపోయింది. అరుస్తూ క్రిందపడి దొర్లాడు. సీతారామ్ ఇంటిమీద గుండ్లవర్షం కురిసింది.

"అబ్బ!" అన్న మూలుగుతో సీతారామ్ తల ప్రక్కకు తిప్పాడు. గుండు ఒకటి లక్ష్మమ్మకు తగిలి, ఆమె క్రింద పడిపోయింది. "లక్ష్మీ!" గావుకేక పెట్టాడు సీతారామ్ గన్ వదలి. అంతలోనే కాల్పులో ఒక గుండు అతని భుజాలలో దిగింది. కుప్పగా కూలిపోయాడు సీతారామ్.

ఎంతకీ కాల్పులు జరగకపోవటంతో అటువేపునుంచి ముగ్గురిలో ఒకడు బయటకువచ్చి సీతారామ్ ఇంటివైపు పరుగెత్తాడు. అతని కేప్రమాదం సంభవించకపోవటంతో

మిగిలిన ఇద్దరు సీతారామ్ ఇంటిలోకి పరుగెత్తారు.

బోర్లగా లక్ష్మమ్మ శవంపై పడిపోయిఉన్నాడు సీతారామ్. రక్తం విపరీతంగా కారిపోయిఉంది.

పెద్దగా నవ్వారు వారు సీతారామ్‌ని చూసి. ఒకడు కాలితో వెల్లకిలా తిప్పాడు సీతారామ్‌ని.

"ఇంత ముసిలోడుకి ఎంత ధైర్యంరా? మనల్నే కాలుస్తాడా? అరేయ్. ఇంతకు ఆ పిల్లేది?" అనరిచాడొకడు.

ఒకడు పోయి సుశీల కాళ్ళ కట్లు విప్పి లాక్కొచ్చాడు. తల్లిదండ్రులను చూస్తూనే పెద్దగా అరిచి వారిమీద పడిపోయింది సుశీల. దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది.

"పాపం! ఈ పిల్ల తల్లిదండ్రులాగున్నా(రా!" అని ఒకడన్నాడు.

"నాన్నా! నాన్నా!" కుదిపింది చేతులతో సుశీల తండ్రిని. నెమ్మదిగా కళ్లు తెరిచి చూశాడు సీతారామ్.

"అమ్మా! నిన్ను ఈ రాక్షసుల బారినుండి తప్పించలేకపోతున్నామమ్మా. ఈ సమయంలో రాజా ఉంటే ఎంత బాగుండేది? తల్లి. నిన్ను ఒంటరిగా వదిలేసి పోతున్నాం. అబ్బ!" మూలిగాడు సీతారామ్.

రాజా అన్న పేరు విని వారు ముగ్గురు ఉలిక్కిపడ్డారు. తుపాకులు తయారుగా పట్టుకున్నారు.

"అమ్మా సుశీలా! నేను చేసిన ఘోరానికి శిక్ష అనుభవిస్తున్నానమ్మా. రాజా తల్లిని నాశనంచేసింది ఎవరో కాదు. నేనే! నేనప్పుడు మల్లు ముఠాలో సభ్యుణ్ని. కొంతకాలం తరవాత విడిపోయాము అంతా. అప్పుడే నువ్వు పుట్టావు రాజా ఇంతకాలం వెదుకుతున్నది నాకోసమే. నన్ను అతడు గుర్తించలేదు. కాని భగవంతుడు నాకు తగిన శిక్ష

చాడు. నా కూతుర్ని బలి తీసుకోబోతున్నాడు'' ఆయాసంతో ఆగాడు సీతారామ్.

అప్రతిభురాలయిపోయింది సుశీల. సీతారామ్ ఏదో చెప్పబోయి కళ్ళు తేలేశాడు. పెద్దగా అరిచి అతని శవంపై బడిపోయిందామె.

''చచ్చినవాడితో పనేమిటి? మేమున్నాముగా!'' వెకిలిగా అన్నాడొకడు. సుశీల గింజుకుంది. వారించింది. ప్రార్థించింది. వారు ముగ్గురు సుశీలను బయటికి లాక్కెళ్ళారు ఎదురింట్లోకి.

# 6

తూర్పున వెలుగు రేఖలు విచ్చుకుని ముఖంమీద పడటంతో మెలకువ వచ్చింది రాజాకి. చుట్టూ చూశాడు. ప్రక్కనే గుర్రం నిలబడిఉంది. గుర్రాన్ని విప్పి నీటిలోకి వదిలి ముఖం కడుక్కున్నాడు. ప్రక్కనే ఉన్న చెట్ల ఫలాలుతిని, కడుపునిండా నీళ్ళు తాగాడు. గుర్రం ఎక్కి నెమ్మదిగా బయలుదేరాడు.

ఆ రామసేన ముఠా ఇంకా ఆ లోయలోనే ఉందో లేదో తెలియదు. ఏమాత్రం చప్పుడు విన్పించినా అటువైపు చేతిలో రివాల్వర్ త్రిప్పుతున్నాడు. గుర్రాన్ని అదిలించాడు. అది వేగంగా పరుగెత్తసాగింది. వానకురిసి తడిఅవటంవల్ల కాబోలు అసలు పెద్దగా శబ్దం చేయటంలేదు.

దాదాపు అరగంట ప్రయాణించి అవతలి కొండవద్దకు చేరుకున్నాడు. కొండ దిగువన ఆపాడు గుర్రాన్ని.

'ఈపాటికి రామసేన కొండ ఎక్కి దాటిపోయి ఉంటుంది. వారిని చేరుకోవాలంటే త్వరగా దాటాలి కొండను' అనుకున్నాడు. ఈకొండ, వెనుకటి కొండ వలె కాకుండా ఏటవాలుగా ఉంది. సునాయాసంగా

గుర్రాన్ని నడిపించసాడు ఎక్కువుంది. కొద్ది దూరం ఎక్కువగానే పిస్టలు పేలిన చప్పుడు ధ్వనించింది. గుండు రాజా ప్రక్కగా దూసుకుపోయి అతని ఎదురుగానున్న చిన్న బండరాయికి కొట్టుకుంది. అదిరిపడి వెనక్కు తిరిగి చూశాడు రాజా.

ముగ్గురు వ్యక్తులు గుర్రాలమీద కూర్చొని, చేతిలో పిస్టల్స్‌ను అతనికి గురిపెట్టి ఉన్నారు. వారు రామసేన ముఠాలోనివారేనని గ్రహించాడు రాజా. అయితే అత నిలో అనుమానం వచ్చింది. వాళ్ళు ముగ్గురే ఉన్నారు. అయితే మిగిలిన వాళ్ళు ఏమయినట్లు?

"ఎవర్నువ్?" అరిచాడు మధ్యలో ఉన్న దొర. వారు అంతకుముందు రోజు సుశీలను మానభంగం కావించినవాళ్ళే.

రాజా మాట్లాడలేదు. వారిలో తను చిన్నప్పుడు చూసిన వ్యక్తి పోలికలు కన్పిస్తాయేమోనని పరిశీలించాడు. గడ్డాలు దట్టంగా పెరిగి ఉన్నాయి. జుట్టంతా చిందర వందరగా ఉంది. ఆ ముగ్గురూ క్రూరంగా చూస్తున్నారు రాజావంక. ఎంత ప్రయత్నించినా వారిలో తనకు కావా ల్సిన వ్యక్తి లక్షణాలు కన్పించలేదు రాజాకి.

"ఏమిటి మాట్లాడవు? ఎవర్నువ్వు? ఎందుకిక్కడికి వచ్చావు?" మరొకడన్నాడు. "మాట్లాడేదేముంది. కాల్చి పారేయండి" దొర ఆజ్ఞాపించాడు.

రాజా నడుముకు ఉన్న రివాల్వర్ కేస్‌లోనుండి రివాల్వర్ తీయడం, వారిని గురిచూసి కాల్చటం క్షణాల్లో జరిగిపోయింది. ఏం జరిగిందో తెల్సుకునే లోపునే ఇద్దరి ప్రాణాలుపోయాయి. మూడోవాడి పిస్టలు గురితప్పి గుర్రం కాళ్ళదగ్గర పేలింది. పిస్టలు శబ్దాలతో ఆ లోయ అంతా మారుమోగిపోయింది.

రాజా గుర్రంమీదనుంచి క్రిందకురికాడు. మూడోవాడి జబ్బ పట్టుకొని క్రిందకు గుంజాడు. అతని పొట్టలో తగిలింది గుండు. ఏదో మాట్లాడబోయి తలవాల్చేశాడతను.

రాజా వాళ్ళ శవాలు తడిమాడు. నాటు రకం పిస్టల్సు తప్ప మరేమీ లేవు. నిరాశగా గుర్రం ఎక్కి కొండ ఎక్కించడం ప్రారంభించాడు. కొండశిఖరం చేరుకుని ముందుకు చూశాడు. దూరంగా నాలుగయిదు మైళ్ళ దూరంలో ఏదో పల్లె కన్పించింది. గుర్రాని నెమ్మదిగా క్రిందికి దింపి, పల్లెవైపు బయలుదేరాడు.

కొంతదూరం పోయేటప్పటికి ఎర్రమట్టి రోడ్ కన్పించింది. అది తిన్నగా పల్లెవైపు దారితీస్తూంది. ఆ రోడ్ కిరువైపులా బీడుపడ్డ పొలాలు, పొదలు తప్ప మరేమిలేవు. ఎర్రటి మట్టిలో దుమ్ము రేపుకుంటూ రాజా గుర్రం పరుగులు తీయసాగింది.

పల్లె సమీపించింది. దూరంగా వస్తున్న గుర్రం, దాని మీద మనిషిని చూడగానే పల్లె ప్రజలు ఎక్కడి వారక్కడే భయంతో ఆగిపోయారు. బిలబిల పరుగెత్తి ఎవరి ఇళ్ళకు వారుచేరి తలుపులు వేసుకొని, కిటికీ సందుల గుండా రోడ్ మీదకు చూడసాగారు.

రాజా ఆ పల్లెలోకి ప్రవేశించాడు. వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. ఆ పల్లెకూడా దాదాపు సీతానగరంలాగానే ఉంది. ప్రధానమయిన రోడ్ అదే. విశాలంగా, వెడల్పుగా ఉంది. రోడ్ కిరువైపులా కొండ రాతితో కట్టబడిన ఇళ్ళు, పూరిగుడిసెలు ఉన్నాయి. రెండు మూడు వీధులున్నాయి. మొత్తంమీద ఆ పల్లెలో జనాభా రెండు వేలకు మించి ఉండదనుకున్నాడు ఇళ్ళని బట్టి. అతను ఇళ్ళ సందుల్లోంచి ప్రజలు భయంగా తనవంక

చూడటం గమనించాడు. తన్ను చూసి ఎందుకు భయ పడుతున్నారో అర్థం కాలేదతనికి. తనవేషం కౌబోయ్‌లా ఉండటం చూసి ఎవరో అనుకుని భయపడుతున్నారని అనుకున్నాడతను. అంతలోనే గుర్తుకొచ్చింది. తనని రామ సేన సభ్యుడని భావించటం లేదు కదా?

నెమ్మదిగా ఒక యింటిముంగుకి గుర్రాన్ని నడిపించి, దిగాడు. తలుపులు వేసిఉన్నాయి. కిటికీ సందులోంచి తనను చూడటం గమనించాడు రాజా. తలుపులు తట్టాడు. ఎవరూ తీయలేదు.

"భయపడకండి. నేను మిమ్మల్నేమి చేయను. నేను రామసేన సభ్యుణ్ని కాదు" అని అరిచాడు పెద్దగా. లోపల్నుంచి సమాధానం లేదు. మరొకసారి అరిచాడు.

"లేదు. నిన్ను నమ్మం. నువ్వు రామసేన సభ్యుడివి" లోపలినుంచి వినబడిందొక కంఠం.

"లేదు. కావాలంటే నన్ను చూడండి. నా దుస్తులు వాళ్ళ దుస్తులులా ఉన్నాయా?"

అతనలా అరవగానే ఒక యువకుడు కిటికీ దగ్గరకు వచ్చి రాజాని పరీక్షగా చూశాడు. రాజా రామసేన సభ్యుడిలా లేడు. వాళ్లు అంత శుభ్రంగా ఉండరు. వాళ్ళ దుస్తులే వేరు. పైగా మోటువాళ్ళు. రాజా చూస్తే కొంచెం సంస్కారవంతుడిలా ఉన్నాడు.

"సరే! నువ్వు ఆ ముఠాలో వాడివి కావని నమ్ము తున్నాను. ఏం కావాలి?" అన్నాడా యువకుడు.

"మీరంతా ఎందుకు భయపడుతున్నారో నాకు తెలుసు. నన్ను రామసేన సభ్యుడనుకుంటున్నారు. కాని కాదు. నేనూ వారిని వెదుక్కుంటూ వస్తున్నాను. మీ ఊరి జమీందారైన రాయుడిగార్ని రామసేన సభ్యులు

చంపేశారు'' అన్నాడు రాజా.

ఆ మాట వినగానే ఆ యువకుడు ఉలిక్కిపడ్డాడు. "రాయుడిగార్ని చంపేశారా?" అనడిగాడు ఆత్రుతగా. రాజా తనకు తెల్సిన సంగతి చెప్పాడు నిధిరహస్యం తప్ప.

వీరిద్దరికి జరుగుతున్న సంభాషణను ఆలకిస్తున్న ఇతరులు రాయుడు చనిపోయారని వినటంతోనే కళవళ పడ్డారు.

"మీ గ్రామపెద్ద యిల్లు ఎక్కడ?" అడిగాడు రాజా.

"ఇదే! నేను ఆయన కుమారుణ్ని" యువకుడు జవాబిచ్చాడు.

"నాకు ఆయనవల్ల కొంత సమాచారం, సహాయం కావాలి."

ఆ యువకుడు కొద్దిసేపు ఆలోచించాడు. లోనికి నడిచాడు.మరల కిటికీవద్ద ప్రత్యక్షమై రాజావంక పరిశీలనగా చూశాడు. అతను రామసేన సభ్యుడు కాదని నిశ్చయించుకున్నాడు. సాధారణంగా రామసేన సభ్యులు మనిషిని చూస్తే కాల్చిపారేస్తారు. కాని యితని ప్రవర్తన మరో విధంగా ఉంది. తలుపు తెరిచి లోనికి ఆహ్వానించాడు రాజాని. గుర్రం దిగి లోనికి అడుగుపెట్టాడు రాజా.

గ్రామపెద్ద రాజాని అలా లోనికి రమ్మనమనటంతో గ్రామప్రజలలో ధైర్యం వచ్చినట్లుంది. ఒక్కొక్కరే బయటకు చేరుకొని, గ్రామపెద్ద యింటిముందు గుమికూడారు.

లోపల రాజాకి ఎదురుగా ఒక వృద్ధుడు చిన్న కుర్చీపీటపై కూర్చొని ఉన్నాడు. ఆయన ప్రక్కన నలుగురు పిల్లలు నిలబడ్డారు. వారిప్రక్క ఒక వృద్ధురాలు, ఆమె ప్రక్క ఒక యువతి నిలబడి ఉంది. ఆమె ఆ యువకుడి భార్య అయివుంటుందని తలంచాడు రాజా. అందరు

భయంగా రాజావంక చూస్తూ నిలబడ్డారు.

"నా పేరు రాజా! మాది రామాపురం. నేను రామ సేన ముఠావాణ్ని కాదు. నన్ను నమ్మండి" అన్నాడు రాజా.

"సరే నమ్ముతున్నాను. నీకేసహాయం కావాలి!" అడిగాడు వృద్ధుడు.

"ఆ రామసేన ఈ ఉదయం ఇటుగా పోయి ఉండాలి. నిజమేనా?"

"నిజమే" జవాబిచ్చాడు వృద్ధుడు.

"వాళ్ళ వివరాలు కావాలి. రామసేనలో ఎంతమంది ఉంటారు? వారి నివాసం ఎక్కడ మొదలైన వివరాలు కావాలి" అన్నాడు రాజా.

వృద్ధుడు చెప్పటం ఆరంభించాడు: "మాకు రామసేన పెద్ద బెడదగా ఉంది బాబు. ఎక్కణ్నుంచి, ఎప్పుడొస్తారో తెలియదు. గద్ద కోడిపిల్లని తన్నుకుపోయినట్లు హఠాత్తుగా వచ్చి పల్లెమీద పడతారు. దాచుకున్న ధాన్యం, ఆభరణాలు, విలువైన వస్తువులు దోచుకుపోతారు. వారి కంటబడ్డ ఏ పడుచుపిల్లను ఒదలరు. మగ వాళ్ళను మాత్రం కాల్చి పారేస్తారు. అటువంటి వారు ఈ రోజు ఉదయం ఎటువంటి గొడవ చెయ్యకుండా పిస్టల్సు గాలిలోకి పేలుస్తూ పల్లెలోంచి దూసుకుపోయారు."

"ఎటువైపు" ఉత్సాహంగా అడిగాడు రాజా.

"అదుగో! ఆ కొండలలోనే వాళ్ళ నివాసం అని అనుకుంటారంతా. కానీ నాకూ సరిగ్గా తెలియదు. సుమారు యాభైమంది ఉన్నారు."

"నేను వారిని నాశనం చేస్తాను. ఎవరైనా నాకు తోడు వస్తారా?" అడిగాడు రాజా. వృద్ధుడు మాట్లాడలేదు.

ఒక్క క్షణం వృద్ధుడివైపు నడిచి, బయటకు నడిచాడు. అతని వెనుకనే వృద్ధుడూ బయటకు నడిచాడు. వారిని చూడగానే అంతవరకు బయట నిలబడి గుసగుసలాడుతున్న జనమంతా మౌనం వహించారు.

వృద్ధుడు రాజా గురించి ప్రజలకు వివరించి చెప్పాడు. రాజాకి సహాయం వచ్చేవాళ్లుంటే రమ్మనికూడా అడిగాడు. కాని ఎవరూ ముందుకు రాలేదు. రాజానే వారికి ధైర్యం చెప్పాడు. వారిలా అధైర్యపడితే లాభంలేదని, ఎదురు తిరిగి మట్టుపెట్టాలని హెచ్చరించాడు.

అతనలా అనేసరికి పాతికమంది యువకులు ముందుకు వచ్చారు తాము సహాయం వస్తామంటూ. రాజా వారి ధైర్యంచూసి సంతోషించాడు.

"మీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను. కాని ఇది ప్రాణాలతో చెలగాటం. అన్నిటికీ తెగించినవాళ్ళే ముందుకు రండి. వారి ఆత్మీయుల, బంధువుల అనుమతి కూడా తీసుకోండి" హెచ్చరించాడు రాజా.

కొంతమంది వెనక్కు తగ్గారు. చివరకు పదిహేనుమంది యువకులు తయారయ్యారు.

"మీకు తుపాకీ కాల్చటం తెలుసునా?" ప్రశ్నించాడు రాజా.

ఎవరూ తమకి రాదన్నారు. "అంతా తుపాకీలను సిద్ధం చేసుకోండి. రేపటి్నుంచి ఎలా కాల్చాలో నేర్పుతాను" అన్నాడు రాజా. అంతా తలలూపి వెళ్ళిపోయారు.

రాజా ఆరోజు గ్రామపెద్ద ఇంటిలోనే భోజనం చేశాడు. మర్నాటినుంచి తుపాకీ ఎలా కాల్చాలో, గుర్రపుస్వారి మొదలయిన విద్యలు వారికి బోధించాడు. వారం

రోజులలో అంతా సుశిక్షితులయ్యారు. ఒక మంచి రోజున అందరి ఆశీస్సులతో అంతా గుర్రాలమీద బయలుదేరారు రాజా నాయకత్వంలో.

ఆ పల్లెకు అటువైపు కూడా కొండలున్నాయి. ఆ కొండలలోనే రామసేన స్థావరం. అందరిని హెచ్చరించాడు రాజా ముందే.

"మనం ప్రాణాలతో తిరిగి వస్తామో రామో తెలియదు. ఆ దోపిడీ దొంగలను చంపి మనం చావాలి. ఇతరులకు వారి బాధ లేకుండా చేయాలి."

# 7

ప్రయాణం సాగిపోతూంది. చూడటానికి కన్పిస్తున్నా ఆ కొండలకు, పల్లెకు దూరం పాతికమైళ్ళ పైనే ఉంటుంది. దూరంగా నీలిరంగులో కొండలు కన్పిస్తున్నాయి.

"మధ్యలో ఊళ్ళేమయినా లేవా?" రాజా ప్రశ్నించాడు తన ప్రక్కనే ఉన్న ఒక వ్యక్తిని.

"పల్లెలయితే ఉన్నాయి కాని, అంతా ఖాళీచేసి వెళ్ళిపోయారు. ఆ రామసేన ఆగడాలు భరించలేకపోయారు. అంతకంటే ఏమిచేయగలరు!"

"ఖాళీచేసి ఎక్కడికి పోగల్గుతారు? ఎంతకాలమని ఉంటారు?"

"ఈ చుట్టుప్రక్కలగల నాలుగయిదు ఊళ్ళన్నీ ఖాళీ అయ్యాయి. ఇక మాపల్లె ఒక్కటే మిగిలిపోయింది. ఇవాళో, రేపో ఖాళీచేసి ఎక్కడో వందమైళ్ళ దూరంలో ఉన్న పట్నం వెళ్ళిపోదామనుకుంటున్నాం. కాని ఇంతలో మీరు వచ్చేశారు."

రాజా గుర్రం ఆపాడు టక్కున. అతన్ని అనుసరించి

వస్తున్నవారు కూడా ఆపారు. ముందుకు దృష్టి సారించారు. దూరంగా ఏదో నల్లటి పొగ ఆకాశంలో కన్పిస్తోంది.

“ఆ పొగ వచ్చే ఊరిపేరు చంద్రాయిపాలెం. బహుశా తగలబడుతున్నదేమో?” ఆదుర్దాగా అన్నాడు ఒక యువకుడు.

“ఆపల్లె కూడా ఖాళీ అయిందా?”

“అవును. మొత్తం పట్నం వెళ్ళిపోయారు.”

రాజా ఆలోచించాడు. పల్లె ఖాళీచేసి వెళ్ళినా ఇంకా పొగ రావటం ఏమిటి? రామసేన ఇంకా అక్కడే ఉందా, లేక పోతూపోతూ ఏదైనా ఇంటిని తగలబెట్టి పోయారా? పొగను చూస్తే దట్టంగా, ఇప్పుడే తగలబెడుతున్నట్లు ఉంది. పల్లెలో ఎవరయినా ఉన్నా అంత పొగ వచ్చేట్లు మంట వేయరు.

“మనం రామసేనను సమీపించాం. జాగ్రత్తగా ఉండండి. పల్లెలోకి వెళ్ళగానే కాల్పులు సాగిస్తారు. తుపాకులతో సిద్ధంగా ఉండండి” అరిచాడు రాజా వెనక్కు తిరిగి.

గుర్రాలు పల్లెవైపు దౌడు తీయసాగాయి. వారంతా ఎర్రటి దుస్తులలో ఉన్నారు. అందువల్ల ముఖాముఖీగా ఎదుర్కొన్నా తమవారెవరో, దొంగలెవరో తెల్సిపోతుందని రాజానే అలా చేయించాడు.

అందరికన్న ముందుగా రాజా గుర్రం దౌడుతీయసాగింది. ఎర్రమట్టి రోడ్డు కావటంవల్ల దుమ్ములేస్తోంది. అందరిదీ ఒకే గమ్యం, ఒకే దృష్టి. అందరూ పల్లెని సమీపించారు.

అది మిగిలిన పల్లెలకన్న భిన్నంగా ఉంది. ఆ ఊళ్ళో ఇళ్ళన్ని దాదాపుగా కొండరాళ్లు పేర్చి వాటితో కట్టబడ్డాయి. మొదట ఒకటిగా ఉన్న ప్రధాన మార్గం

కొంత దూరంపోయి రెండుగా చీలిపోయింది. ఆ రెండు చీలికలు ప్రక్క ప్రక్కనే ఉండి ఇంగ్లీషు 'వై' ఆకారంలో ఉన్నాయి. రాజా తన బృందంతో ప్రవేశించాడు ఊళ్ళో. రోడ్డు చీలిక దగ్గర ఆగిపోయారు.

“ఆ ఎడమవయిపు మార్గం కొండలలోకి పోతుంది. కుడివైపు మార్గంగుండా వెళితే నాగాయిపాలెం వస్తుంది” వివరించాడొక యువకుడు.

రాజా పరిశీలనగా రెండు దోవలగుండా దృష్టి సారించాడు. రెండూ తిన్నగా ఏ మెలికలు లేకుండా ఉండి ఊరు చివరలు కూడా స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఎడమవైపు ఊరిచివర పెద్ద దేవాలయం గోపురం ఎత్తుగా ఉండి కన్పిస్తోంది. దాని ప్రక్కనే మూడంతస్థులు గల మేడ, జమీందారుని కావోలు కన్పిస్తోంది. అదొక్కటే ఆ ఊళ్ళో ఎత్తైన భవనం.

రాజా ఎడమవైపు మార్గంలోకె గుర్రాన్ని మళ్ళించాడు. రాజా కళ్ళు ప్రతి ఇంటిని, ప్రతి వీధిని అంగుళం వదలకుండా గాలిస్తున్నాయి. కొద్దిదూరం వెళ్ళారు.

“ఆ కన్పించే ఎత్తైన భవనం ఈ ఊరి జమీందారు, గ్రామపెద్ద ఐన రాజారావు బహద్దరు గారిది” అన్నాడు ఒక యువకుడు.

“ఇప్పుడాయింట్లో ఎవరైనా ఉంటున్నారా?” ప్రశ్నించాడు రాజా.

“ఎవరూ లేరు. అంతా ఖాళీ అయిపోయింది” అన్నాడతను. దేవాలయంకు అటువైపు ఉన్న మూడో ఇల్లు తగలబడుతోంది. అక్కడ్నించే పొగ వస్తోంది. దేవాలయానికి యిటువైపు జమీందారుగారి భవనం. ఆ భవనం రాజా కుడిచేతివైపు ఉంది.

అందరూ భవనాన్ని సమీపించారు. భవనానికి, వారికి మధ్యదూరం సుమారు వెయ్యి గజాలు ఉంటుంది. అదే సమయంలో భవనం పై అంతస్తులో ఏదో ఆకారం కద లటం గమనించాడు రాజా. అతని చేతులు రివాల్వర్‌ను ఎత్తాయి.

అదే క్షణంలో ఆ భవనం పైఅంతస్తు నుండి తుపాకులు పేలాయి "ధన్" మంటూ. ఆ శబ్దానికి రాజా బృందం లోని గుర్రాలన్నీ బెదిరి పెద్దగా సకిలిస్తూ ముందుకాళ్ళమీద లేచాయి. కొంతమంది అదురుపాటుకు క్రింద పడ్డారు. మరోమారు తుపాకులు పేలాయి. గుళ్ళదెబ్బలు తగలటం వలన రోడ్‌మీద ఎర్రమట్టి దుమ్ము లేచింది. గుర్రాలు అటూ, ఇటూ పరుగెత్త సాగాయి.

రాజా అనుచరులలో ధైర్యం సన్నగిల్లింది. బతికుంటే బలుసాకు తినవచ్చని ఎవరికివారే గుర్రాలు ఎక్కి వెనుదిరిగి పారిపోసాగారు. వారిమీద గుళ్ళ వర్షం కురియసాగింది.

ఈ హడావిడిలో రాజా గుర్రాన్ని ముందుకు దూకించాడు. అతనిమీద గుళ్ళవర్షం కురుస్తున్నా కూడా లెక్క చేయకుండా, రివాల్వర్ ఎత్తి భవనం వైపు గురి పెట్టి కాల్చాడు. ఎవరో పెద్దగా అరుస్తూ పడిపోయారు. మరు క్షణమే గుళ్ళవర్షం రెట్టింపు అయింది. రాజా కాలిలో గుండు దిగబడింది. గుర్రం మీదనుంచి క్రింద పడ్డాడు. గుర్రం పారిపోయింది.

లేచి నిలబడబోయేంతలో మరొక గుండు ఎడమభుజంలో దూరింది. దొర్లుకుంటూ పడివైపు ఉన్న ఇంట్లోకి ప్రవేశించాడు. భుజంనుంచి, కాలినుంచి విపరీతంగా రక్తం కార సాగింది. జేబులో ఉన్న గుడ్డను చించి కాళ్ళకు, భుజానికి అతికష్టంమీద కట్టుకున్నాడు రక్తం రాకుండా. శరీరం

అంతా నిస్సత్తువుగా అయిపోయింది.

ఒకసారి తాను ఉన్న ఇల్లు చూశాడు. పూర్తిగా రాళ్ళతో చేయబడిందది. లోపలంతా మసిబారిపోయి ఉంది. ఆయిదారు గజాల అవతల పశువుల కొట్టం ఉంది. ఆ ఇల్లు పైభాగం చదునుగా, చట్టాలా ఉంది. పశువుల కొట్టంలో నీళ్ళతొట్టి కన్పించింది. ఆశగా దాని దగ్గరకు పాక్కుంటూ వెళ్ళాడు. అడుగున ఎప్పటివో నీళ్ళు కన్పించాయి. ఆత్రంగా దోసిలితో తాగాడు. కాస్త సేద తీరింది.

పైన చట్టామీద అలికిడి అయింది. మెరుపులా రివాల్వర్ తీసి పేల్చాడు అలికిడి అయిన వైపు. ఎవరో అరుస్తూ నేలకూలారు.

గుమ్మంవరకు పోయి, అతని చేతిలోని తుపాకీ లాక్కున్నాడు. తల బయటపెట్టి చూశాడు. భవనంనుంచి పది, పన్నెండుమంది బందిపోటు దొంగలు తుపాకులతో తయారయి ఆ ఇంటివేపు వస్తున్నారు. గురిచూసి పేల్చాడు. వరసగా కూలిపోయారందరూ.

కొద్దినిముషాల అనంతరం రోడ్ మీదకు మరో పదిహేను మంది ప్రత్యక్షమయ్యారు. మరలా వారిని కాల్చసాగాడు రాజా. అదేసమయంలో పైన ఇళ్ళమీదుగా వచ్చిన దొంగలు అతనిమీదపడి, తుపాకీ లాక్కున్నారు.

# 8

దాదాపు నలభైమంది వ్యక్తులు.

కండలు తిరిగి, మోటుగా ఉన్నారు. దళసరిగా ఉన్న కోట్లు, నీరుకావి రంగు ధోవతులు. భుజాలకు తుపాకులు వేలాడుతున్నాయి. భుజానికి, నడుంకి అయిమూలగా తూటాలున్న బెల్టు ఉంది.

ఆ దొంగల గుంపు నాయకుడి పేరు దొర. అతన్ని అందరూ దొర అనే పిలుస్తారు. అతనికి మాత్రం నెత్తి మీద తలపాగా చుట్టబడి ఉంది.

ఆ నలభైమందీ, నలభై గుర్రాలు ఎక్కి పోతున్నారు. అదే రామసేన.

దొర అందరికంటే ముందుండి దారితీస్తున్నాడు తమ స్థావరానికి. అతని వెనుక మూడు వరుసలలో మిగిలిన అనుచరులు అనుసరిస్తున్నారు. చివర వరుసలోనున్న ఒక గుర్రంమీద రాజా కట్టివేయబడి ఉన్నాడు. అతను స్పృహలోలేడు. గుర్రాల డెక్కలకు దుమ్ము లేస్తోంది.

అంతా ప్రయాణించి ఆ కొండల దగ్గరకి చేరారు. ఆ కొండలలో కొంతదూరం ప్రయాణించారు. అక్కడంతా కొండలన్నీ ఒత్తుగా ఉన్నాయి. కొంత దూరంపోయి ఒక బండరాతి వెనుకకు వెళ్ళారు. దాని వెనుక ఒక దోవ ఉంది. అది రెండు నిలువుగానున్న కొండలు ఒరుసుకునే ప్రదేశం. వాటి రెంటినడుమ చిన్న సందు, దోవగా ఉపయోగపడుతోంది. ఆ దోవముందే పెద్ద బండరాయి ఉండటంవలన దాని వెనుకనున్న దోవ, పరీక్షగా చూస్తేకాని తెలియదు.

ఆ దోవగుండా లోనికి ప్రవేశించారు. లోపల అంతా మైదానం, చక్కటి గడ్డి పెరిగిఉంది. ఆ గడ్డిమధ్య దోవ ఉంది. ఆ మైదానం చుట్టూ నిలువుగా ఉన్న కొండలు. ఆ దోవ తప్ప మరో దోవలేదు లోపలికి. బయటనుండి చూసేవాళ్ళు ఆ కొండల నడుమ అంత విశాలమయిన మైదానం ఉందని గ్రహించలేరు. కనీసం ఊహించనయినా ఊహించలేరు. ఆ మైదానంలోనే ఒక మూల పెద్ద సెలయేరు పారుతోంది కొండలమీదనుంచి.

ఆ దొంగలు అంతా గడ్డి మధ్యగానున్న దోవగుండా ప్రయాణించి మైదానం ఆవలివైపు చేరారు. అక్కడ గుహలులా ఉన్నాయి. ప్రక్కనే రాతితో నిర్మించబడిన ఇళ్ళున్నాయి.

దొర ఆజ్ఞ మీద రాజాని ఒక విశాలమైన గుహాలో బంధించారు. అక్కడ ఉన్న ఎండు గడ్డిమీద, కాళ్ళు చేతులు కట్టి కూలేశారు.

రాజాకి ఇంకా స్పృహరాలేదు. అతను తప్పించుకో లేడని వారి ఆలోచన. అతని దగ్గరున్న రివాల్వరు,తూటాలు లాక్కున్నారు. అతన్ని వదలి తమతమ ప్రదేశాలకు వెళ్ళి పోయారు. అప్పటికే చీకటిపడింది. గుహాలో కాగడాలు వెలిగించి ఉన్నాయి చీకటిగా ఉండటంవలన.

# 9

స్పృహ వచ్చింది రాజాకి. నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు.

ఒక్కక్షణం తను ఎక్కడున్నది జ్ఞప్తికి రాలేదు. క్రమంగా అంతా గుర్తుకొచ్చింది. 'అయితే వాళ్ళు తనని బంధించారన్నమాట' అనుకున్నాడు రాజా.

అతనికి ఒక సందేహం కలిగింది. మనిషిని చూస్తే చాలు కాల్చిపారేసే ఈ బందిపోట్లు తనని కాల్చకుండా ఎందుకు వదలిపెట్టినట్లు? బహుశా తనవేషం వింతగా తోచి ఉండవచ్చు ననుకున్నాడు రాజా.

తలవిదిలించి ఆ గుహను పరిశీలనగా చూశాడు. కాగడాల వెలుగులో అంతా స్పష్టంగా ఉంది. ఆ గుహాలో కత్తులు, బల్లాలు మొదలైనవి ఒక మూల కట్టగా పెట్టబడి ఉన్నాయి. రెండో మూల ఒకదానిపై ఒకటి పేర్చి ఇరవై పెట్టెలు పేర్చబడి ఉన్నాయి. వాటిని చూసి

ఉలిక్కి పడ్డాడు రాజా. అవి ఎక్స్ప్లోజివ్స్. బహుశా ఏ తెల్లదొరల దగ్గరో దొంగతనంగా తెచ్చి ఉంటారనుకున్నాడు. అలికిడై గుహ ముఖద్వారం వైపు తలతిప్పాడు.

ఎవరో ఒక వ్యక్తి లోపలికి వచ్చాడు. అతను రామసేన మురావాడని చూడగానే గ్రహించాడు రాజా. అతని తలపై తలపాగా ఉంది. అతనే నాయకుడు దొర.

"ఎవర్నువ్?" అడిగాడు అతను. అతని కంఠం క్రూరంగా, బొంగురుపోయి ఉంది.

"నా పేరు నీకనవసరం!" నిర్లక్ష్యంగా అన్నాడు రాజా. మరుక్షణం దొర తన్నిన తన్నుకి అతని కళ్ళ ముందు నక్షత్రాలు కనిపించాయి.

"ఎంత పొగరు? ఈ రామసేన నాయకుడికే ఎదురు చెబుతావా? నిన్ను చిత్రవధ చేస్తాను" అరిచాడు దొర. రాజా మాట్లాడలేదు.

"ఉదయం నీపని చూస్తాను. చిత్రవధ చేసి నీ ప్రాణాలు తీస్తాను" అని వెళ్ళిపోయాడతను. అతను వెళ్ళిన తరువాత ఇద్దరు వ్యక్తులు వచ్చి రాజాని అక్కడే ఉన్న మోకులకు బంధించారు.

# 10

తెల్లవారింది.

సూర్యుడు అప్పటికే చాలా పైకి వచ్చాడు.

రాజాను కట్లు విప్పి మైదానంలోకి తెచ్చారు. ఇప్పుడతను స్వేచ్ఛగా ఉన్నాడు. కాని రివాల్వర్ లేదు. రాత్రి ఆహారం లేకపోవటం వలన నీరసంగా ఉంది. తనను ప్రాణాలతో ఉంచరని తెలుసు. వీలయితే తప్పించుకు పారిపోవాలి. లేదా వీలయినంత మందిని చంపి చావాలి.

మైదానంలో గుహకు కొద్ది దూరంలో నిలబెట్టారు

రాజాని. ఆలోచిస్తూ నిలబడ్డాడు రాజా ఎలా తప్పించు కోవటమా అని. ఇక్కణ్నుంచి పరుగెత్తుకు పోదామన్నా బయటకు దోవ సరిగ్గా తెలియదు. తను స్పృహాలో లేని సమయంలో తెచ్చారు తనను.

ఇంతలో దొర ప్రక్కనే ఉన్న ఇంట్లోనుండి బయటికి వచ్చాడు. అతని భార్య కాబోలు బయటికి వచ్చింది అతని వెమ్మటే. అలాగే మిగిలిన జనం అంతా రాజా చుట్టూ నిలబడ్డారు వినోదం చూస్తూ. దొర క్రూరంగా నవ్వాడు రాజావంక చూసి. తన పని ఆఖరని తలంచాడు రాజా.

దొర రివాల్వర్ గురిపెట్టాడు. అది రాజాదే. దానినిండా గుళ్ళున్నాయి. రాజాకి గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కబోయాడు. అదే సమయంలో ధన్ ధన్ మంది. రాజా ఉలిక్కిపడి చూశాడు. దొర నేలమీదపడి గిలగిల కొట్టుకుంటున్నాడు. రాజా అటూ ఇటూ చూశాడు. అతనికి ప్రక్కనే ఉన్న చిన్న కొండపైనుండి ఎవరో నిలబడి చేయి ఊపారు.

రాజా ఒక్క గంతువేసి, నాయకుడి దగ్గర రివాల్వర్ లాక్కున్నాడు. ఈలోపు కొంతమంది అతనిమీదకు దూక బోయారు. టపటప కాల్చిపారేశాడు. మిగిలినవాళ్ళు గుహ లోకి పరుగెత్తారు ఆయుధాలకోసం. అదే సమయంలో రాజాకి మెరుపులా ఒక ఆలోచన తోచింది. చటుక్కున ముందుకు పరుగెత్తి, ఒకడిదగ్గర ఉన్న తుపాకీ లాక్కుని గుహవైపు గురిపెట్టి నొక్కాడు.

అంతే! అతని అంచనా తప్పుకాలేదు. గుహకు ఎదురుగా ఉన్న ఎక్స్ప్లోజివ్స్ పేలసాగాయి. రాజా చెంగున ఒక గుర్రం ఎక్కి అదిలించాడు. విపరీతమయిన వేగంతో మైదానంలోకి దౌడుతీసిందది.

వెనక గుహ దద్దరిల్లిపోతోంది. లోపలినుంచి హాహా

కారాలు, మంటలు వెలువడుతున్నాయి. మైదానం అవతలి వైపుకు దోవద్వారా చేరాడు. అతనికి సందు కన్పించింది. దానిద్వారా బయటపడ్డాడు. అప్పటికే ఒక గుర్రపు రౌతు రెడీగా నిలబడి ఉన్నాడక్కడ. రాజా అనుచరుడే అతను.

అయిదు నిమిషాలపాటు శబ్దాలు విన్పించాయి. ఇద్దరు ద్వారం ప్రక్కనే ఒక అరగంట గడిపి లోనికి వెళ్ళి చూశారు. ప్రేలుళ్ళవలన ఆ గుహ పైభాగం విరిగి పడిపోయి, గుహ మూసుకుపోయి ఉంది. జీవాలతో బ్రతికి ఉన్నాయి దూరంగా ఉన్న కొన్ని గుర్రాలు మాత్రమే.

రాజా ఆ దృశ్యంవైపు చూశాడు కన్నార్పకుండా. అతనికెందుకో తన తల్లిని మానభంగం కావించిన వ్యక్తి అక్కడే వాళ్ళల్లో ఉండి చనిపోయాడనిపించింది.

ఇద్దరు వెనుదిరిగి బయలుదేరారు.

"నా ప్రాణం కాపాడినందుకు నీకెంతో ఋణపడి ఉన్నాను" కృతజ్ఞతగా అతనివంక చూస్తూ అన్నాడు రాజా. "అందరూ పారిపోయారుగదా! నువ్విక్కడికి ఎలా రాగల్గావు?"

"వాళ్ళు తుపాకీలు పేల్చగానే మేమంతా వెనుదిరిగి పారిపోయాము. కొంతదూరం పోయాక నేను ఆలోచించాను. మిమ్మల్ని ఒంటరిగా వదిలి మేము భీరువులవలె పారిపోయిరావటం పిరికితనం అన్పించింది. పైగా పల్లెలో ధైర్యసాహసాలుగల వాళ్ళమని ప్రగల్భాలు పలికి బయలుదేరాము. మేము వెళ్తే మాకెంత అవమానమో నేను ఆలోచించాను. ఏమయినాసరే మీతో పాటే అనుకున్నాను. నాతో ఎవరూ రావటానికి అంగీకరించలేదు. నేనొక్కణ్నే తిరిగివచ్చాను. అప్పుడే స్పృహతప్పి పడివున్న మిమ్మల్ని

గుర్రంమీద వేసి వెళ్ళబోతున్నారు. మిమ్మల్ని చంపివేశా రేమోనని కంగారుపడ్డాను. ఎందుకయినా మంచిదని వారిని అనుసరిస్తూ వచ్చాను. మిమ్మల్ని కాపాడగల్గాను.''

''నా ప్రాణం కాపాడిన నీకు కృతజ్ఞతగా ఏమివ్వాలో తెలియటం లేదు'' అన్నాడు రాజా. హఠాత్తుగా అతనికి తనకు రాయుడు చెప్పిన నిధి రహస్యం గుర్తుకొచ్చింది.

''రాయుడుగారి వంశస్థులు ఎవరైనా ఉన్నారా?'' అడిగాడు రాజా.

ఆ మాట వినటంతోనే ఆ యువకుడి వదనం మ్లానమయింది.

''రాయుడుగారు మా తాతగారే!'' అన్నాడు బరువుగా. రాజా ఆశ్చర్యపోయాడు. రాయుడుగారు తనకు చెప్పిన నిధిరహస్యం అతనికి చెప్పాడు.

ఇంతలో పల్లె సమీపించింది.

గ్రామస్థులంతా ఉత్సాహంతో గుమిగూడారు. ఇద్దరు అక్కడికి చేరారు. దోపిడీదొంగలముఠా రామసేన నాశనమైందని విని ప్రజలంతా సంతోషించారు. గ్రామపెద్ద రాజాను ఆ రోజు అక్కడే ఉండి పొమ్మన్నాడు. కాని రాజా అంగీకరించలేదు. తగిలిన గాయాలకు వైద్యుడి చేత వైద్యం చేయించి వెంటనే బయలుదేరాడు ఒంటరిగా. గ్రామ ప్రజలంతా వీడ్కోలు ఇచ్చారతనికి.

రాజా ఎక్కడా ఆగలేదు. తిన్నగా కొండలు దాటి వచ్చేశాడు. దూరంగా సీతానగరం కనిపిస్తూంది. పట్టలేని సంతోషంతో ఉన్నాడు రాజా. అతని హృదయం ఆనందంతో గంతులు వేస్తోంది. దానికి తగ్గట్టు గుర్రం కూడా

తన యజమాని ఆత్రతకు తగ్గట్టు మిక్కిలి వేగంగా పరుగెడుతూంది.

పూరిపాక బయట నిలబడి దూరంగా దుమ్ము రేపుకుంటూ వస్తున్న గుర్రాన్ని చూడగానే, చప్పున లోనికి జారుకుంది సుశీల. కొద్దిసేపటి తరువాత రాజా గుర్రం ఆపి, దిగాడు.

"సుశీలా!" అని అరిచాడు ఆనందంతో, ఇంటిముందు నిలబడి. సుశీల ఉలిక్కిపడింది. అది రాజా గొంతు. ఆమె హృదయం ఆనందంతో గంతులు వేసింది. కాని ఇదంతా ఒక్క క్షణమే. తన స్థితి జ్ఞాపకం వచ్చి ఒణికిపోయింది. తను మైలపడింది. రాజాకు తగదు.

ఇంతలో ఆత్రంగా తలుపు తెరుచుకొని లోనికి ప్రవేశించాడు రాజా. సుశీలని చూసి అదిరిపోయాడు.

ఆమెలో మునుపటి కళాకాంతులు లేవు. నలభై ఏళ్ళ ముసలిదానిలా అవుపిస్తోంది. వెక్కి వెక్కి ఏడుస్తోంది. చాలా నీరసంగా ఉంది.

"సుశీలా!" ఆమె దగ్గరకు చేరి, అక్కున చేర్చుకోబోయాడు రాజా. సుశీల వద్దని వారించింది. నిర్ఘాంతపోయాడు రాజా.

"రాజా! నువ్వు తిరిగొచ్చావు. అదే చాలు!" అంది ఏడుపు ఆపుకొని.

"సుశీలా! ఏమైంది? సీతారాం, లక్ష్మమ్మగారేరి? నిజం చెప్పు. ఏం జరిగింది?" ఉద్రేకంగా అడిగాడు రాజా.

సుశీల ఏడుపు ఆపుకోలేక పోయింది. వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆమెని వారించలేదు రాజా. కొద్ది సేపటికి తేరుకొని, పూర్తిగా చెప్పింది. రాజా అదిరిపోయాడు.

"అవును రాజా! జరిగిన విషయం ఇది. నన్ను ఆ ముష్కరులు బలాత్కరించారు. బలవంతంగా చెరిచారు. నా తల్లిదండ్రులను పొట్ట బెట్టుకున్నారు. నీ కోసమే ఇంత కాలం బ్రతికున్నాను. ఇక నేనేమయిపోయినా ఫరవా లేదు."

"లేదు సుశీల! నిన్ను ప్రేమించాను. నన్ను పెళ్ళాడ తానని మాటిచ్చావు. నీ కోరిక తీర్చాను. ఆ రామసేనను నాశనం చేశాను. నా కోరిక తీర్చు. నిన్ను పెళ్ళి చేసు కుంటాను" ఉద్రేకంగా అన్నాడు రాజా.

"లేదు రాజా! నాకిష్టం లేదు. ఈ మలిన దేహంతో నీ భార్యగా జీవించలేను. అంతేకాదు. నాకు ఏదో రోగం కూడా అంటుకుంది" అన్నది సుశీల.

"ఫరవాలేదు సుశీల. వైద్యం చేయిస్తాను పట్నం తీసు కెళ్ళి."

నవ్వింది బలహీనంగా సుశీల. "లాభంలేదు రాజా!" అంది.

ఇద్దరు అలానే కొద్దిసేపు కూర్చుండి పోయారు.

చివరకు సుశీలే అంది రాజాతో.

"రాజా! నామాట విని వెళ్ళిపో!"

ఉలిక్కిపడ్డాడు రాజా. "లేదు సుశీల! నిన్నొదిలి ఎక్కడికీ వెళ్ళను" అన్నాడు దృఢంగా రాజా.

"రాజా!" అరిచింది సుశీల.

ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు రాజా.

"ఇంతేనా! అప్పుడేదో ప్రగల్భాలు పలికావే? నీ తల్లిని చంపిన వ్యక్తిని మట్టుపెట్టి ఆమెకి ఆత్మశాంతి కలి గిస్తానని శపథం చేశావుగా? ఏమైంది? ఆ శపథం మర్చి పోయావా? నీకు కావలసిన వ్యక్తిని గుర్తు పట్టావా?"

పిచ్చిగా, ఉద్రేకంగా అరిచింది సుశీల. ఆమెకి తన తండ్రే హంతకుడని, ఆ రాక్షసుడని చెప్పాలనిపించలేదు. తనను రాజా వదిలెయ్యాలన్నదే ఆమె ధ్యేయం అయిపోయింది.

తన పగ గుర్తుకు రాగానే క్రోధంతో ఎగిరి పడ్డాడు రాజా.

"సుశీలా! ఆ రామసేనలో నా తల్లిని చంపిన రాక్షసుడు వుండివుంటాడు. అందరిని మట్టుపెట్టాను. నా పగ తీరి వుంటుంది" అన్నాడు.

"లేదు. నీ పగ తీర్చుకోలేక అలా అంటున్నావ్?" అంది సుశీల.

"సుశీలా!" రాజా కేకతో దద్దరిల్లింది పూరిగుడిసె.

సుశీల భయంతో రాజానే చూస్తుండిపోయింది.

"నేనంటే నీకిష్టంలేదని చెప్పు! అంతంత మాటలు దేనికి?" వ్యంగ్యంగా అన్నాడు రాజా. అదిరిపడింది సుశీల.

"లేదు రాజా! నిన్నెంతో ప్రేమిస్తున్నాను. కాని నేను మలినమై పోయాను" ఏడుస్తూ అంది. ఆమె ఏడుపు చూడగానే కోపం కరిగిపోయింది రాజాలో. అనునయించాడామెను.

ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

ఆ రాత్రి భోజనాలు ముగించి, పడుకున్నారు. తన వీరోచిత గాథలు చెప్పాడామెకు. అలసటగా వుండటం వలన గాఢమైన నిద్ర పట్టింది రాజాకు.

అర్ధరాత్రి తుపాకీ చప్పుడు విన్పించి ఉలిక్కిపడి లేచాడు రాజా. దీపం వత్తి వెలిగించాడు. సుశీల పడిపోయి వుంది. ఆమె కడుపునిండా రక్తం.

"సుశీలా!" గావుకేక వేశాడు రాజా. "ఎంత పని చేశావు?" బాధగా అన్నాడు.

నెమ్మదిగా కళ్ళు తెరిచింది సుశీల. "రాజా! నన్ను క్షమించు. నన్ను ఒదిలిపోలేదన్న కోపంతో ఏవేవో అన్నాను. నన్ను మరిచిపో. వచ్చే జన్మలో నీ భార్యగా పుట్టించమని భగవంతుణ్ని కోరుకుంటాను" అంది సుశీల కళ్ళు మూస్తూ.

—: ఐపోయింది :—

# బ్లాక్ మెయిలింగ్!

కంచర్ల రమణి

ఆయిదు అంతస్తుల ఉక్కు, సిమెంటు, గాజు పలకల ముద్ద, హోటల్ విశ్రాంతి ముందు ఆగింది టాక్సీ.

అందులోంచి హుందాగా, దర్జాగా బయట కడుగు పెట్టాడు వీరేష్.

తెల్లని యూనిఫాంలో ఉన్న సిక్కు దర్వాను చేసిన శాల్యూట్ నిర్లక్ష్యంగా అందుకుని, రిసెప్షన్ వద్దకు వెళ్ళాడు టకటక బూట్ల శబ్దం చేసుకుంటూ.

"నాకో గది కావాలి" అన్నాడు, అక్కడున్న రబ్బరు బొమ్మలాంటి లేడీ రసెప్షనిస్టుతో.

"సింగిల్ ఆర్ డబుల్" అందామె రాగాలు తీస్తున్నట్టుగా.

అంత అందమైన అమ్మాయిని ఎన్నిక చేసే ముందు, ఎన్ని వేలమంది అమ్మాయిల్ని ఇంటర్వ్యూ చేసుంటాడో హోటల్ యజమాన్యం?

ఆ అమ్మాయితో జోక్ చేసి ఆనందించాలనిపించింది వీరేష్ కి.

"ప్రస్తుతానికి సింగిల్, తరువాత డబుల్ కావాలని ఉంది, మీలాంటి అందాల బొమ్మ దొరికితే" అన్నాడు చిరునవ్వుతూ.

ఆమె గలగలా నవ్వేస్తూ "మీ గురించి కాదు నేనడిగేది. మీరు అడుగుతున్న గది గురించి అన్నాను," అందామె.

"దెన్ ఐ వాంట్ సింగిల్ రూం" చెప్పాడు వీరేష్.

"రూం నెంబరు సెవెన్ యిస్తున్నాను మీకు. చాలా అందంగా వుంటుంది. బాగా కంఫర్టబుల్ గా కూడా వుంటుంది" అని ఓ రిజిస్టరు బయటకు తీసి తెరుస్తూ "మీ పేరు చెప్పండి" అందామె.

"వి. వీరేష్."

"మీ రెక్కడనుంచి వస్తున్నారు? ఎన్నాళ్లుంటారు?"

"కలకత్తానుంచి. ఎ మన్త్ ఆర్ సో."

"వచ్చిన పని?"

వీరేష్ వెంటనే జవాబియ్యలేదు. క్షణం ఆలోచించి "వ్యాపారం" అన్నాడు.

"ఇక్కడ సంతకం చెయ్యండి దయచేసి" అందామె రిజిష్టరు అందిస్తూ.

సంతకం చేసి, రిజిస్టరు ఆమె ముందుకు తోసాడు.

"ఎనీ ఎడ్వాన్స్ ఐ షుడ్ పే" అన్నాడు, జేబులో చెయ్యిపెట్టి.

"తర్వాత యివ్వండి ఫరవాలేదు" అని జవాబిచ్చి, "బాయ్!" అని కేకేసింది.

యూనిఫాంమీద యెర్రని అక్షరాలతో హోటలు పేరున్న ఓ పనివాడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు క్షణంలో.

"దొరగారి సామాను రూం నెంబరు పదికి చేర్చు," ఆజ్ఞాపించిందామె.

అతడు తలూపి బయటకు వెళ్ళాడు.

రెండు నిముషాలుపోయాక, రెండు పెద్ద సూట్ కేసులు, ఒక ఎటాచీ పట్టుకుని లోనికి వచ్చాడు.

అతడి వెంటనే టాక్సీవాడు లోనికి వచ్చాడు.

వాడికి పది రూపాయల నోటు అందించి "చిల్లర ఇవ్వక్కర్లేదులే. వుంచుకో" అన్నాడు వీరేష్ ఠీవిగా.

సలామ్ చేసి టాక్సీవాడు వెళ్ళిపోయాడు.

సామాన్లతో మేడమెట్లు యెక్కుతున్న హోటల్ పనివాడ్ని అనుసరించాడు వీరేష్.

గదిలో సామాన్లు పెట్టి "టిఫిను, కాఫీ తెచ్చిపెట్టమంటారా?" అని అడిగాడు పనివాడు అతివినయంగా.

వాడి చేతిలో రెండు రూపాయల నోటువుంచి "వెంటనే యేమీ వద్దు. అరగంట పోయాక, ఏదో ఒక టిఫిను, కాఫీ పట్రా" చెప్పాడు వీరేష్.

పనివాడు వెళ్ళిపోయాక, సూట్ కేసులు విప్పాడు తనకు అవసరమయిన బట్టలు బయటకు తీసాడు.

లుంగీ కట్టుకుని, తువ్వాలు భుజాన్న వేసుకుని స్నానాల గదిలో దూరాడు.

అరగంటసేపు షవర్ క్రింద తృప్తిగా స్నానంచేసి, బయటకొచ్చాడు. మంచంమీదుంచి స్లీపింగ్ సూట్ తీసు

కని వేసుకుంటుండగా, తలుపుమీద టకటక శబ్దం విన వచ్చింది.

"కమిన్" అన్నాడు వీరేష్.

టిఫిన్, కాఫీ పాట్ వున్న ట్రేతో పనివాడు లోనికి వచ్చాడు.

"అక్కడుంచు" అని మంచందగ్గరున్న టీపాయ్ వీరేష్ చూపించగానే ట్రే అక్కడుంచి, పనివాడు వెళ్ళి పోయాడు.

పనివాడు మసాలాదోస టిఫిను తెచ్చాడు. తిని కాఫీ త్రాగితే, తృప్తిగానే వుందనిపించింది. కాని, ఎక్కడ లేని బడలిక తనకే వచ్చినట్లనిపించిందతడికి.

మంచంమీద అలాగే వాలిపోయాడు వెనక్కి. సిగ రెట్టు వెలిగించి, పీలుస్తూ, ఆలోచనల్లో పడిపోయాడు వీరేష్.

నిన్నటివరకూ తను కలకత్తాలో ఉన్నాడు. ఇవాళ విశాఖపట్నంలో! ఇరవై నాలుగు గంటల్లో ఎంత మార్పు తన జీవితంలో!

గత ఆరు నెల్లుగా తన వ్యాపారం మందకొడిగావుంది. పైగా, తనమీద పోలీసు నిఘా ఉధృతం అయ్యింది. తన చెయ్యాడ్డం మానేసింది.

తను చేస్తున్న జేబుదొంగతనాలు, బ్లాక్ మెయిలింగ్ నిలిచిపోక తప్పలేదు.

తన పరిస్థితి చూసిన స్నేహితుడు సాహా "కొన్నాళ్ళ పాటు మీ దేశం వెళ్ళగూడదూ. అక్కడ కూడా డబ్బు మస్తుగా ఉండి ఏంచెయ్యాలో తెలియక బాధపడుతున్న వాళ్ళున్నారు" అని సలహా ఇచ్చాడు.

బాగా ఆలోచించిన మీదట సాహా సలహా బాగానే వుందనిపించింది వీరేష్కు,

వెంటనే విశాఖపట్నంలో దిగాడు.

వీరేష్ తెలుగువాడే. ఇరవైయేళ్ళ వయస్సున్నప్పుడు ఓసారి కలకత్తా వెళ్ళాడు వీరేష్.

కలకత్తా నగరం తళుకు బెళుకులు అతన్ని బాగా ఆకర్షించాయి. అంతేగాదు! తను చేసే జేబుదొంగతనాలకు సారవంతమైన భూమి ఆ పట్నం అనుకున్నాడు.

అంతే! మరి కలకత్తాలో చాలా నేర్చుకొన్నాడు. ఈనాడు వీరేష్ బ్లాక్ మెయిలింగ్ లో, జేబుదొంగతనాల్లో స్మగ్లింగులో ఇంతగా ఆరితేరాడంటే అదంతా కలకత్తా ప్రసాదించిందే!

తనను పెంచి, పెద్దచేసిన కలకత్తా నగరం విడిచివచ్చినందుకు చెప్పలేని విచారం కలిగింది వీరేష్ కు.

మంచంమీంచి మెల్లగా లేచాడు. కిటికీవద్దకు కదిలాడు.

ఎండ బాగా తగ్గింది. చల్లని గాలి వీస్తోంది ఆహ్లాదంగా. కిటికీలోంచి పట్నంలోకి ఎత్తైన భవనాలు అవుపిస్తున్నాయి.

పదిహేనేళ్ళ పూర్వానికీ, ఇప్పటికీ, విశాఖపట్నంలో యెంత మార్పు!

పట్నం విస్తారంగా పెరిగిపోయింది.

డబ్బున్నవాళ్ళు అక్కడ బాగా పోగయేరనడానికి, నగరంలో వెలిసిన ఫైవ్ స్టార్ హోటల్సూ, పది గజాలకొక బారూ, పాతిక పైగా సినిమా హాల్సే నిదర్శనం.

తన వృత్తికి ఎంతో అనువైన ప్రదేశం అది అనుకున్నాడు వీరేష్.

కాని అంతలోనే, చెప్పలేని దిగులు ఆవరించింది అతని మనస్సులో.

జేబులు కొడ్తుండగా, రెండు మూడుసార్లు దొరికి

పోయాడు ముదట కలకత్తా పోలీసులకు.

ఆ రెండుసార్లు తన ఆదాయం పోవడమే గాకుండా, పోలీసుల్ని వదిలించుకోవడానికి, తిరిగీ తనది కొంత సమర్పించుకోవాల్సి వచ్చింది వాళ్ళకు.

ఆ తరువాత తను పోలీసులకు పట్టుబడలేదు. అతి జాగ్రత్తగా మసులుకుంటూ వచ్చాడు.

అయితే ప్రతిసారీ, తను డ్యూటీలో ఉండగా, అలాటి భయాందోళనలే కుదిపేస్తూ ఉంటాయి గుండెల్ని.

ఇప్పటికీ, ఆ భయం వదల్లేదు తనను!

ప్రతిక్షణం, ఇలా భయంతో కాపురం చెయ్యడమేనా తన జీవితం?

మిగతా వారిలాగు తనుకూడా ప్రశాంత జీవనం గడిపేదెప్పుడు?

కలకత్తాలో తన వ్యాపారం సవ్యంగా సాగలేదనగానే, విశాఖపట్నం పరుగెత్తుకొచ్చాడు. ఇప్పుడు విశాఖపట్నంలో చెడితే, ఇంకో వూరు పారిపోవడమేనా?

పరిచయంలేని వూరిలో తను వ్యాపారం చెయ్యడంలో, చాలా సాధక బాధకాలున్నాయి.

పోలీసులు హఠాత్తుగా మీదబడితే, సందులు, గొందుల్లోంచి పారిపోయి తప్పించుకోవాలంటే, వూరియొక్క తీరుతెన్నులు తెలియాలి. తాత్కాలికంగానయినా పోలీసుల్ని యేమార్చాలంటే, కొందరు స్నేహితులుండాలి వాళ్ళ ఇళ్ళల్లో తల దాచుకోడానికి. నేరస్తుల్ని పట్టెయ్యడానికి పోలీసు డిపార్టుమెంటు వేసే కొత్త కొత్త ఎత్తుల గురించి తనకు తెలియచెప్పి, హుషారివ్వడానికి, ఒకరిద్దరయినా తనకు తెలిసిన పోలీసులు ఉండాలి.

వయస్సు మీదబడుతోంది. మెదడు చురుకుదనం తగ్గు

తోంది. క్షణక్షణం గండాలు ఎదురయ్యే తన వృత్తిలో, ఊళ్ళు మార్చడం మంచిదికాదు.

ఈ వృత్తిలోంచి త్వరలో రిటైరు కావాలి. అయితే ముందుగా, దుర్భేద్యమైన పెద్ద పథకంవేసి, లక్షలకు అధిపతి కావాలి.

ఆ తరువాత ఏదో వ్యాపారం ఆరంభించి, నిశ్చింతగా బ్రతకాలి.

తనకూ ఓ భార్య, దానివల్ల పిల్లలు కలిగి, కలకలలాడే సంసారం కావాలి.

కిటికీవద్దనుంచి మెల్లగా మంచంవద్దకు వచ్చి దానిమీద వాలిపోయాడు, గాఢంగా నిట్టూర్చుతూ.

మరుక్షణంలో, గాఢనిద్ర అతడ్ని వరించింది.

## 2

వెన్ రంగు కళ్ళద్దాల్లోంచి బస్సులోకి క్రిక్కిరిసిన జనం వైపు ఓసారి చూపు సారించాడు వీరేష్.

ముందునుంచి క్లీనరు వెనుకనుంచి చెక్కరు జనాన్ని లోనికి యెక్కించడమే గాకుండా, క్లీనరు లోనికి వచ్చి, జనాన్ని మూడు వరుసలుగా సర్దాడు.

బస్సు ఇప్పుడు కుదించిన బస్తాలా వుంది.

బస్సు బయలుదేరింది భారంగా.

వీరేష్ విశాఖపట్నం వచ్చి మూడు నెలలు కావస్తోంది. హోటలు విశ్రాంతిలోంచి మకాం మార్చేశాడు. ఇప్పుడు హోటలు ఊటీలో గది తీసుకుని ఉంటున్నాడు.

వ్యాపారం నిమిత్తం విశాఖపట్నం వచ్చినట్లు హోటలు రికార్డులో రాయడమే గాకుండా, కుతూహలంకొద్దీ అడిగిన వాళ్ళకు కూడా అమాటే చెప్పాడు.

ఊరి తాలూకు తీరు తెన్నులు, జనంయొక్క ప్రవర్తన,

ప్రవృత్తులు అధ్యయనం చెయ్యడంలో గడిపాడు యీ మూడు నెల్లూ. అంతేగాదు! లక్షలు కురిపించే ఓ బ్లాక్ మెయిలింగ్ పథకం తయ్యారుచేసి ఉంచాడు.

అయితే, ఆ పథకం అమలు జరపడానికి తనకు కొంత సాయం కావాలి.

విశాఖపట్నం 'అండర్ వరల్డ్'లోని మనుషులతో పరిచయం చేసుకోవాలని తెగ ప్రయత్నించాడు. కాని సఫలుడు కాలేకపోతున్నాడు.

బస్సులోని జనం మొహాల్లోకి నిశితంగా చూడసాగాడు వీరేష్.

ఇరవై యేళ్ళనాటి ఆంధ్రదేశానికీ, ఇప్పటికీ, మనుషుల మనస్తత్వం విషయంలో పెద్ద తేడా ఉన్నట్టు అనిపించడం లేదు వీరేష్‌కు.

మంచిగా అవుపించడమే తమ జీవిత ధ్యేయమన్నట్టు, వాళ్ళ మొహాల్లో అమాయకత్వం, నిర్మలత్వం, బోళాతనం కొట్టవచ్చినట్టు అవుపిస్తున్నాయి.

వీరేష్ అలా జనాన్ని పరిశీలిస్తున్న సమయంలో ఓ జత కళ్ళు వచ్చి, అతనిమీద వాలాయి. వాటిని మరుక్షణం లోనే పట్టేసాడు వీరేష్.

వీరేష్ కళ్ళు ఆ వ్యక్తివైపు తిరగ్గానే, ఆ వ్యక్తి వేరే దిక్కుకు చూడసాగాడు.

ఆ వ్యక్తి తనవైపు ఎందుకలా చూశాడు? వీరేష్ మనస్సులో ప్రశ్న ఉదయించింది.

వీరేష్ అతి మామ్మూలుగా అవుపిస్తూ, ఆ వ్యక్తిని కనిపెట్టసాగాడు.

ఆ వ్యక్తికి మహా ఉంటే ఇరవై అయిదేళ్ళుంటాయి. చాలా సాధారణంగా ఉన్నాడు. కాని, తెలివితేటల్ని

సూచిస్తూ కళ్ళు చురుగ్గా కదులుతున్నాయి. గీతలచొక్కా, దుబ్బు జుట్టు, కోలమొహం, సిగరెట్లు అతిగా కాల్చడం వల్ల కాబోలు పెదవులు నల్లగా ఉన్నాయి.

బస్సాగింది ఓ స్టాపువద్ద. ఇద్దరు, ముగ్గురు ప్రయాణీకులు దిగారు.

ఆ వ్యక్తికి కాస్త దగ్గరగా జరిగాడు వీరేష్.

ఆ వ్యక్తికి కాస్త ముందు నిల్చున్న ఆసామి పాంటు జేబు బాగా ఎత్తుగా ఉంది.

వీరేష్ కనిపెడుతున్న వ్యక్తి చేతులు మెల్లగా, అతి సహజంగా, ఆ ఆసామి పాంటుజేబువద్దకు కదిలాయి.

పాకెట్టు ఎత్తుగా ఉన్న వ్యక్తికి ఏమాత్రం అను మానం కలగకుండా, ఆ వ్యక్తి అతని జేబు ఖాళీచేసేసాడు.

అతి నేర్పుగా పర్సుని, ఇన్ షర్టుచేసిన చొక్కాలో పడేసుకున్నాడు.

తరువాతి స్టాపు రాగానే, హడావుడిగా బస్సుదిగి పోయాడు.

దిగుతున్న అతన్ని చూడగానే, చక్కని ఆలోచన వచ్చింది వీరేష్ మస్తిష్కంలోకి.

క్షణం ఆలస్యం చెయ్యకుండా వీరేష్ కూడా బస్సు దిగాడు.

ఆ వ్యక్తి తొందరగా అడుగులేసుకుంటూ, అర్జంటు పనిమీదున్న వాడిలా నడవసాగాడు.

వీరేష్ అతన్ని అనుసరించాడు.

నాలుగడుగులు వెయ్యగానే, వీరేష్, అతనితో సమా నంగా నడవసాగాడు.

"మిస్టర్! నీ పేరేమిటి?" అడిగాడు వీరేష్ ఆ వ్యక్తిని.

ఆ వ్యక్తి జవాబియ్యలేదు. తనను కాదన్నట్టుగా నడవ

సాగాడు తలవంచుకుని.

"నిన్నే మిస్టర్! నీ పేరేమిటి?" అన్నాడు మళ్ళీ వీరేష్.

అప్పటికీ ఆ వ్యక్తి మాట్లాడలేదు.

"పోలీసుల్ని పిలిచి నువ్వు కొట్టేసిన పర్సు గురించి చెప్పమంటావా? లేక మాట్లాడతావా?"

"నా పేరు జగ్గారావు. అయినా నాతో మీకేం పని?" చప్పున అన్నాడు ఆ వ్యక్తి.

"ఉన్నపళంగా నేను చెప్పిన చోటుకు పద. నీతో కొన్ని సంగతులు మాట్లాడాలి. లేదా పోలీసులకి అప్పగిస్తాను" అన్నాడు వీరేష్, సీరియస్‌నెస్ అంతా తన మొహంలో కన్పరుస్తూ.

ఆ వ్యక్తి రోడ్డుకు రెండువైపులా చూసాడు ఒక్క క్షణం. కాళ్ళకు రెక్కలు మొలిచినట్టుగా ఒక్కసారిగా పరిగెత్తబోయాడు.

కాని, అప్పటికే, అతని ఆలోచనలు చదివేసి క్షుణ్ణంగా అర్థం చేసుకున్నట్టు, వీరేష్ ఒక్క ఎగురు ఎగిరి, అతని కాళ్ళ కడ్డంగా తన కుడికాలు విసిరాడు.

జగ్గారావు బోర్ల బొక్కలా పడ్డాడు రోడ్డు మీద. చేతులు ఆనించి కాసుకోకుండా ఉండివుంటే, అతడి మూతి పగిలివుండేదే!

"మిస్టర్ జగ్గారావ్! మరీ నడి రోడ్డుమీద నాకు సాష్టాంగపడకు. నాకు అదోలాగుంది" అంటూ జగ్గారావు చొక్కా పుచ్చుకుని లేవదీసి "ఇప్పటికయినా, నాతో రావడానికి సిద్ధంగా వున్నావా, లేదా?" అన్నాడు వీరేష్.

తను వీరేష్ చేతిలో చిక్కుకున్నాడు. పారిపోవడానికి

అవకాశం లేదని గ్రహించినట్టున్నాడు. "సరే పదండి," అన్నాడు జగ్గారావు.

అతడి చొక్కా వదిలేసాడు వీరేష్. అయినా, అతడు తనతోపాటుగ వస్తున్నాడా లేదా అని ఓ కంట కని పెడ్తూనే వున్నాడు.

జగ్గారావుని తీసుకుని, హోటల్ రూములో తన గదికి బయలుదేరాడు వీరేష్.

# 3

"అలా ఆ కుర్చీలో కూచో జగ్గారావ్!" అన్నాడు వీరేష్ తను ఓ కుర్చీలో కూచుని, ఎదురుగా ఉన్న కుర్చీ జగ్గారావుకు చూపిస్తూ.

జగ్గారావు కూచోడానికి సందేహించాడు. నిలబడి వుండిపోయాడు.

"కూచో భయపడక! నిన్ను పోలీసులకు పట్టివ్వనులే. అలాగే నువ్వు కొట్టేసిన దాంట్లోంచి నాకేమీ వాటా వద్దులే" వీరేష్ అలా ధైర్యం చెప్పేసరికి, జగ్గారావు కూర్చున్నాడు కుర్చీలో.

ఇందాక అతడి మొహంలో అగపడిన ఆరాటం మాయ మైంది ఇప్పుడు.

"నువ్వు రోజుకు ఏమాత్రం సంపాయిస్తావ్?" అడిగాడు వీరేష్, జగ్గారావును పరీక్షగా చూస్తూ.

వెంటనే మాట్లాడలేదు జగ్గారావు. ఆలోచిస్తున్నట్టు ఉండిపోయాడు.

"చెప్పు! నాతో మాట్లాడ్డంవల్ల నీకు లాభమేగాని నష్టంలేదు" స్నేహంగా అన్నాడు వీరేష్.

క్షణంసేపు వీరేష్ కళ్ళల్లో ఏదో వెతికి, తృప్తిపడ్డాక, జగ్గారావు చెప్పాడు.

"పదీ పాతిక. అదృష్టం ఎప్పుడూ ఒక్కలాగుండదు. దీంట్లో కొంత పోలీసుల మామ్మూళ్ళక్రింద పోతుంది."

"మామ్మూలు ఎంత?"

"రూపాయికి పావలా."

"ఎందుకివ్వాలి?"

"పట్టుకుంటే వదిలెయ్యడానికి."

"పట్టుకున్నాక వదిలెయ్యకపోతే?"

"అంతే! శిక్ష భరించడమే."

"అలాంటప్పుడు, ఇవ్వకుండా వుండడం మంచిదిగదా."

"మంచిదే కాని ఇక్కడి ఆనవాయితీ ఇది."

"ఆ సంగతలావుంచు. నీలాంటి వాళ్ళను కొంతమందిని నాకు పరిచయం చెయ్యి. అంతకన్నా ఎక్కువ ఆదాయం వచ్చేలా చేస్తాను."

"ఎందుకు. ఏంచేద్దామని?"

చిన్నగా నవ్వి, ఆ తరువాత అన్నాడు వీరేష్.

"అయిదూ. పదీ దొంగతనాలతో మన దరిద్రం తీరే దెప్పుడు? కొడితే ఏనుగు కుంభస్థలమే కొట్టాలంటారు."

"అంటే...నువ్వో ఓ దొంగ వేనన్నమాట?" ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి, వీరేష్‌ను ఎగాదిగా చూసి అన్నాడు జగ్గారావు.

"దొంగ నేకాను. బ్లాక్ మెయిలర్‌నుకూడా. అయితే కాస్త ఘరానాపద్దు" అన్నాడు వీరేష్, తన పైమీద చెయ్యివేసి దర్జాగా సవరించుకుంటూ.

"అయితే, ఎక్కడనుంచి రాక?"

చెప్పాడు వీరేష్.

"అయితే, ఏమిటి నీ ప్లాను?"

"మనమో బంగారు బాతును పట్టాలి. దాని చేత గుడ్లు

పెట్టించాలి రోజూ."

"అంటే, ఓ లక్షాధికారిని మనం బ్లాక్ మెయిల్ చెయ్యబోతున్నాం. అవునా?"

"అవును."

"ఎవరావ్యక్తి?"

"ఆ వ్యక్తి యెవరో తెలిసి, పథకం తయారైవుంటే, నీలాంటి వాళ్ళ సాయం కావాలని ఎందుకంటాను."

"అంటే ముందు ఊర్లోవున్న బంగారు బాతుల లిస్టు, వారి పూర్తి వివరాలు కావాలన్నమాట."

"బావుంది. తెలుసుకున్నావు నాకేం అవుసరమో."

"అయితే, నీకు సాయంచేస్తున్నందుకు, మాకు లాభం యేమిటి?"

వీరేష్ వెంటనే బదులివ్వలేదు. ఆలోచిస్తూ వుండి పోయాడు.

జగ్గారావు అన్నాడు, రెండు నిముషాలు పోయాక.

"నాకు తెలిసిన వాళ్ళందర్నీ తీసుకొస్తాను. వాళ్ళు ఇదే ప్రశ్న వేస్తారు నిన్ను- ఇక్కడికి వచ్చాక. నాకు చెప్పకపోయినా, వాళ్ళకు చెప్పక తప్పదు. ఇంకో విషయం. వాళ్ళకు నీ ప్లానువల్ల ఏ ప్రమాదమూ లేదన్న గ్యారంటీ అవుపించాలి."

"అలాగే! వాళ్ళనుకూడా రానీ. మన వాటాల గురించి అందరితో ఒక్కసారే చెప్తాను."

"సరే!...అయితే వాళ్ళను ఎప్పుడు తీసుకురమ్మంటావ్?...తిన్నగా ఇక్కడికే తీసుకొచ్చేదా?"

"చూడు జగ్గారావ్! నాకు కావాల్సింది మెరికల్లాంటి పదిమంది కుర్రాళ్ళు, చెప్పినపని చకచక చేసుకుపోయే వాళ్ళు కావాలి. పరిసితులు ఎదురుతిరిగితే, గాభరాపడ

కుండా, సమయస్ఫూర్తితో తప్పించుకునవచ్చే రకంవాళ్ళు కావాలి. అంతేగాని, మన రహస్యాలు భయపడి బయట పెట్టేవాళ్ళుకాదు."

"అలాగే! అర్థమైంది. అయితే, ఎప్పుడు, ఎక్కడ వాళ్ళను సమావేశ పర్చమంటావ్?"

"ఇవాళ శుక్రవారం. వచ్చే శుక్రవారం జగదాంబలో "గైడ్" సినిమా ఆడుతుంది. ఇప్పటికే అది కనీసం పది సార్లయినా ఆడింది ఊళ్ళో. హాలులో జనం వుండరు. మనవాళ్ళందరికీ నాలుగు రూపాయల టిక్కెట్లు తీసు కుంటాను. హాల్లోకి తీసుకురా వాళ్ళందర్నీ."

"అలాగే" అంటూ జగ్గారావు వీరేష్‌వద్ద శెలవు తీసు కుని వెళ్ళిపోయాడు.

# 4

సాయంకాలం ఆరున్నరయింది. వీరేష్ జగదాంబ సినిమా హాలు వద్దకు చేరుకున్నాడు.

అంతకుముందే అక్కడ చేరుకొన్న జగ్గారావు, అతని స్నేహితబృందాన్ని చూసి చిరునవ్వు నవ్వాడు.

'అతడే మన బాస్' అన్నట్టుగా కనుబొమ ఎగరేసి అస్పష్టంగా గొణిగాడు ఏదో తనవారితో జగ్గారావు.

వీరేష్ తిన్నగా నాలుగు రూపాయల కౌంటరువద్దకు వెళ్ళాడు.

జేబులోంచి డబ్బు పైటికి తీస్తూ "ఎన్ని టిక్కెట్లు తెగాయండి ఇంతవరకూ?" అని అడిగాడు కౌంటరువద్ద వున్న వ్యక్తిని.

"ఇంకా ఒక్కటిగూడా తెగలేదండి" చెప్పాడా వ్యక్తి.

"వెరీగుడ్!" అని వెనక్కి తిరిగి "మొత్తం మనం ఎంత

మందిరా?" అన్నాడు జగ్గారావుతో.

"మీతో కలిపి పన్నెండు మంది మండి" చెప్పాడు జగ్గారావు.

నలభై యెనిమిది రూపాయలిచ్చి పన్నెండు టిక్కెట్లు తీసుకుని వీరేష్ ముందు నడవగా, అతన్ని అనుసరించారు జగ్గారావు, అతను తెచ్చిన బృందం.

హాల్లో లైట్లు ఆరిపోయాయి. ట్రెయిలర్ మొదలయింది.

ఒక సీట్లో కూచుంటూ "జగ్గారావ్! మీవాళ్ళను పరిచయం చెయ్" అన్నాడు వీరేష్.

"వీడు ముత్యాలు. పెద్ద జేబు దొంగ. ఒక్కసారంటే ఒక్కసారి పోలీసులకు చిక్కలేదు. వీడ్ని పరుగెత్తి పట్టుకోవడం కష్టం. లేడిపిల్లలా పరుగెత్తగలడు.

"వీడు సత్యం. ఇంటిదొంగతనాల్లో నేర్పరి. అనుకున్నాడంటే రిజర్వు బేంకులో దూరి డబ్బు దోచెయ్యగలడు. పోలీసులకు వీడిమీద గట్టి అనుమానాలున్నాయిగాని, నిరూపించలేక, చేసేదిలేక ఊరుకున్నారు.

"వీడు అప్పారావు. వీడి వృత్తికూడా దొంగతనమే. వీడికి కారు మెకానిజం కూడా తెలుసు. ఎంత కండిషనులో వున్న కారునైనా ఏదో చేసి పనిచెయ్యకుండా చెయ్యగలడు తాత్కాలికంగా. ఏంచెయ్యాలో తోచక, కారు యజమాని గాభరాపడుతుంటే, సాయం వెళ్ళి కారు బాగుచేసి, అతడ్నించి డబ్బులు గుంజగలడు.

"వీడు నూకరాజు. కొట్లాటల్లో దిట్ట. ఇటు తెలివి అటు జబ్బ పుష్టి వున్నవాడేమో, ఎలాంటి రౌడీ మూకమీద బడినా నెగ్గుకు రాగలడు. అయితే రక్తం కళ్ళ జూసేడంటే, బేజారెత్తి పోతాడు.

"వీడు చిట్టిబ్బాయి. వీడూ చెయ్యి సాపున్న జేబు దొంగ.

“వీడు పాపారావు. రవ్వంత అనుమానం కలగనీకుండా, ఆడవాళ్ళ మెళ్ళో వున్న నగలు కాజెయ్యగలడు.

“వీడు సీతారాం. సైకిళ్ళు కొట్టేసి డబ్బులు గుంజుకోవడంలో మేటి.

“వీడు సింహాచలం. దొడ్లలో ఆరబెట్టినవి, గదుల్లో దండాలమీద, చిలక్కొయ్యలమీద వేలాడుతున్న బట్టల్ని అతినేర్పుగా కొట్టెయ్యగలడు.

“వీడు వెంకట్రావు. దుకాణాల్లో సరుకులు ఎత్తుకుపోవడంలో గొప్ప చాకచక్యం గలవాడు.

“వీడు బుచ్చిబాబు. గొంతుక మార్చి మాట్లాడడంలో గొప్పవాడు. ఇళ్ళల్లో దొంగతనం చేస్తున్నప్పుడు చప్పుడై ఇళ్ళవాళ్ళు లేచి రాబోతే, పిల్లిలాగో, కుక్కలాగో అరిచి ప్రమాదంనించి తప్పించుకుంటాడు” అంటూ తనతో వచ్చినవాళ్ళందర్నీ పరిచయం చేశాడు జగ్గారావు.

“కూర్చోండి నావైపు తిరిగి” అని వీరేష్ అనగానే, అందరూ కూచున్నారు, అతను చెప్పినట్టుగా.

“మీరు నాతో చెప్పినవన్నీ స్వయంగా మీనోట వినాలని అనుకుంటున్నారు మా వాళ్ళు. చెప్పండి” అన్నాడు జగ్గారావు.

వీరేష్ ఆరంభించాడు.

“బ్లాక్ మెయిలింగ్‌లో వున్న గొప్పతనమేమంటే, దానివల్ల రక్తపాతం, ప్రాణనష్టం వగైరా పోలీసుల్ని మన మీదకు వుసికొల్పే ఇబ్బందులు రావు వెంటనే.

“పొదుగునిండా పాలున్న ఆవునే పిదికినట్టు, మనం డబ్బున్న వాడినే పడతాం. వాడి రహస్యాలను బయట పెడతామని, వాడి పరువుదీసి పారేస్తామని బెదిరిస్తాం.

“తనకున్న కొండంత సంపదలో కాస్తంత పోతేనేం

కానీ తక్కువైతే వాడిపేరు నాకు ఇవ్వద్దు. మీరు ఎన్నిక చేసిన పేర్లలో కొంతమందిని ఏరతాను. ఆ తరువాత వాళ్ళి ఎలా బ్లాక్ మెయిలింగ్ లో ఇరికించాలో పథకం వేద్దాం'' చెప్పాడు వీరేష్.

''అంటే, ఇదంతా వూళ్లోని పెద్ద తలకాయలతో వ్యవహారమన్న మాట?'' అడిగాడు సీతారాం.

''అవును'' అన్నాడు వీరేష్.

''అయితే నాకిష్టంలేదు. నేను వెళ్ళిపోతాను''లేచాడు సీతారాం.

''నేనూ నీతోటే'' అంటూ సింహాచలం కూడా లేచాడు.

''ఆగ్రా! మంచి డబ్బొచ్చే వ్యవహారం చెడగొట్టుకోకర్రా'' సీతారాం, సింహాచలాన్ని ఆపడానికి ప్రయత్నించాడు జగ్గారావు.

''జగ్గారావ్! వాళ్ళను ఆపకు. ఇష్టంలేని వాళ్ళతో పని సవ్యంగా సాగదు'' అని వీరేష్ అనగానే, జగ్గారావు వాళ్ళను ఆపే ప్రయత్నం విరమించుకున్నాడు.

సీతారాం, సింహాచలం బయటకు వెళ్ళి పోయారు. మరి కాస్సేపయ్యాక, అప్పారావు, బుచ్చిబాబు కూడా వెళ్ళిపోయారు; తామూ పని చెయ్యలేమని చెప్పేస్తూ.

''మీలో ఇంకెవరైనా వెళ్ళిపోవాలని అనుకుంటున్నారా?...అయిదు నిముషాలు టైమిస్తున్నాను. ఓ నిర్ణయానికి రండి'' అని చెప్పి మవునం వహించాడు వీరేష్.

అందరూ తమతమ ఆలోచనల్లో మునిగిపోయారు. పది నిముషాలు గడిచినా, మిగిలిన వారిలో ఒక్కరూ వెళ్ళిపోవాలని లేవలేదు.

''అంటే, మీరందరూ నాతో కలసి పనిచెయ్యడానికి

అనుకుని మనం కోరింది పారేస్తాడు. అదే మనకు కావల్సింది.

"ఎవడో పేదవాడ్ని బాధ పెడుతున్నామేమో, వాడి వుసురు మనకు తగులుతుందేమో అన్న బెంగ అక్కరలేదు.

"దొంగలెక్కలు రాసి, పన్నులు యెగ్గొట్టి, కూడబెట్టిన నల్లధనం 'యెలా వచ్చిందో అలాగే పోయిందిలే' అని సరిబుచ్చుకుంటాడు.

"మనం బ్లాక్ మెయిల్ చేస్తున్న వ్యక్తి మనల్ని పోలీసులకు అప్పగిస్తాడేమోనన్న అనుమానం కలగవచ్చు. కాని, వాడి రహస్యం మనచేతిలో వున్నంతకాలం, మనం పట్టుబడి, మనవల్ల వాడి రహస్యం లోకానికి వెల్లడవుతుందని భయం."

వీరేష్ ఆగాడు ఒక్కక్షణం, ఊపిరి తీసుకోవడానికి.

"అంతవరకూ బాగానే వుంది. కాని, మనం బ్లాక్ మెయిల్ చేస్తున్న వ్యక్తులకు కోపం వచ్చి, మనల్ని అంతం చెయ్యడానికి వాళ్ళు కిరాయిమనుషుల్ని మనమీద వుసిగొల్పితేనో?" అన్నాడు చిట్టిబ్బాయి. అతడికి వంత పలికారు, ముత్యాలు, అప్పారావు.

"మనం అలాంటి ప్రమాదం లేని వ్యక్తినే ఎన్నుకొందాం. రౌడీ గేంగునో, ఖూనీకోర్ల ముఠానో పోషిస్తూ తనవెంట త్రిప్పుకుని తిరిగే వాళ్ళ వూసుకుపోము" చెప్పాడు వీరేష్.

"అయితే మీ ప్లానేమిటో చెప్పండి. ఆ తరువాత మిగతా విషయాలు మాట్లాడుకుందాం" అన్నాడు నూకరాజు.

"ముందుగా మీరందరూ వెళ్ళి ఊళ్లోని ధనవంతుల గురించి భోగట్టా సేకరించి తీసుకురండి. ఏఖై లక్షల ఆస్తికి

సిద్ధంగా వున్నారన్న మాట'' అన్నాడు వీరేష్.

''అవును! సిద్ధంగా వున్నాం'' అన్నారు మిగిలిన ఏడుగురూ.

''మన పథకం పూర్తయే వరకూ, ఎవరూ బయటకు దాటెయ్యకూడదు.''

వీరేష్ మాటలకు తమ అంగీకారం తెలుపుతూ అందరూ తలలూపారు.

''అయితే నాకో గ్యారంటీ కావాలి.''

''ఏమిటది?'' అడిగాడు జగ్గారావు.

''ఇదిగో టేప్ రికార్డరు. 'వీరేష్ చెప్పిన పథకంలో నా అంతట నేను ఇష్టపడి చేరాను గాని బలవంతం లేదు' అని మీరందరూ మూడుసార్లు అంటే రికార్డు చేసి వుంచుకుంటాను'' అన్నాడు వీరేష్.

కాసేపు ఏం మాట్లాడాలో యెవ్వరికీ తోచలేదు. ఆలోచిస్తూ వుండిపోయారు.

టేప్ రికార్డరులూ వగైరా యేమిటో తెలియని నాటు రకం జేబుదొంగలు వీళ్ళంతా. తనను అంటిపెట్టుకుని వాళ్ళను వుంచుకోవాలంటే, వాళ్ళ మనస్సుల్లో యేదో భయం పెట్టాలి.

వీరేష్ జాగ్రత్తగా ఆలోచించి చేసిన ట్రిక్కు అది.

''ఒరేయ్! ఎందుకురా సందేహం? అతగాడి పేరు గూడా వుందిగదరా అందులో. రేప్పొద్దున్న ఆ టేపు పోలీసులకిస్తే అతనికి కూడా ప్రమాదమే'' అన్నాడు సత్యం.

దాంతో, వీరేష్ చెప్పినట్టుగా రికార్డింగుకు అంగీకరించారు అందరూ.

వారందరి వద్దనుంచి టేపురికార్డింగు తీసుకున్నాడు

వీరేష్ ముదట చెప్పినట్టుగా.

"మీరు అడగకపోయినా, నా అంతట నేను చెప్తున్నాను వినండి. ప్లాను వేసినందుకు నాకు సగం, మిగతా సగం మీకు. మొత్తంలో సగం తీసుకొన్నందుకు, ప్లాను నిర్వహించడానికి అయ్యే ఖర్చులన్నీ నావే. న్యాయంగానే వుందా?" అన్నాడు వీరేష్.

అందరూ తలలూపారు అవునన్నట్టుగా.

"మనం విడిపోయే ముందు ఒక్క విషయం చెప్తున్నాను. జాగ్రత్తగా వినండి. ధనవంతుల గురించి సమాచారం యెంత వేగిరం సేకరించి తెస్తే అంత మంచిది. అంతే కాదు. సేకరించిన ఫోటోలు చాలా కరక్టుగా నాకు ఎప్పటికప్పుడు హోటల్ ఊటీలో నా గదికి తెచ్చి అందించాలి" అంటూ లేచాడు వీరేష్.

అతని వెంటే అందరూ లేచి బయటకు కదిలారు.

## 5

హోటల్లో టిఫిను తిని బయటకు వస్తుంటే, ఆమె కనిపించింది, రోడ్డుమీద పోతూ.

ఈ మధ్య ఆమెను తరచుగా చూస్తున్నాడు వీరేష్.

అతడిలో వాంఛ బుసకొట్టింది. ఆమెతో ఎలాగయినా పరిచయం యేర్పరుచుకుని, ఆమెను పొంది తీరాలన్న కాంక్ష దృఢమైంది.

వీరేష్ ఆమెను అనుసరించాడు.

ఆమె నల్లగా ఉన్నా, బలిష్టమయిన అవయవాలతో అతని మగతనాన్ని రెచ్చగొడ్తోంది.

కలకత్తాలో ఉండగా వీరేష్ చాలామంది అమ్మాయిల్ని అనుభవించాడు.

అయితే, ఆమెలా అతన్ని నిలువునా కరిగించి పారేసిన

స్త్రీ ఒక్కరూ లేరు.

ఆమె మెయిన్ రోడ్డు దాటి, పూల మార్కెట్టులో ప్రవేశించింది. ఆమె వెనకాలే వీరేష్‌కూడా మార్కెట్టు లోకి వెళ్ళాడు.

మార్కెట్టు జనంతో కిటకిటలాడుతోంది.

ఆమె ఒకచోట బంగళాదుంపలు, ఇంకోచోట ఉల్లిపాయలు, ఇంకోచోట మిరపకాయలు కొని చేతిలోని సంచీ నింపుకుంది.

తనుకూడా సరుకు కొనపోయినవాడిలా, ఆమె వెళ్ళిన ప్రతి దుకాణంవద్దకు వీరేష్ వెళ్ళాడు.

ఆమె అతన్ని రెండుసార్లు పరీక్షగా చూసింది, వరుసగా తను వెళ్ళిన రెండు దుకాణాలవద్ద, అతడుకూడా కనిపించేసరికి.

మూడో దుకాణంవద్ద అతడు కనిపించేసరికి, ఆమె అర్థవంతంగా నవ్వింది, వాలుచూపులు విసిరి.

ఆమె దృష్టిని ఎలాగయితేనేం చివరకు ఆకర్షించి నందుకు, పొంగిపోయాడు వీరేష్.

ఆమె వెనకాలే వెళ్ళసాగాడు.

ఆమె పళ్ళ దుకాణాలవైపు నడిచింది. పళ్ళ దుకాణాల మధ్య మనుషులు పోవడానికి దారి బాగా ఇరుగ్గా ఉంది. పైగా జనం విపరీతంగా వున్నారు.

అడుగుదీసి అడుగువెయ్యడం బహుకష్టంగా వుంది. ఒక్కోచోట అయిదునిముషాలు ఆగితేగాని, ముందుకు పోవడానికి వీలు చిక్కడంలేదు.

ఆమె అరటిపళ్ళ దుకాణంవద్ద ఆగి బేరమాడుతోంది.

వంగి నిలుచున్న ఆమె మెళ్ళోని బంగారు గొలుసు అతని కళ్ళల్లో తళుక్కుమంది.

అతడి మనస్సులో చక్కని ఆలోచన మెరిసింది, మెరుపులా.

అవును! తను ఆమె మెళ్ళోని గొలుసు కొట్టేస్తాడు. ఆమె కనుక్కోలేదు. ఆమె ఇంటివరకూ తనూ వెళ్తాడు. 'మీ మెళ్ళో గొలుసుండాలి. యేదండీ?' అని అడుగుతాడు. ఆమె మెడ తడుముకుని, గొలుసు కనబడకపోయేసరికి గగ్గోలు పెడుతుంది. రెండు నిముషాలు ఆమెను యేడవనిచ్చి, ఆమె గొలుసు ఆమెకు ఇచ్చేసి, ఆమెను ఆశ్చర్యానందాల్లో ముంచెత్తుతాడు.

ఆమె హృదయంలో ఓచోటు చేసుకోవడానికి యీ మాత్రం చాలు!

ఆ మీదట అతి నేర్పుగా, తనే అల్లుకుపోతాడు, ఆమె జీవితంలో.

ఆమె అరటిపళ్ళు కొనేసి బయలుదేరింది. వీరేష్ కూడా బయలుదేరాడు ఆమె వెంట.

ఆమె బత్తాయిపళ్ళ దుకాణంవద్ద నిల్చుని కొంటుంటే, తన ఆలోచన అమలు జరపడానికో అవకాశం వచ్చింది వీరేష్‌కు. వినియోగించుకున్నాడు.

ఆమె మెళ్ళోని గొలుసు ఊడివచ్చింది, వీరేష్ పాకెట్ లోకి.

తృప్తిగా ఊపిరిపీల్చి, ఎప్పటిలా ఆమెను వెంబడించసాగాడు.

ఆమె యాపిల్ పళ్ళ దుకాణంవద్ద ఆగింది.

పళ్ళు కొని హఠాత్తుగా ఆమె వెనక్కు తిరిగింది. వెనకనే నిలుచున్న వీరేష్‌కి ఆమె ఎదురుగా వచ్చి గుద్దుకుంది.

మెత్తని ఆమె రొమ్ములు అతడి గుండెల్ని ఢీకొని,

అతడ్ని ఏవో లోకాల్లోకి మోసుకెళ్ళాయి. పరవశంగా కళ్ళు మూసుకున్నాడు.

ఆమె మార్కెట్టులోంచి బయటకు నడిచింది. అతడు కూడా ఆమె వెంట నడిచాడు.

ఆమె సిటీ బస్సు యెక్కింది, తొందరగా పోయి ఆలస్యం చెయ్యకుండా, వీరేష్ కూడా బస్సు యెక్కాడు.

దొండపర్తి బస్టాపులో దిగిందామె. ఆమెతోపాటుగ అతనుకూడా దిగాడు.

చేతిలో కూరల సంచీ వూపుకుంటూ నడుస్తోందామె రోడ్డుమీద.

ఆమెకు రెండడుగుల దూరంలో వీరేష్ నడుస్తున్నాడు.

ఆమె మొహంలో ఎక్కడలేని కంగారు. తను వెంటాడడం వల్లనే ఆమె గాభరాపడుతోందని అతడు గ్రహించాడు.

"మీ పేరు?" అడిగాడు వీరేష్, ఆమె ప్రక్కన నడుస్తూ.

"నా పేరా? షీలా" చెప్పిందామె.

"ఎక్కడుంటున్నారు? మీ వారేం చేస్తున్నారు?"

"ఇక్కడే న్యూ కాలనీలో. నాకింకా పెళ్ళికాలేదు."

హుషారుగా యీలవేసి "జాబ్ చేస్తున్నారా?" అడిగాడు వీరేష్.

"అబ్బే! ఆఁ... ఆఁ... గవర్నమెంటు ఉద్యోగం చేస్తున్నాను" చెప్పింది షీలా.

"ఇప్పుడిలా టీకి మీ ఇంటికి నన్నెందుకు ఆహ్వానించకూడదు? మీకో సంతోషవార్త చెబుతాను" అన్నాడు వీరేష్ చిలిపిగా నవ్వుతూ.

"ఏమిటది?" అడిగిందామె కంగారుగా.

"ముందు ఆహ్వానించండి. తర్వాత చెప్తాను" మురిపెం చూపాడు అతడు.

"అయితే రండి" అందామె.

"ఓ కే! థేంక్యూ!" హుషారుగా అడుగులేస్తూ అన్నాడు.

"మీతో పాటుగ ఎవరుంటున్నారు?" అడిగాడు వీరేష్ త్రోవలో.

"ఏక్ నిరంజన్. ఎవరూ లేరు నాతో" చెప్పిందామె.

ఆమె ఇల్లు వచ్చింది. బయటనుంచి పాడుబడ్డ ఇల్లులా అవుపించినా, లోపల ముఖ్యంగా షీలా ఉంటున్న భాగం చాలా బావుంది.

ఫోంబెడ్ ఉన్న డబుల్ కాట్, సోఫాసెట్టు, ట్రాన్సిస్టర్, స్టీరియో యేర్పాటుగల రికార్డు ప్లేయరు మొదలయిన ఖరీదయిన సామాన్లతో నిండివుంది ఆమె గది.

వీరేష్‌ను సోఫాలో కూచోబెట్టి, అయిదు నిముషాల్లో టీ తయారుచేసి తెచ్చిచ్చింది.

"ఇప్పుడు చెప్పండి. ఆ శుభవార్త ఏమిటో" అందామె అతని కెదురుగా కూర్చుని.

"మీ మెడలో ఓ గొలుసుండాలి యేమైంది?"

వీరేష్ నోట్లోంచి ఆ మాటరాగానే మెడ తడుముకుని "అరే! యేమైంది?" అంటూ క్షణం కంగారుపడి, అతని వైపు తమాషాగా చూసి "మీరు తీసారులెండి. ఇచ్చెయ్యండి" అందామె నవ్వుతూ.

"నేను అడిగాను కాబట్టి, నేను తీసినట్టు గెస్ చేసారు. బావుంది. కాని అంత అజాగ్రత్తగా వుండకూడదు బజార్లో పోతున్నప్పుడు" అంటూ జేబులోంచి గొలుసుతీసి "మీరేమనుకోకపోతే, నా చేతులతో మీ మెడను అలంకరించనివ్వండి" అని చెప్పి, ఆమె అతనికి చేరువగా వచ్చి

నిలుచోగానే, ఆమె మెడలో గొలుసు తగిలించాడు.

"థేంక్స్" అందామె పదేపదే.

అతని చేతులు అప్రయత్నంగా ఆమెను చుట్టేసి, ఆమెను తనవైపుకు త్రిప్పుకుని గాఢంగా అతని గుండెలకు అదుముకున్నాయి.

"మరి మీ కో బహుమతి ఇవ్వనీయండి నన్ను" అందామె అతని చేతుల్ని సున్నితంగా తన వంటిమీంచి తీసేస్తూ.

"ఏంటది?" అడిగాడు వీరేష్.

"ఇదిగో!" అంటూ ఆమె తన హేండ్ బేగ్ తెరిచి, అందులోంచి ఓ వస్తువుతీసి అతని చేతిలో పెట్టింది.

ఆ వస్తువు చూడగానే తుళ్ళిపడ్డాడు వీరేష్.

అది అతని పర్సు!!!

ఆమెను వెంబడించడం, ఆమె గొలుసు కొట్టెయ్యడం వ్యవహారంలో మునిగిపోయి, తనవద్దనుంచి ఏంపోయిందో గ్రహించుకోలేక పోయేడు.

క్షణంసేపు ఆమెవైపు బిత్తరచూపులు చూసి, ఆ మీదట విరగబడి నవ్వాడు ఆమెతో కలిసి.

"ఇప్పుడు తెలిసిందా నేనేం వుద్యోగం చేస్తున్నానో?" అందామె రెండు నిముషాలు పోయాక.

"అంటే దొంగతనమా?" రెట్టించిన ఆశ్చర్యంతో అన్నాడు వీరేష్.

"అదొక్కటే గాదు. నేనుచేసే పన్లు చాలా ఉన్నాయి. నల్లమందు, గంజాయి వగైరా మత్తుమందులు రవాణా చెయ్యడం, అక్రమంగా గర్భవతులైన అమ్మాయిలకు కడుపులు తీయించడానికి కమిషన్ పద్ధతిమీద డాక్టర్లను యేర్పాటు చెయ్యడం" తన గురించి చెప్పిందామె.

"ఆఁ" అంటూ నోరు తెరుచుకుని ఉండిపోయాడు వీరేష్ కాసేపు.

తేరుకుని "నాకన్నా ఒక ఆకు మీరు యెక్కువే చదివారు. మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతోషంగా వుంది నాకు" అన్నాడు వీరేష్.

ఆ తరువాత, తనగురించి కూడా ఆమెకు చెప్పేడు. అయితే, తను ప్రస్తుతం అమలులో పెట్టబోతున్న పథకం గురించి మాత్రం చెప్పలేదు.

"ఆహా! మీరు కూడా నా లైన్‌లోని వారే" అంటూ ఆమెకూడా తన సంతోషం వ్యక్తపరిచింది.

తరునా ఆమెను కలుసుకునే అవకాశం ఇమ్మని చెప్పి, ఆమె అంగీకారం తెలపగానే, ఆమెవద్ద శెలవు తీసుకుని, తన రూంకు బయలుదేరాడు వీరేష్.

# 6

వీరేష్ ఆలోచనలనిండా ఇప్పుడు షీలాయే! ఆమెను ఒక్కసారి పొందితే చాలు అని మొదట అనుకున్న వాడల్లా ఇప్పుడు ఆమెను శాశ్వతంగా తన దాన్నిగా చేసుకోవాలన్న ఆశతో ఉన్నాడు.

ఆమెతో పరిచయం బాగా పెరిగాక, ఆమెతోటి పెళ్ళి విషయం కదిపాడు ఓ రోజు.

అతని మాటలు వింటూనే విరగబడి నవ్వసాగింది ఆమె.

"ఎందుకా నవ్వు? నేను సీరియస్‌గా అడుగుతుంటే" అన్నాడు, తనలో సన్నగా తలెత్తుతున్న కోపాన్ని తమాయించుకో ప్రయత్నిస్తూ.

వీరేష్ కోపం ఆమె అర్థం చేసుకొంది. అయినా ఆమె నవ్వాపుకో లేదు.

డొక్కల్లో నొప్పి వచ్చేంతవరకూ నవ్వి "కోపం వద్దు వీరేష్!...నువ్వు నన్ను పెళ్ళాడతానంటే నవ్వొచ్చింది" అంది.

"యేం నువ్వు ఆడదానివి కావా? నీలో కోరికలు లేవా?" తీవ్రంగా అన్నాడు వీరేష్.

"నేనెలాంటిదాన్నో తెలిసికూడా అడిగావంటే నాకు నవ్వొచ్చింది" అంది షీలా నవ్వుతూనే.

"నిజానికి నిన్ను అందుకే పెళ్ళాడ దలచుకున్నాను. మన వృత్తులు ఒకటి, మన వ్యూహాలు, ఉద్దేశాలు ఒకటి. అయినా, మనల్ని పైవాళ్ళెలా చేసుకుంటారు...మనం యీ వృత్తుల్లో ఉండబట్టే, మనం ఒకరికోసం ఒకరం అన్నట్టు, మిగిలిపోయాం."

"ఆల్ రైట్! బావుంది...కాని మనకు పుట్టిన పిల్లలు దొంగలు కావడం నాకిష్టం లేదు. ఏమాత్రం వెనకేసావు ఇంతవరకూ?" అడిగింది షీలా సీరియస్‌గా.

ఆ ప్రశ్న విని వీరేష్ గతుక్కుమన్నాడు. ఇన్నాళ్ళు తను సంపాయించిందంతా తన విలాసాలకే, తన సరదాలు తీర్చుకోనడానికే కర్చు పెట్టేశాడు. కొంత వెనకెయ్యాలన్న ఊహే రాలేదు యిన్నడూ.

అయినా, తనకేం తక్కువని? లక్షలు సంపాయించే పథకం వేసి వుంచాడు.

తన పథకం గురించి ఆమెకు చెప్పాలా వద్దా అని కాసేపు తటపటాయించాడు.

"చూడు షీలా! ఇంతవరకూ నీనుంచి ఓ విషయం రహస్యంగా వుంచాను" అన్నాడు వీరేష్.

"ఏమిటని?" అడిగింది షీలా.

"లక్షలు కురిపించే ఓ బ్లాక్ మెయిలింగ్ పథకం వేసి

వుంచాను. వచ్చే డబ్బుతో మనం హాయిగా వుండవచ్చు."

"చూడు వీరేష్! అరచేతిలో స్వర్గం చూపించినట్టు మాట్లాడే మనుషులంటే నాకు అసహ్యం. పథకం వేసావు. జరగొద్దూ!...మనం యెలాగూ పెళ్ళి చేసుకోబోతున్నాం కాబట్టి, ఆ పథకం గురించి నాకు చెబితే నీకేమన్నా అభ్యంతరమా?"

"అబ్బే! నాకేం అభ్యంతరం లేదు...నిజానికి అందులో నీ సలహా తీసుకోవా లనుకుంటున్నాను."

"అయితే చెప్పు."

"మామ్మూలు రకం దొంగల్ని ఏడుగుర్ని కూడగట్టాను. ఊర్లోని ధనవంతుల గురించి సమాచారం సేకరించి ఇమ్మన్నాను. నేను చెప్పినట్టే, ఏభై లక్షలకు పైన ఆస్తిగల ధనవంతుల గురించి సమాచారం అందచేసారు. అయితే, అందులో నా బ్లాక్ మెయిలింగ్ పథకంలో ఎవర్ని ఇరికించాలో నిర్ణయించుకోలేదు."

"ఎవరెవరి గురించి యేం భోగట్టా అందిందో చెప్పు వింటాను."

వీరేష్ చెప్పసాగాడు. షీలా దీక్షగా వినసాగింది.

"నేషనల్ ఇంపోర్ట్సు అండ్ ఎక్స్‌పోర్ట్సు యజమాని రంగారావుకు కనీసం రెండుకోట్ల ఆస్తికి తక్కువవుండదు. ఇహ, బ్యాంకుల్లో ఎంతడబ్బు మూలుగుతోందో, అదిగాక నల్లధనం ఇంకెంత వుందో ఆయనకూడా తెలీదేమో!

"ఆయన తన తండ్రిగారి పేరిట ప్రతీ కాలేజీలోనూ, స్కూల్లోనూ లెక్కలేనన్ని స్కాలర్‌షిప్పులు ఇస్తున్నాడు.

"ప్రతీయేటా, తన పుట్టిన రోజున, బీదబిక్కికి అన్నదానం, వస్త్రదానం చేయడమే గాకుండా, పది రూపా

యలు కూడా కానుకగా ఇస్తాడు.

"అయితే, ఆయనలో బలహీనత వుంది. ఓ పదిమంది అమ్మాయిలు ఒంటిమీద గుడ్డలు లేకుండా, మోకాళ్ళ మీద పాకుకుంటూ వెళుతుంటే చూసి ఆనందిస్తాడు.

"అలాంటి పార్టీకి వెళ్ళివచ్చిన ఓ అమ్మాయి ద్వారా మా వాళ్ళు భోగట్టా సంపాయించారు.

"ఒక్కటంటే ఒక్క ఫోటో, ఆ అమ్మాయిలతో వుంటుండగా ఆయనది దొరికితే, అతడ్నో బంగారుచెట్టు లాగు ఎప్పుడు కావలిస్తే అప్పుడు డబ్బుకోసం దులుపుకో వచ్చు."

"అతడిమీద ఆశ వదులుకో. అతడు ముందీవ్యాపారంలోకి వచ్చేముందు, తన పోటీదార్లని ఇద్దరు ముగ్గుర్ని అయిపు లేకుండా చంపించి పారేయించాడట. ఇప్పుడు కూడా అతను అంతే చెయ్యవచ్చు, అతన్ని మనం బ్లాక్ మెయిల్ చేసామంటే" వ్యాఖ్యానించింది షీలా.

ఇంకో లక్షాధికారి గురించి చెప్పాడు [illegible]కేష్.

"నీరజ ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ అధికారి సర్వేశ్వర్రావుకు పదికోట్లకు తగ్గకుండా ఆస్తి వుంటుందని అంచనా. అయితే, అతడో రౌడీ మూకను పోషిస్తున్నాడు. వాడితో వ్యవహారం చాలా ప్రమాదం. వాడ్ని నేనే డ్రాప్ చేసేసాను. ఇహ, డాక్టరు మధుమూర్తి. ఏభైకి పైన ఎనభై లక్షలకు లోపున ఆస్తి వుంది. మగతనం లేనివాడట. ఆయనే ఎవరెవరినో కుర్రాళ్ళను తెచ్చి భార్యకు పరిచయం చేస్తాడట. అయితే, అలాంటివాడ్ని బెదిరిస్తే, పైసా రాలుస్తాడా అన్నదే నా సందేహం."

"అవును! లాభంలేదు. అలాంటివాళ్ళు ఇంకెవరున్నా నాళ్ళ పేర్లు వదిలెయ్."

"వీళ్ళందరికన్నా రాణీ కుముదినీదేవి గొప్ప ధనవంతు రాలు. ఆమె ఆస్తి ఇరవై కోట్లకు తగ్గదని అంచనా. అయితే..." ఆగిపోయాడు పీరేష్.

"అయితే...యేమిటో చెప్పు" ఆతృతగా అడిగింది షీలా.

"ఆమె ప్రవర్తనలో ఒక్క లోపం లేదు."

"అదెలా సాధ్యం? ఆమె భర్త వున్నాడా?"

"లేడు. అయితేనేం...అతడు శ్రీరాముడు. ఈవిడ సీతాదేవిలాగ ఇంకో పురుషుడివైపు ఆకర్షింప బడలేదు, అతడు చనిపోయి పదేళ్ళు కావస్తున్నా."

"నిజం?"

"నిజంగానే. పార్టీల్లో వైన్ ముట్టదట. అవతలివాడు ఎంత అందగాడైనా, ఎంత డబ్బున్న వాడైనా, ఎంత తెలివైన వాడైనా, వాడ్ని ఆమడ దూరంలో వుంచు తుందట."

"బహుశా అదంతా బైటకు షో యేమో?...ఇంటి పని వాళ్ళు...డబ్బు ఆశ చూపితే, ఆమె బలహీనతలు, రహస్యాలు చెప్పకపోరు. మీవాళ్ళు ఆమె గురించి సరిగ్గా దర్యాప్తు చెయ్యలేదని నా అనుమానం."

"అలాంటి పొరపాటుకు తావులేదు. అసలు ఆవిడ గురించి విషయసేకరణ జరపడంలోనే మూడు నెల్లు ఖర్చు చేసారు మా వాళ్ళు. ఆవిడ గురించి సమగ్రంగా తెలుసు కోవాలని, మా వాళ్ళు ఎంతో మందిని ఇంటర్వ్యూ చేసారు. ఆవిడ ఎంతో భక్తురాలట...భక్తి తప్ప ఆమెకు ఇంకో వ్యాసంగం లేదుట. ఆవిడకు ఇద్దరే పిల్లలు. మద్రాసులో ఓ బోర్డింగు స్కూల్లో చదువుకుంటున్నారు."

"పోనీ యీమెకేమైనా క్రిమినల్ రికార్డు వుందా?"

"లేదు. అవతలివాళ్లు బాధ పడుతుంటే చూసి భరించ లేనంత సున్నితమైన మనస్తత్వం ఆమెది."

"ఈ కేసు వదిలెయ్యకు. జాగ్రత్తగా మళ్ళా మళ్ళా మీ వాళ్ళను పంపి ఆమెగురించి భోగట్టా సేకరించమను. ఇలాంటి వాళ్ళల్లో చిన్నదంటే చిన్న లోపం వుంటే అంతే చాలు. అది పట్టుకుని వాళ్ళను ఊపించి డబ్బు గుంజవచ్చు."

"నువ్వు చెప్పింది బాగానే వుంది. తీరా అంతా అయినాక, ఆమెలో ఏ బలహీనత లేదని తేలిపోతే, ఏం చేద్దాం?"

"అప్పుడు కావలిస్తే, ఇంకేదో పథకం ఆలోచిద్దాం. ముందు మాత్రం కుముదినీదేవి గురించి మీ వాళ్ళను మళ్లా దర్యాప్తు చెయ్యమను."

"అలాగే!"

రాణీ కుముదినీదేవిని బ్లాక్ మెయిలింగ్ లో ఇరికించ డానికి నిశ్చయించుకున్నారు కిరీష్, శీలా.

# 7

"నమస్కారం పంతులుగోరూ!"

పంతులు బజారుకు బయులుదేరిన వాడల్లా ఆగిపోయాడు. ఎదురుగా ఎనమండుగురు కూలీలు అవుపించారు.

"ఏమర్రా ఏమిటి సంగతి?" అడిగాడు వారిని.

"సున్నాలు కొట్టే వోల్లమండి" చెప్పాడు వాళ్ళల్లో ఒకాయన ముందుకు వచ్చి.

పంతులు ఆ పనిమీదే బజారుకు బయులుదేరాడు. రాణీ కుముదినీదేవిగారి భవంతికి సున్నాలు వేయించాల్సి వచ్చి నప్పుడల్లా, తనకు తెలిసిన కూలీల జట్టును తెస్తుంటాడు బజారునుంచి. వాళ్ళయితే, సున్నాలు కొట్టేపని అతి తొందరగా పూర్తి చేస్తారు. తనకు కమిషన్ కూడా

మిగులుతుంది. ఏ మొత్తానికి సంతకం చెయ్యమన్నా చేస్తారు వాళ్ళు.

అందుకే, "మీరు లాభం లేదన్రా. రాణీగారి భవంతి అంటే అంతా స్పెషల్‌గా ఉండాలి. డబ్బు పోయినా, ఆమెకు పని శ్రేష్ఠంగా జరిగిపోవాలి. లోపం యేమన్నా వచ్చిందంటే నా ఉద్యోగం ఖాళీ" అన్నాడు పంతులు, ముందుకు కదులుతూ.

"ఆగండి మారాజా! మాంవు సెప్పింది కూడా ఇనుకోండి. యీసారి మమ్మల్ని పనిలో యెట్టుకోండి. పని నూసాక డబ్బులియ్యండి" చెప్పాడు ఆ జట్టునాయకుడు.

పంతులు ఓ క్షణం ఆలోచించాడు.

"ఒరే! అదేం లాభంలేదురా! ముందు ఓ మాట అనుకోకపోతే, తరువాత ఇబ్బందు లొస్తాయి. చెప్పండి. మీరు ఎంతధరలో వున్నారు?"

"మారాజా! మీకు తెలేదటి. రోజుకు ఎనిమిది రూపాయలు. నాను మేస్త్రీని. నాకు పది రూపాయలు."

"ఒరేయ్! నేనోమాట అంటాను. వింటారా?"

తలూపాడు ఆ వ్యక్తి.

"మేస్త్రీకి ఎనిమిది. మిగతావాళ్ళకు మనిషికి ఆరు. సంతకం మాత్రం పదికి, ఎనిమిదికి పెట్టాలి. ఇష్టమైతే ఇలాగే రండి. లేదా మీ తోవ మీది."

"చచ్చిపోతాం మారాజా. కనికరించండి దొరా!"

"ఒరేయ్! అలాగయితేనే రండి" అన్నాడు కరాఖండిగా పంతులు.

"సరే దొరా! పదండి" అని చెప్పి "పదండిరా!" అని తనవాళ్ళని ఆజ్ఞాపించాడు.

పంతులు వెంట కూలీలు బయలుదేరారు.

"పని మాత్రం వారం రోజుల్లో అయిపోవాలి. అలాగని దిగదుడుపు పని చెయ్యకూడదు. ఇకముందు కూడా మిమ్మల్నే పనిలోకి రప్పించుకోనేలా చెయ్యాలి పని" అంటూ పంతులు వాళ్ళను త్రోవలో ఇంకోసారి హెచ్చరించాడు.

సున్నాలుకొట్టే వాళ్ళ వేషంలో రాణీ కుముదినీదేవి భవంతిలో ప్రవేశించిన వారు బ్లాక్ మెయిలర్ వీరేష్, అతని ముఠా.

రాణీ కుముదినీదేవి ఇంటి పనివాళ్ళను, ఆమె వ్యాపార వ్యవహారాలతో సంబంధమున్న అనేక మందిని, పరోక్షంగాను, ప్రత్యక్షంగాను ప్రశ్నించి, రాణీ కుముదినీదేవి బలహీనతల్ని, ఆమె జీవితంలోని రహస్యాల్ని వెలికి దీయడానికి శతసహస్రాలుగా ప్రయత్నించాడు వీరేష్.

కాని లాభం లేకపోయింది. నలుగురినుంచీ దాచుకోవాల్సిన రహస్యాలు ఆమె జీవితంలో యేమీ లేవు.

ఇహ, ఆమె పడకటింటి రహస్యాలు కూడా లేవు అని, తేల్చుకోవడమే మిగిలి వుంది.

ఆమె బెడ్ రూంలో టేప్ రికార్డరు అమర్చి, ఆ విషయం తేల్చుకుందుకే, ఆమె ఇంట్లో సున్నాలు కొట్టేవాళ్ళ వేషంలో ప్రవేశించారు, వీరేష్, అతని ముఠా.

ప్రతీ సంవత్సరంలాగే, తను ఉండే భవంతికి వెల్ల వేయించడానికి, పంతులుకు ఆర్డరు ఇచ్చినట్టు, ఆ రోజే సున్నాలు కొట్టేవాళ్ళను తెచ్చి పంతులు పని ప్రారంభించనున్నట్టు, భవంతిలోని ఓ పనివాడి ద్వారా సమాచారం సేకరించాడు వీరేష్ ముఠాలో ఓ వ్యక్తి.

రాణీ కుముదినీదేవి ఇంట్లో ప్రవేశించడానికి ఆ అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు వీరేష్,

# 8

తన అనుచరులందరూ సున్నాలు వెయ్యడంలో నిమగ్నులై యున్నారు. కాని, వీరేష్ మాత్రం, రాణీ కుముదినీదేవి పడకగదిలో ప్రవేశించి, టేప్ రికార్డరు ఎలా అమర్చి రావాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

సున్నాలు వెయ్యడం ముందరగదులలో ఆరంభమైంది.

ఇంటినిండా పనివాళ్ళు. తాము జాగ్రత్తగా వుండకపోతే, సున్నాలు వేసేవాళ్లు ఎక్కడ సామాన్లు కొట్టేస్తారో అని వాళ్ళని వెయ్యి కళ్ళతో చూస్తున్నారు, పనివాళ్ళు.

వీరేష్ తనున్న ప్రదేశం వదిలి, మేడమీదున్న రాణీ కుముదినీదేవి పడకగదిలో ప్రవేశించలేక పోతున్నాడు.

ఏదో ఒక అవకాశం రాకపోతుందా అని ఎదురు చూస్తున్నాడు అతి జాగ్రత్తగా.

రాణీ కుముదినీదేవి ఉదయం ఎనిమిది గంటలకు భవంతి విడిచి వెళ్ళిపోతుంది కార్లో. మళ్ళా మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వచ్చి, భోజనం చేసి, అరగంట సేపు విశ్రాంతి తీసుకున్నాక ఫ్యాక్టరీకి వెళుతుంది.

సాయంకాలం ఆరు దాటాక గాని ఆమె తిరిగిరాదు.

రాణీగారంటే, పనివాళ్ళకు విపరీతమైన భయభక్తులు. తాము చేసే పనుల్లో ఏం లోపం వచ్చి, రాణీగారికి ఇబ్బంది కలుగుతుందో అని హడలి ఛస్తున్నారు.

కానీ, రాణీగారు మాత్రం ఎవర్నీ కేకలు వేస్తున్నట్టు గాని, కనీసం మెత్తగా చీవాట్లు వేస్తున్నట్టుగాని అవుపించలేదు.

మూడు రోజులు గడిచాయి. ఈ మూడు రోజుల్లో చిన్న ప్లాను తయారుచేసాడు వీరేష్.

నాలుగవ రోజు ఉదయం పది గంటలయింది. రాణీ కుముదినీదేవి బయటకు వెళ్ళిన గంటలో వంటమనిషి బజారుకు బయలుదేరింది.

ఆమె తిరిగి రావడానికి గంట పడుతుంది.

తోటమాలి తోటలో ఉన్నాడు మొక్కలకు నీళ్ళు పోస్తూ.

గదుల్లో మాత్రం, ఒక బట్లరు, గదులు ఊడ్చే అమ్మాయిమాత్రం వున్నారు.

తతిమ్మా ముగ్గురు పనివాళ్ళు, సున్నాలు వేసేవాళ్ళకు సాయం చేస్తున్నారు, సామాన్లు సర్దుతూ.

హీరేష్ మొదట ఆదేశించిన ప్రకారం, సున్నం కొట్టే వాళ్ళలో ఒకడు గట్టిగా కేక పెట్టి, గుండె పట్టుకుని నేల మీద పడిపోయి దొర్లసాగాడు.

ఇంకో ఇద్దరు సున్నం కూలీలు ఇంటిలోకి పరుగెత్తి జరిగినసంగతి చెప్పి, బట్లరుని, గదులు ఊడ్చే అమ్మాయిని బయటకు లాక్కొచ్చారు.

పావుగంటలో ఆ భవంతి పనివాళ్ళందరూ, నేలమీద పడి దొర్లుతున్న వాడిచుట్టూ మూగి చూడసాగారు.

"ఏమిట్రా ఏంజరిగింది?" అడుగుతున్నాడు ఒకడు.

"ఇదే మొదటిసారా? ఇంతకుముందెప్పుడైనా ఇలా జరిగిందా?" అడిగాడు ఇంకొకడు.

"డాక్టర్ని పిలిస్తే బావుంటుంది" సలహా ఇచ్చాడు మరొకడు.

ఆ అదను చూసుకుని, హీరేష్ మెల్లగా అక్కడనుంచి తప్పుకున్నాడు.

ఓ అరగంటసేపు నాటకం కొనసాగించమని, పనివాళ్ళ నందర్నీ అక్కడే అంటిపెట్టి ఉంచమని తనవాళ్ళతో చెప్పి ఉంచాడు,

చకచకా మేడ మెట్లమీదకు పరుగుదీసాడు. తిన్నగా రాణీ కుముదినీదేవి పడకగది చేరుకున్నాడు.

అది ఎయిర్‌కండిషన్డు గది. లోపల ఒక డబుల్ బెడ్ ఉంది. దానికి కాస్త దూరంలో వార్డ్‌రోబ్ ఉంది. అది గది గోడల్లో అమర్చబడి ఉంది. ఇంకోవైపు కోడిగుడ్డు ఆకారం అద్దం బిగించి ఉన్న డ్రస్సింగ్ టేబిల్ ఉంది.

సోఫాలకు, బెడ్‌కు, డ్రెస్సింగ్ టేబిల్‌కు సమాన దూరంలో చిన్న టేబిలుమీద ఫోను ఉంది.

తనకు అరగంట టైము మాత్రమే ఉంది. ఆమె ఏ విధంగానూ కనిపెట్టలేని స్థలంలో ఉంచాలి టేప్ రికార్డరు!

అనువైన ప్రదేశంకోసం గదంతా పరిశీలించసాగాడు వీరేష్.

గదిలో ఏమూల మాట్లాడినా, ఎంత మెల్లగా మాట్లాడినా, ఆ శబ్దాల్ని పికప్ చెయ్యగల్గు టేప్ రికార్డరు. అంతేకాదు! అందులో ఇంకో విశేషంకూడా ఉంది. ధ్వనులు వినిపించగానే పనిచేయడం ఆరంభించి, ధ్వనులు ఆగిపోయిన మరుక్షణం ఆగిపోతుంది.

మంచంక్రింద బిగించితేనో? అన్న ఆలోచన వచ్చింది. అయితే, పనివాళ్ళు గది ఊడ్వడానికి వచ్చి, దాన్ని చూసే అవకాశం ఉందని, ఆ ఆలోచన మానుకున్నాడు.

అలాగే, చెత్తబుట్టలో ఉంచుదామన్న ఆలోచనకూడా విరమించుకున్నాడు. ఎవరయినా చెత్తబుట్ట ఖాళీ చెయ్యాలని ప్రయత్నిస్తే, టేప్‌రికార్డరు బయట పడవచ్చు.

ఆలోచిస్తూ, డ్రెస్సింగ్ టేబిలు వద్దకు వెళ్ళాడు. దాని వెనుకభాగంవైపు చూసాడు. గోడకు, డ్రెస్సింగ్ టేబిలుకు మధ్య ఖాళీ ప్రదేశం ఉంది.

టేప్ రికార్డరు ఉంచడానికి కావాల్సిన జాగా ఉంది అక్కడ. 'అయితే, పనివాళ్ళు అక్కడకు పోయి చూసే అవకాశం లేదా?' ఆలోచించాడు వీరేష్.

అక్కడ దట్టంగా పేరుకొన్న దుమ్మునుబట్టి, ఆ వెనుక భాగం పనివాళ్ళు తరుచుగా తుడవరనీ, అదే టేప్ రికార్డరు ఉంచడానికి సరియైన ప్రదేశం అని గ్రహించాడు వీరేష్.

టేప్ రికార్డరు అక్కడ వుంచి, మరుక్షణంలో మేడ దిగి, దిగువకు వచ్చేసాడు.

నేలమీద పడి కొట్టుకుంటున్నాడు ఆ వ్యక్తి ఇంకా. అతడిచుట్టూ జనం గుమిగూడి వున్నారు.

ఒకడు గ్లాసుతో నీళ్ళు, ఇంకొకడు కాఫీ, మరొకడు తనకు తెలిసిన మందేదో చేతుల్లో పట్టుకుని నించున్నారు.

వీరేష్ అక్కడకు రాగానే, సన్నగా దగ్గాడు.

నేలమీదపడి కొట్టుకుంటున్న వ్యక్తి, ఓరకంటితో వీరేష్ వైపు చూసాడు.

తనువెళ్ళిన పని సవ్యంగా జరిగినట్టుగా వీరేష్ చిన్నగా తల పంకించాడు.

"ఆఁ" అంటూ చిన్నగా మూలిగి ఆ వ్యక్తి కళ్ళు మూసుకుని నిశ్చలంగా ఉండిపోయాడు.

"ఇహ ఫరవాలేదు. ఒక్క అరగంట విశ్రాంతి తీసుకున్నాడంటే, మామూల్గాలుగా లేచి కూచుంటాడు" అని చెప్పి, అందర్నీ అక్కడ్నించి పంపించివేశాడు వీరేష్.

## 9

"ఏవమ్మా పిలిచారట?"

"మీ కుర్రాడు రాముడు ఇంట్లోనే ఉన్నాడా?"

"ఉన్నాడు తల్లీ! తీసుకురమ్మంటారా?"

"తీసుకురా! వారం రోజులయింది మీ వాడ్ని చూసి."

"అలా గేనమ్మా!"

కదలివెళ్తున్న మనిషి పాదాల చప్పుడు. ఆ వెంటనే తలుపు మూసుకున్న శబ్దం.

అయిదు నిముషాల విరామం తరువాత —

"ఇదుగోనమ్మా రాముడు! అలాగ నిలబడి సూస్తావేట్రా! దండం పెట్టు అమ్మగోరికి."

"కోప్పడకు రంగన్నా! పద్దెనిమిదేళ్ళ గుంట వెధవ! నువ్వెళ్ళు రంగన్నా! కాసేపయాక వస్తాడు."

"వస్తానమ్మా!"

మనిషి వెళ్తున్న చప్పుడు. ఆ తరువాత తలుపు మూసుకున్న చప్పుడు.

"ఇలా వచ్చి నా దగ్గరగా కూచో రాముడూ. ఆఁ... ఇక్కడ గదిలో జరుగుతున్న సంగతులు ఎవరికైనా చెప్తున్నావా?"

"లేదండి. ఒట్టు! ఇక్కడ జరిగినవి ఎవరితోనన్నా చెబితే, మా అమ్మా నాన్నా తలకాయలు బద్దలయిపోతాయని మీరు చెప్పారుగా."

"వెరీగుడ్! అలా ఎవరికీ చెప్పకుండా వుంటే నీకు మంచి మంచి బట్టలు కుట్టిస్తాను. నిన్ను చదివిస్తాను. నువ్వేదికావాలంటే అది కొనిస్తాను. చెప్పావో దేవుడు మీ అమ్మా, నాన్న తలకాయలు చితగ్గొట్టేస్తాడు తెలిసిందా?"

"తెలిసింది."

"అయితే బట్టలు తీసెయ్ మరి."

మళ్ళా అదే గొంతు.

"ఆఁ... ఆఁ... నీవికావు... నా బట్టలు నువ్వు...నీవి నేను విప్పాలి... అప్పుడే మర్చిపోయావా?"

"మీవి చాలా పెద్దవండీ."

"చాలా పెద్దవంటున్నావు... ఇంకెవరివన్నా చూసావా?"

"లేదండి."

"మరి ఇవి పెద్దవని ఎలా తెలుసు నీకు?"

"పెద్దవిగా ఉన్నాయి కాబట్టి, పెద్దవంటున్నాను."

"నీ కామెంట్ నాకు బాగా నచ్చింది. కాని అలా చూస్తూ ఉండిపోయావేం!"

"మున్నటిలా చెయ్యమంటారా?"

"గట్టిగా బలంగా, శక్తింతా ఉపయోగించి పిండి పారెయ్యాలి."

పది నిమిషాలసేపు ఏవేవో చప్పుళ్ళు, మూల్గులు వినిపించాయి.

"ఇక నేను బట్టలు వేసుకోనేదా?"

"ఇంకోసారి ఆడుకోవాలని లేదా?"

"లేదండి."

"అయితే బట్టలు వేసుకో. ఇందు వంద రూపాయలు. కావాల్సినవి కొనుక్కో."

"అయ్య అడుగుతున్నాడండి...అమ్మగారు ఇంత డబ్బు ఎందుకిస్తున్నారు నీకు అని."

"దానికి జవాబు నేను చెప్తానులే...నన్ను వచ్చి అడగమను."

"అలాగే లెండి."

"మన ఒట్టుసంగతి మర్చిపోకు."

"అలాగేనండి. ఒట్టు ఎవ్వరికీ చెప్పనండి. వస్తానండి."

పాదాల చప్పుడు...తలుపు మూసుకున్న చప్పుడు.

టేప్ రికార్డరు ఆగిపోయింది.

అది వింటూంటే, ఏరేష్ అతని బృందం ఆనందంతో

చిందులు వేస్తూ పిచ్చిగా డాన్స్ చెయ్యసాగారు.

ఒకర్నొకరు కవుగిలించుకొన్నారు. బుజాలు చరుచుకున్నారు. గిల్లుకొన్నారు. కేరింతలు కొట్టారు చిన్న పిల్లల్లా.

వీరేష్ ఆనందం చెప్పనలవికాదు.

తన గ్యాంగ్ వాళ్ళు చూస్తున్నారన్న సంగతి కూడా పట్టించుకోకుండా, షీలాను రెండు చేతులతో పైకి లేవనెత్తి, కాసేపు గాలిలో త్రిప్పి, ఆమెను ముద్దులతో ఉక్కిరి బిక్కిరి చేసాడు.

# 10

"అమ్మా! మహారాణీ!

మీకు నూనూగు మీసాల కుర్రాళ్ళతోటి పొందంటే మహామక్కువ అని మాకు యీ మధ్యనే తెలిసింది.

మీ తోటమాలి రంగన్న కొడుకు రాముడితో మీరు రహస్యంగా సాగిస్తున్న కామకలాపాల గురించి మాకు యీ మధ్యనే తెలియవచ్చింది.

మాకు నిజంగా, ఆ రహస్యం ఎలా తెలిసిందా అని, ఆదేదో పోచికోలు కబురు అని మీరు నిబ్బరపడవచ్చు. మీరూ, మీ రాముడూ మీ పడకటింటిలో సాగించిన ఇటీవలి మీ ఇద్దరి సంభాషణ, ఓ టేపుమీద రికార్డు అయి మావద్ద భద్రంగా వుంది.

ఆ టేపులోని సంభాషణ యధాతధంగా కాపీచేసి, ఈ ఉత్తరంతో పంపుతున్నాను, మీకు నమ్మకం కలగడం కోసం.

పడకటింటి రహస్యాలను వెలికిదీసి ప్రసారం చెయ్యడం మా వుద్దేశం యెంత మాత్రమూకాదు. మీ రహస్యాలను మీ కన్నా జాగ్రత్తగా ఉంచడమే మా కర్తవ్యం. అదే మా వ్యాపారం కూడా.

అయితే, మీ రహస్యాలు రహస్యాలుగా వుండాలంటే, మాకో ధర వుంది.

అది వాయిదాల పద్ధతి మీదే గాకుండా ఒకేసారి తీర్చే పద్ధతి మీద కూడా చెల్లించే వీలువుంది.

వాయిదాల పద్ధతిమీద అయితే, నెలకు పాతిక వేలు మావి కావనుకోండి. మీ కంపెనీ తాలూకు మిస్సెలనీ కర్చుల్లో పదోవంతు కూడా ఉండదు ఆ మొత్తం.

లేదా టేపంతా కొనెయ్యా దల్చుకున్నారూ...ఏభై లక్షలు మా బేరం.

ఈ మొత్తాలు చాలా యెక్కువనీ, చెల్లించడానికి శక్తి లేదనీ యెత్తులు వెయ్యకండి. మీ నెలసరి ఆదాయం అన్ని కర్చులు పోను మూడు లక్షలు వుంటుంది. మీ స్థిర చరాస్తులన్నీ కలిపి ఇరవై కోట్లు.

ఈ టేపు సంగ్రహించే ముందు, మీ ఆదాయం, ఆస్తి వగైరా వివరాలన్నీ సంగ్రహించి వుంచుకున్నాం. కాబట్టి, మీగురించి బాగా తెలుసుకున్నాకనే రంగంలో దిగామని తెలుసుకోగలరు.

ఇహ, ఎక్కడ, ఏవిధంగా, ఏ రూపంలో మాకు డబ్బు అందజేయాలో అన్న ఆలోచన మీకు రావచ్చు. ఆ విషయం మీకు తెలియపర్చేముందు, మీ అంగీకారం కావాలి.

అంచేత వచ్చే ఆదివారం దిన పత్రికలో "అబ్బాయీ! నీకోసం మన పొరిగింటి పిల్లి బెంగ పెట్టుకుంది. త్వరగా తిరిగి (మొత్తంగా లేదా కొద్దికొద్దిగా) రానాన్నా!" అన్న ప్రకటన వేయించండి.

ఆ ప్రకటన అవుపించని పక్షంలో, ఆ ఆదివారానికి మరుసటి ఆదివారం మీ పడకటింటి రహస్యాలు అదే

పత్రికలో పతాక శీర్షికలుగా ప్రకటింపబడతాయి.

పదేపదే హెచ్చరించే అలవాటు మాకు ఎన్నడూ లేదు.

జాగ్రత్తపడండి.

త్వరపడండి.

ఇట్లు,

మీ శ్రేయోభిలాషులు.

"ఎలావుంది మన ఉత్తరం" అడిగాడు వీరేష్ ఉత్తరాన్ని మడుస్తూ.

"చాలా బావుంది. కానీ...నాకో సందేహం...వాయిదాల పద్ధతనీ,... మొత్తం చెల్లింపు పద్ధతనీ...ఎందుకు పెట్టావు వేరువేరుగా" అడిగింది షీలా.

"అందులో చిన్న తమాషా వుంది. ఒకేసారి పెద్ద మొత్తం ఇవ్వడానికి మనస్కరించదు. అంచేత చిన్న చిన్న మొత్తాలు నెలనెలా యివ్వడమే బావుంటుందనుకుంటారు. కొన్నాళ్ళు పోయాక, ఎన్నాళ్ళిలా ప్రతీ నెలా ముడుపు చెల్లించడం అని అనుకుంటారు. దాంతో ఒకేసారి పెద్ద మొత్తం చెల్లించి బాధ వదిలించుకుంటే పోలేదా అని అనుకుంటారు. అలా వాళ్ళు చెయ్యడంవల్ల కొన్నాళ్ళపాటు మనకు నెలసరి జీతాల్లా మొత్తాలు అందుతాయి. ఆ తరువాత, మనకు కావాల్సిన పెద్ద మొత్తం కూడా అందుతుంది" వివరించాడు వీరేష్.

"ఎలాగైనా నీది గట్టి బుర్ర" అంటూ వీరేష్ తలకాయను అందుకుని, గట్టిగా గుండెలకు అదుముకుని ముద్దాడి వదిలింది షీలా.

ఆరోజు సాయంకాలమే, ఆ ఉత్తరాన్ని, రాణీ కుముదినీ దేవి పేరున పోస్టుచేసాడు వీరేష్.

వీరేష్ కోరినట్టుగా, ఆదివారం దినపత్రికలో ప్రకటన అవుపించింది.

ఏభై లక్షలు చెల్లించి టేపు మొత్తాన్ని కొనివెయ్యా డానికే తన సంసిద్ధత వ్యక్తపరిచింది, రాణీ కుముదినీదేవి, ఆ ప్రకటన ద్వారా.

మరునాటి టపాలో తనకు ఆ డబ్బు ఎక్కడ ఎలా అందజెయ్యాలో తెలియజేస్తూ, తిరుగు ఉత్తరం పంపాడు వీరేష్.

## 11

హోటల్ మూన్ లవర్. కేబెరా, ఆడిటోరియమ్. రాత్రి పదిగంటలు దాటింది.

ఆడిటోరియమ్‌లో మసగ్గా దీపాల వెల్తురు. వేదిక మీద మెలికలు తిరిగిపోతూ నాట్యంచేస్తున్న డాన్సర్ మీద మాత్రం తెల్లని గుండ్రని స్పాట్ లైటు.

ఆమెతో పాటుగా, స్పాట్ లైట్ కూడా కదులు తోంది.

నరాల్లోని రక్తాన్ని మండించి, కరగించి, ఉరకలెత్తించే పాశ్చాత్య సంగీతం ముంచెత్తుతోంది, అక్కడ కూచుని కాబెరాని చూస్తున్న జనాన్ని.

ఆదేసమయంలో ఒకానొక వ్యక్తి ఆడిటోరియంలో ప్రవేశించాడు; చీకట్లో నీడలా.

అతన్ని పట్టించుకునే స్థితిలో లేరు జనం. నగ్నమవు తూన్న డాన్సరు అవయవాల అందాల్ని కళ్ళతో త్రాగెయ్య డంలో మైమరిచి ఉన్నారు.

అతడి కుడిచేతికి, పాల తెలుపు గ్లవుజు వుంది. ఎడం చేతిలో నల్లని లెదర్ బాగ్ వుంది.

అతడు ఆడిటోరియమ్ అంతా కలియజూసి, కుడివైపు గోడను అంటిపెట్టుకున్న టేబిల్సులో రెండవదానివద్దకు కదిలాడు.

అక్కడో స్త్రీ వుంది. ఆ టేబిలును ఆక్రమించుకున్న

స్త్రీ ఆమె ఒక్కతే. ఆమె కూర్చున్న కుర్చీ తప్ప, మిగతా మూడు కుర్చీలు ఖాళీగా ఉన్నాయి.

మిగతా వారికోసం యెదురు చూస్తోందో లేదో తెలీదు గాని, ఆమె దృష్టిమాత్రం జరుగుతున్న కాబెరామీద లేదు.

ఆ వ్యక్తి, ఆమెను సమీపిస్తూ "రాణీ కుముదినీదేవీ!" అన్నాడు సణుగుతున్నట్టు.

"యస్! ఇదిగో మీ ప్రెజెంట్" అంటూ ఆమె ఓ సూట్ కేసు ఆ వ్యక్తికి అందించింది.

ఆ సూట్ కేసు అందుకుని, తన చేతిలోని లెదర్ బాగ్ ఆమెకు అందించాడు.

రెండు నిముషాల సేపు ఇద్దరూ తమకు అందిన వస్తువుల్ని చెక్ చేసి చూసుకున్నారు.

"ఓకే మిస్టర్ ..."

"మిస్టర్ వీరేష్" మాట అందించాడు అతడు.

"ఓకే మిస్టర్ వీరేష్" అందామె.

"ఓకే మిసెస్ కుముదినీదేవీ. గుడ్ బై" అన్నాడు అతడు, అక్కడ్నుంచి కదలి వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడవుతూ.

ఆ దేసమయంలో హఠాత్తుగా వేదికమీద నృత్యం ఆగిపోయింది. ఆడిటోరియంలో దీపాలు వెలిగాయి. కళ్ళు చెదరిపోయే వెలుగుతో నిండిపోయింది ఆడిటోరియమ్.

ఆశించనిది జరిగింది. ఉన్నచోటున కొయ్యబారిపోయాడు వీరేష్.

ప్లెయిన్ క్లోత్స్‌లో ఉన్న పోలీసులు వలయాకారంలో నిల్చుని ఉన్నారు. వాళ్ళ చేతుల్లో అతనివైపు గురిపెట్టబడిన పిస్టల్సు నల్లగా నిగనిగా మెరుస్తున్నాయి.

"యస్! మిస్టర్ వీరేష్! నీ బ్లాక్ మెయిలింగ్ ఆట కట్టు" అంటూ సాదా దుస్తుల్లో ఉన్న ఇనస్పెక్టరు సీతాపతి ముందుకు వచ్చి, వీరేష్‌ను అరెస్టుచేసి, అతని చేతిలోని సూట్ కేసును స్వాధీనం చేసుకున్నాడు.

అప్పుడు చూసాడు వీరేష్. తనతో ఆ క్షణంవరకూ మాట్లాడింది, రాణీ కుముదినీదేవి కాదు, ఆమె డమ్మీ.

# 12

ప్రసిద్ధ బ్లాక్ మెయిలర్ వీరేష్‌ను అరెస్టుచేసిన సందర్భంగా, నగరంలోని ధనికవర్గం, ఓ అభినందన సభ యేర్పాటు చేసింది, సబిన్స్పెక్టరు సీతాపతికి.

బ్లాక్ మెయిలర్ వీరేష్‌ను ఎలా పట్టిష్టమైన పథకంవేసి, తను తన డిపార్టుమెంటు అందించిన సుద్దతుతో అరెస్టు చేసిందీ, విపులంగా తన ఉపన్యాసంలో చెప్పాడు సబిన్స్పెక్టరు సీతాపతి.

"వీరేష్‌ను పట్టేయడానికి బెంగాల్ పోలీసు సర్వసన్నాహాలు చేస్తుంటే, వీరేష్ తన మకాం విశాఖపట్నంకు మార్చేసాడు.

ఆ విషయం బెంగాల్ పోలీసే, ఆంధ్ర పోలీసుకు తెలియజేసింది.

బెంగాల్ పోలీసు పంపిన వీరేష్ ఫోటో సహాయంతో వీరేష్‌ను గుర్తించి, అతని కదలికల్ని పరిశీలించసాగారు జాగ్రత్తగా ఆంధ్ర పోలీసులు.

శేఖుదొంగ జగ్గారావును తన గదికి తీసుకుపోవడం అతని ద్వారా ఓ గేంగ్‌ని ఏర్పరచి, ఊర్లో ఉన్న ధనికుల గురించి సమాచారం సేకరించడం పోలీసులు గమనిస్తూనే వున్నారు.

వీరేష్, దురదృష్టం యెక్కడుందంటే, అతి పవిత్రురాలు అయిన రాణీ కుముదినీదేవిని వీరేష్ బ్లాక్ మెయిల్

చెయ్యాలని తీర్మానించుకోవడం.

రాణీ కుముదినీదేవి జీవితంలో ఏ రహస్యం లేదని, అనుచరులు ఎంత చెప్పినప్పటికీ వినకుండా, ఆమెకు ఏదైనా పడకటింటి రహస్యం ఉండకపోతుందా, అది వెలికిరాదా అని ఆమె బెడ్ రూంలో టేప్ రికార్డరు ఉంచాడు వీరేష్.

ఒక నేరస్థుడ్ని పట్టుకోవడానికి ఆదే నాటకమయినప్పటికీ, టేప్ రికార్డరులో తన కంఠం వినిపించడానికి నిరాకరించింది, రాణీ కుముదినీదేవి.

ఆమె కంఠంలా వినిపించే కంఠంగల స్త్రీని వెతకడంలో పోలీసు డిపార్టుమెంటు కొంత ఇబ్బందిపడినా, టేపులో విన్పించిన కంఠం రాణీ కుముదినీదేవిది కాదని అది ఫేక్ టేపనీ వీరేష్ ఎక్కడ గ్రహిస్తాడో అని, పోలీసు డిపార్టుమెంటు బెంగపడిపోయింది కొన్నాళ్లు.

అయితే, వీరేష్ ఆ విషయం గ్రహించలేదు. కుముదినీ దేవిని బెదరగొట్టి డబ్బు గుంజుకోవడం కోసం, ఎట్టకేలకు ఆమెలో ఓ లోపం కనిపించిందన్న ఆనందోద్రేకంలో కొట్టుకుపోయాడు.

వీరేషుకు దొరికింది, టు టౌను పోలీసుస్టేషనులో రికార్డు చెయ్యబడ్డ ఎరేంజ్ డ్ టేప్.

వీరేష్‌వద్దనుంచి ఉత్తరాలు వస్తే ఏంచెయ్యాలో, ఎలా జవాబులివ్వాలో_ అంతా పోలీసు డిపార్టుమెంటు చెప్పినట్టుగా చేసి డిపార్టుమెంటుతో సహకరించింది రాణీ కుముదినీదేవి.

చివరకు వీరేష్‌ను నేరం చెయ్యనిచ్చి, అన్ని ఆధారాలతో, రెడ్ హాండెడ్ గా పట్టుకొన్నాము'' చెప్పడం ముగించాడు సబిన్స్పెక్టర్ సీతాపతి.

—: ఐ పో యిం ది :—

# అణ్వాస్త్ర మహాసభ

**సుజనశ్రీ**

చలిగాలి రివ్వున వీస్తోంది. విపరీతంగా మంచు పడుతోంది. ఇళ్ళమీదా, మేడలూ మిద్దెలపైనా, చెట్లూ చేమల మీదా, నేలమీద తెల్లని దుప్పటి పరిచినట్టుగా మంచు పడి పేరుకు పోతున్నది.

శ్రీనగర్ పట్టణానికి వెలుపలగా పెద్ద మైదానంలో విశాలమైన బంగళా అది. దాని చుట్టూరా సాయుధ సైనికులు ఆయుధాలతో కాపలా కాస్తున్నారు. ఆహారం కోసం పొంచి చూస్తూ వేచి కాచుకునే డేగల్లా గూఢ చారులు అప్రమత్తతో కలయ దిరుగుతున్నారు.

ఆ బంగళాకు రెండు వైపులనుంచి మాత్రమే రహదారి ఉంది. ఆ దారుల వెంటగట్టి బందోబస్తు ఏర్పాటు చేయ

బడింది. లోపల వివిధ దేశాల ప్రతినిధులతో 'అణ్వాస్త్ర మహాసభ' సమావేశాలు జరుగుతున్నాయి.

బంగళాకు రెండువందల గజాల దూరంలో పెద్ద గేటు ఉంది. కార్లు ఒక్కొక్కటే అక్కడకు వచ్చి ఆగుతున్నయ్.

గేటుకి కాపలాగా మెషీన్‌గన్స్ పుచ్చుకుని సైనికులు గస్తీ తిరుగుతున్నారు. పోలీసుదళంవారు కారుని ఆపి, ఐడెంటిటీ సర్టిఫికెట్లు, ప్రవేశ పత్రాలూ, కారులోని వ్యక్తుల్నీ తనిఖీచేసి మరీ లోపలకు వదలుతున్నారు.

గేటు లోపలగా ఇన్‌స్పెక్టర్ జనరల్ మహేంద్ర నెమ్మదిగా అడుగులు వేస్తూ ముందరకు నడిచాడు. అతని డిప్యూటీ నిలబడివున్న చోట ఆగిపోయాడు.

"అబ్బ! ఒకటే మంచు! కదూ?" మహేంద్ర అడిగాడు.

"మంచేమిటి సార్! ప్రాణాలే గడ్డకట్టుకుపోతుంటేను!" డిప్యూటి ఐ. జి. లాల్ బదులు పలికాడు.

మహేంద్ర తల పైకెత్తి ఆకాశంవంక చూశాడు. ఆ తర్వాత ముఖంమీద పడుతున్న మంచుని తుడుచుకుంటూ బంగళా పైకిచూశాడు. అంత మంచులోనూ బంగళామీద ఉన్నికోట్లు ధరించి కొందరు సైనికులు మెషీన్‌గన్స్ పుచ్చుకుని తిరుగుతున్నారు.

"మన పరిస్థితి కొంచెం నయం! ఆ బంగళాపై పహరా కాసేవాళ్ళ దుస్థితి వర్ణనాతీతం!"

"అవును సర్! ఇవ్వాళ్టికి ఈ సమావేశం త్వరగా ముగించేస్తే బాగుండును!"

"నిజమే! కాని ఈ రోజు సభలో అమెరికా దేశపు రాయబారి ప్రసంగం అతి ముఖ్యమయినదిగా భావించబడుతోంది. అది అయిపోతే సమావేశం ఈ రోజుకు

ముగిసినట్టే!" మహేంద్ర వివరించాడు.

"లోపలున్న వాళ్ళకు ఈ చలి బాధ లేదు కదూ? లోపలంతా ఎయిర్ కండిషన్డ్ చేయబడి వెచ్చగా ఉంటుంది!"

గేటునుంచి బంగళావరకూ కట్టబడిన రంగురంగుల విదేశీ జెండాలు సైతం, ఆ మంచులో, రెపరెపలాడకుండా, బరువుగా వాలిపోయి ఉన్నై.

"మనవాళ్ళు చాల అప్రమత్తతగా ఉన్నారు సార్! ఈ మంచులో నానటం దేనికి? అలా వరండాలో నిలబడదాం రండి సార్!" లాల్ సూచించాడు.

"ఇంత సేపు ఉన్నాం! మరికొంచెం ఓపిక పడితే, అమెరికా ప్రతినిధిని లోపలకు పంపితే కొంత బరువు తీరుతుంది!" మహేంద్ర అక్కడే నిలబడిపోయాడు.

గేటు కవతలగా సుమారంలో వస్తున్న కార్లవంక చూశాడు మహేంద్ర.

"అవిగో!అవి అమెరికన్ రాయబార కార్యాలయానివిలాగున్నాయ్!" అన్నాడు.

లాల్ గూడ అటువంక చూశాడు.

గేటుదగ్గర నిలబడివున్న పోలీసు ఇన్స్పెక్టర్ హడావిడిగా గేటు ముందాగిన కారువద్దకు వెళ్ళాడు. కొద్దిగా వంగి వెనకసీట్లో కూర్చున్న రాయబారిని విష్ చేసి డ్రైవరు అందించిన కారు పర్మిట్ నీ, ఇతర పత్రాలనూ త్వరితంగా చూడటం ముగించి గేటుకానుకుని ఉన్న పోలీసులకు సంజ్ఞ చేశాడు. ఆ తర్వాత దాని వెనుకనున్న కారునిగూడ అలాగే పంపారు లోనికి.

గేటు తెరుచుకుంది. కారు లోపలకు వచ్చింది. దాని వెంటే మరో కారుగూడ అలాగే గేటు దాటింది.

బంగళాలోంచి నలుగురైదుగురు వ్యక్తులు వచ్చారు. ముందువచ్చిన కారు డోర్ తెరిచి అందులోని వ్యక్తులకు స్వాగతం చెప్పి లోనికి తీసుకెళ్ళారు.

మరో ఇద్దరు వ్యక్తులు రెండో కారు డోర్ తెరిచి అందులోని రాయబారిని విష్ చేశారు.

అతడు అమెరికా దేశానికి చెందిన ప్రతినిధి. నవ్వుతూ కారులోంచి దిగాడు క్రిందకు.

మహేంద్ర "హమ్మయ్య!" అనుకుని వాచీవంక చూసుకున్నాడు.

"ఢాం! ఢాం! ఢాం! ఢాం! ఢాం!" మెషిన్‌గన్ ప్రేలిన చప్పుడు విని ఎక్కడి వారక్కడే నేలమీద బోర్లా పడిపోయారు.

నేలబారుగా పడుకొని మహేంద్ర తలప్రక్కకు త్రిప్పి కాల్పులు వచ్చినవేపు చూశాడు.

బంగళామీదున్న ఆర్చీల చాటునుంచి దొంగచాటుగా కాల్చారెవరో.

చిన్న కారులోంచి దిగిన అమెరికన్ దేశీయుడు రక్తపు మడుగులో పడివున్నాడు. అతడి అనుచరులు కారుక్రిందకు దూరి దాక్కున్నారు.

ఒక్కనిముషం గడిచింది. నేలమీద ఎవరో కదిలారు.

"ఢాం! ఢాం! ఢాం!" మళ్ళీ మెషిన్ గన్‌లోంచి గుండ్ల వర్షం కురిసింది. కొన్ని గుళ్ళు కారుకి తగిలి కారు నిండా మరకల్నీ, కంతల్నీ ఏర్పరచినయ్.

నాలుగు వైపుల్నుంచి సైనికులు బంగళామీదకు కాల్పులు జరుపుతూ ముందుకు వస్తున్నారు.

బంగళామీద కాపలా కాస్తున్న సైనికులు గూడ కాల్పులు మొదలెట్టారు.

అయినా హంతకుడు పైన ఆర్చిల్లో ఎక్కడో దాక్కు న్నాడు. మంచులో పరుగెత్తాలంటే కాలు జర్రున జారు తోంది. బంగళామీద నడుస్తున్న సైనికుడి కాలు జర్రున జారుతోంది. బంగళామీద నడుస్తున్న సైనికుడి కాలుజారి పైనుంచి క్రిందకు పడిపోయాడు. అతడి కాలు విరిగింది.

ఇద్దరు సైనికులు అతడి దగ్గరకు పరుగెత్తారు. అతడ్ని చేతులమీదుగా వేసుకుని వరండాలో సురక్షితమైన చోటుకి చేర్చారు.

బంగళామీద కాల్పులు ఎక్కువైనయ్. రాయబారిపై కాల్పులు జరిపిన ఆగంతకుడు పరిగెత్తాడు ఒక దిశగా నక్కుతూ. కాని అతడి కాలుజారింది. క్రిందపడిపోయాడు. అతడి చేతిలోని మెషిన్‌గన్ గూడ చేయిజారి బంగళా ఆర్చిలమీదనుంచి క్రిందకు పడింది.

"అతడ్ని ప్రాణాలతో పట్టుకోండి!" మహేంద్ర అరిచాడు.

కాల్పులు జరపబోతున్న సైనికులు ఆగిపోయారు. మిషన్ గన్స్ అతడికి గురిపెట్టి ముందుకు నడిచారు.

ఒక సైనికుడు ఆగంతకుడి కాలర్ పట్టుకు పైకి లేవదీసి నిలబెట్టాడు.

గూఢచారి శాఖ డైరక్టర్ ఛటర్జీ గూడ బంగళా బయ టకు వచ్చాడు.

సైనికులు ఆగంతకుడ్ని లాక్కొస్తున్నారు.

"బంగళా లోపలకు ఈ అలజడి ఏమీ వినిపించలేదు గదా!" మహేంద్ర అడిగాడు.

"లోపలంతా సౌండ్ ప్రూఫ్! ఈ కాల్పులు విని పించవు!" ఛటర్జీ బదులు చెప్పాడు.

ఛటర్జీ బంధితుడి ముఖంలోకి చూశాడు.

అతడు అయిదున్నరడుగుల ఎత్తున్నాడు. ఆ పోలీసు ఉద్యోగుల ముందు అతడు చాల పొట్టివాడులా కనబడుతున్నాడు. అతడిది కోలముఖం. కళ్లు చిన్నవి.

"అంగామీ జాతివాడిలా ఉన్నాడు!" ఛటర్జీ స్వగతంలా పలికాడు.

"ఈజ్ ఇట్?" మహేంద్ర ఆశ్చర్యంగా అతడివంక చూస్తూ అన్నాడు.

నేరస్థుడు తను తప్పుచేసినవాడిలా బాధపడటం లేదు. పైగా తానేదో ఘనకార్యం చేసిన వాడిలా గర్వంగా చూస్తున్నాడు.

"అగ్రదేశ రాయబారిని కావాలనే చంపాను. కాకపోతే చిన్న దేశాలపై తన అధికారాన్ని రుద్దాలని చూస్తాడా? విజయం మాదే!" అని సంతోషంగా అరిచాడు.

## 2

సాయుధ సైనిక పహారాలో హంతకుడు మరోచోటికి తరలించబడ్డాడు.

ఛటర్జీ, మహేంద్ర ఇద్దరూ కాన్ఫరెన్సు హాల్లోకి అడుగు పెట్టారు. విజిటర్స్ గ్యాలరీలో వెనుక వరుసలో నిలబడి సమావేశానికి హాజరయిన వ్యక్తులందర్నీ ఒకసారి తేరిపారి చూశారు.

స్టేజీమీద కెనడాదేశపు రాయబారి ప్రసంగిస్తున్నాడు. అతడి వెనుకగా పెద్ద తెరమీద అణుశక్తిని సూచించే డయాగ్రమ్ ఉంది. దానిమీద శాంతి ప్రయోజనాలకే అణుశక్తి అని ఎర్రని అక్షరాలతో వ్రాయబడి వుంది.

"మన లెక్క ప్రకారం అన్ని దేశాల ప్రతినిధులూ వచ్చారేమో ఒకసారి చూడటం మంచిది" అన్నాడు చిన్నగా ఛటర్జీ.

మహేంద్ర ప్రతినిధుల గ్యాలరీవేపు చూసి ఖాళీగా వున్న కుర్చీలను లెక్క వేశాడు. వాటిలో చాలా కుర్చీలు చైనా, పాకిస్థాన్ దేశాల ప్రతినిధులకని ఉద్దేశంపబడినవే.

"చైనాదేశం తరపున ఆరుగురు ప్రతినిధుల బృందం వస్తారని మనకు ఆదేశం అందింది. కాని ఇద్దరే సమావేశానికి హాజరయ్యారు. అలాగే పాకిస్తాన్ నుంచి నలుగురు రావలసివుంది. వాళ్ళలోనూ ఇద్దరే వచ్చారు" అన్నాడు మహేంద్ర.

"సమావేశానికి హాజరవకుండా వున్న వ్యక్తు లెవరయినా ఈ హత్యకు ఏర్పాట్లుచేసి ఉంటారు" బదులు చెప్పాడు ఛటర్జీ, అతడితో ఏకీభవిస్తూ.

హాల్లో చప్పట్లు మ్రోగినయ్. ఇద్దరూ డయాస్(Dias) కేసి చూశారు. కెనడా ప్రతినిధి తన ప్రసంగం ముగించాడు. సభాధ్యక్షుడు లేచి అమెరికన్ ప్రతినిధి పేరు చదివాడు.

ఆపేరు వింటూనే సభలో మరోసారి కరతాళ ధ్వనులు మ్రోగినయ్. అమెరికన్ ప్రతినిధి రాబర్ట్సన్ వేదికమీదకు రాగానే మరోసారి చప్పట్లు మ్రోగినయ్.

సభలో అందర్నీ కలయజూస్తున్నాడు మహేంద్ర. చైనా ప్రతినిధులు ఇద్దరు మాత్రం నిర్వికారంగా కూర్చున్నారు. మిగతా సభాసదుల్లాగ వాళ్ళు కరతాళధ్వని చేయటంలేదు.

"చూశారా! వాళ్ళిద్దరూ రాబర్ట్సన్ అంటే ఏమాత్రం ఆసక్తి చూపటంలేదు! ఇది వాళ్ళపనే అయిఉంటుంది. ఎందుకయినా మంచిది, వాళ్ళపై రహస్య నిఘా ఉంచటం మంచిది" ఛటర్జీ సూచించాడు.

"ఈ సమావేశం ఇంకా మూడు నాలుగు రోజులు

జరగవచ్చు. ఈ లోపల ఇంకా ఎన్ని హత్యా ప్రయత్నాలు జరుగుతాయో!” మహేంద్ర తన అనుమానాన్ని వ్యక్తం చేశాడు. “ఎలాగైనా మీ ఆలోచనే నెగ్గింది. అదే మన పరువు కాపాడింది. అగ్రదేశాల ప్రతినిధులకు డమ్మీ వ్యక్తుల్ని ఏరి వాళ్ళను మామూలుగా రహదారినే రానిచ్చాం. అసలు నిజమైన ప్రతినిధులు మారువేషాల్లో రహస్య మార్గం గుండా తీసుకురాబడ్డారు. ఈ హత్యా ప్రయత్నంలో అమెరికాదేశపు ప్రతినిధి తాలూకు డమ్మీ మాత్రమే హత్య చేయబడ్డాడు. లేకపోతే ఈ నాటితో భారతదేశం పరువు గంగపాలయి ఉండేది.”

ఛటర్జీ మీసం దువ్వుకుంటూ నవ్వాడు. “ఇక మనం ఇక్కడ కాలయాపన చేస్తుంటే లాభంలేదు. అక్కడ మన అతిథి నోటినుంచి అసలు సమాచారాన్ని ఎంత త్వరగా కక్కిస్తే అంత మంచిది” అంటూ బయటికి నడిచాడు.

మహేంద్రగూడ అతడ్ని అనుసరించాడు. పోర్టికోకి దగ్గరగా కారు వచ్చింది. డోర్ తెరుచుకుని ఇద్దరూ లోపల కూర్చున్నారు. కారు ముందుకి సాగిపోయింది.

“ఈ మీటింగ్ అయిపోంగానే అమెరికా ప్రతినిధి చనిపోలేదని మన శత్రువులు తెలుసుకుంటారు. మళ్ళీ అతడిపై హత్యా ప్రయత్నం జరగవచ్చు. కనుక మనం త్వరపడి, మరో ఉపాయం ఆలోచించి ఆ ప్రయత్నాన్ని గూడ వమ్ముచేయాలి.”

## 3

బల్లమీద టెలిఫోన్ మ్రోగింది.

ఛటర్జీ రిసీవరెత్తి “హలో” అన్నాడు. మరో బటన్ నొక్కేసరికి అవతల వైపునుంచి ఫోన్‌లో మాట్లాడుతున్న డిప్యూటీ ఐ. జి. లాల్ టెలివిజన్ స్క్రీన్ మీద కనబడుతున్నాడు.

"అతడిచేత మాట్లాడించాలని చాల ప్రయత్నించేశాం సార్! ఎంత సేపటికీ 'అమెరికా పోగరు అణచాలి. దౌర్జన్యం నశించాలి' అనే పదాలు తప్ప మరో మాట వాడినోటి వెంటనుంచి రావటంలేదు. వాడు ఇంకా అపోహలోనే ఉన్నాడు, తను నిజంగానే అమెరికా ప్రతినిధిని హత్య చేశాననే!"

"అలాగా! వాడికి నిజం చెప్పేయకపోయారూ? తన ప్రయత్నం భగ్నమైందన్న విచారంలోనన్నా, ఈ కుట్ర వెనుక వ్యక్తుల గురించి చెప్పేస్తాడేమో!"

"కొంచెం ఆగి చెబుతాం సార్! మనవాళ్ళే ఒక ప్రశ్నల పట్టీలాగ తయారుచేశారు సార్! వాటికి వాడు అవును, కాదన్నట్టు తలాడించి సంజ్ఞలతోనే జవాబు చెప్పాడు!"

"ఏమిటా ప్రశ్నలు? వివరంగా చెప్పండి లాల్!"

"వాడి పేరు 'బులుంగా' అని చెప్పాడు. తను క్రితం రాత్రే ఆ బంగళామీదకు ఎక్కి చిమ్నీలో దాక్కున్నట్టు ఒప్పుకున్నాడు. అతడి చేతిలోని మిషీన్‌గన్‌ని ఎవరిచ్చారని అడిగాం. సమాధానంలేదు. అమెరికా ప్రతినిధిని చంపమని ఎవరు పురమాయించారని అడిగాం. దానికీ బదులులేదు. తను ప్రాణత్యాగంచేసి అయినా సరే రాబర్ట్‌సన్‌ని చంపడమే తన ధ్యేయం అంటాడు."

"ఆ పంది వెధవ చావకుండా ఎన్ని బాధలు పెట్టి అయినా సరే వాడిచేత నిజం కక్కించండి. మరో గంట గడిచాక నాకు ఫోన్ చేసి చెప్పండి మళ్ళీ. అప్పటికీ వాడే సంగతీ చెప్పకపోతే ఏంచేయాలో అప్పుడు నిర్ణయిద్దాం!"

"సరే సార్!"

ఛటర్జీ ఫోన్ పెట్టేశాడు. జేబులోంచి సిగరెట్ తీసి

వెలిగించుకుని, సిగరెట్ ప్యాకెట్ ని మహేంద్ర ముందుం నాడు.

"రాబర్ట్ సన్ పై హత్యా ప్రయత్నం జరుగుతుందని కేవలం నేను ఊహించిన విషయంకాదు. ఆ రహస్య సమాచారం నాకు ముందే తెలుసు. పాకిస్థాన్ లో పోస్టు చేయబడిన ఒక జాబు ద్వారా రష్యాకు ఈ రూమర్ తెలియ జేయబడింది. అక్కడ్నుంచి ఆ సమాచారం మనకు తెలియ జేయబడింది.

వెంటనే మరో సీక్రెట్ ఏజెంట్ ని పాకిస్థాన్ కి పంపాం, ఆ వుత్తరం గురించి ఇంకా వివరాలు రాబట్టేందుకు. కాని అతడు లాహోర్ చేరేసరికి అతడు హత్య చేయబడ్డాడు.

అంటే ఈ సమాచారం భారతదేశానికి చేరిందని శత్రువులు కనిపెట్టారన్నమాట. అటు తర్వాత అమెరికన్ ప్రతినిధి రాబర్ట్ సన్ ని ఎలా కాపాడాలా అని ఆలోచించాం. సరిగ్గా అతన్ని పోలిన మరో అమెరికన్ ని ఎన్నుకున్నాం. అసలు రాబర్ట్ సన్ మనం సూచించిన రహస్య మార్గాన సమావేశానికి హాజరయే ఏర్పాటుచేశాం. నకిలీ వ్యక్తికి కొంచెం మేకప్ చేసేసరికి అతడు అసలు రాబర్ట్ సన్ నే తలదన్నేలా తయారయారు. ఆ వ్యక్తిని మెయిన్ రోడ్ గుండా తీసుకువచ్చాం."

"ఎలాగైతేనేం మీ పథకం రాబర్ట్ సన్ ని ఈసారికి కాపాడింది. మన శత్రువులు తమ ప్రయత్నం విఫలమయిందని తెలుసుకుని మనపై ప్రతీకారం తీర్చుకునేందుకు మరో దేశపు ప్రతినిధిపై దెబ్బ తీస్తేనో?"

"అప్పుడు మనం ఇరకాటంలో పడ్డట్టే! అందుకే ప్రతినిధులందర్నీ బుల్లెట్ ప్రూఫ్ కార్లలో తీసుకువెళ్ళే ఏర్పాటు చేశాం. వాళ్ళ రాకపోకల్ని అతిరహస్యంగా వుంచాం.

అసలు ప్రతినిధి రావటానికి అరగంట ముందే రాజలాంఛనాలతో ఆ దేశపు వ్యక్తుల్ని కొందర్ని బహిరంగంగా తిరగనిస్తున్నాం. ఎందుకనంటే ఎవరైనా హంతకులు కాచుకుని గనుక ఉంటే ఈ హడావిడిలో మామూలు వ్యక్తుల్నే ప్రతినిధులుగా భావించి కాల్పులు జరపచ్చు. వాళ్ళని మనం వెంటనే బంధిస్తాం!"

"అయితే ఇప్పుడు పరిస్థితి అంతా బులుంగా మీద ఆధారపడి వుంది."

"అంతే!" అన్నాడు ఛటర్జీ.

"లాల్‌ని పిలిచి బులుంగా విషయం కనుక్కోనా?" అంటూ మహేంద్ర రిసీవరెత్తి డయల్ చేశాడు. ఫోన్ అవతలవైపు మ్రోగింది. మరుక్షణంలో టెలివిజన్ స్క్రీన్ మీద లాల్ ప్రత్యక్షమయాడు. "బులుంగానుంచి మనకు కావలసిన సమాచారం రాలేదు సార్!" అని జవాబిచ్చాడు లాల్.

"విన్నారుగా ఛటర్జీ! ఇప్పుడేం చేద్దాం!" మహేంద్ర ఛటర్జీ వేపు చూశాడు.

చేత్తో తల నిమురుకున్నాడు ఛటర్జీ. పైకప్పుకేసి ఒక సెకండు చూశాడు.

"నాకు ఒకే ఒక మార్గం తోస్తున్నది. అఫ్ కోర్స్ అది చాల పాత ట్రిక్కే అనుకోండి. వాడ్ని సెంట్రల్ జైలుకి మార్చే మిషతో అక్కడ్నుంచి తప్పించి, పారిపోయేటందుకు అవకాశం ఇద్దాం! వాడు ఎక్కడకు పోతాడో ఎవరెవర్ని కలుస్తాడో కనుక్కోవటమే! అంత కన్న ప్రస్తుతానికి మరో మార్గం కనబడటంలేదు" అన్నాడు ఛటర్జీ.

మహేంద్ర ఫోన్‌లో లాల్‌కి అదే చెప్పాడు.

# 4

పోలీస్ స్టేషన్ నుంచి బులుంగాని బయటగా తీసుకు వచ్చారు. అతడి వెంట మరో కానిస్టేబుల్ ని ఎస్కార్ట్ క్రింద పంపారు.

బులుంగా చేతికి బేడీలు వేయకుండా కానిస్టేబుల్ నడిపించుకు పోసాగాడు.

బులుంగా కళ్ళు ఆశగా మెరిసినయ్. మళ్ళీ తనని కొత్తచోట జైలులో ఎన్ని హింసలు పెడతారో, కనుక ఆ ప్రదేశానికి చేరలోపలే తన పని పూర్తిచేసుకోవాలి అనుకున్నాడు.

రోడ్డుమీద జనం అట్టేలేరు. కార్లూ, లారీలు మాత్రం తిరుగుతున్నయ్.

కానిస్టేబుల్ ప్రక్కగా నడుస్తున్న బులుంగా పరుగు లెత్తాడు. ఎదురుగా లారీ వేగంగా వస్తున్నది. బులుంగా లారీ కడ్డంగా రోడ్డుమీద బోర్లా పడుకున్నాడు. బ్రేకులు వేసినా లారీ ఆగలేదు. టైరు క్రిందపడిన బులుంగా తల చట్నీ అయిపోయి మెదడు బయటకు వెళ్ళుకొచ్చింది.

ఆ దృశ్యం చూసిన కానిస్టేబుల్ గతుక్కుమన్నాడు. తమ డిపార్టుమెంటు ప్లాన్ ని కాస్త భగ్నంచేస్తూ, బులుంగా ఆత్మహత్య చేసుకున్నాడు.

మరోసారి గూఢచారి శాఖలో అందరూ సమావేశమైనారు.

బులుంగా ఎక్కడ నివసించేదీ ఆరా తీయబడింది. అతడు ఒక నెల క్రితం శ్రీనగర్ కు వచ్చినట్టు వాళ్ళ కూపీలో తెలిసిన విషయం. అతడొక్కడే ఏదో తక్కువ క్లాసు హోటల్లో గది అద్దెకు తీసుకుని ఉంటున్నాడట. అతడితో ఎక్కువగా మాట్లాడిన వాళ్ళుగూడా లేరు. అర్ధరాత్రి

వరకూ అతడితో పరిచయం వున్నదని అనుమానింపబడిన వారినంతా ప్రశ్నించారు. కానీ ఎటువంటి సమాచారమూ దొరకలేదు వారికి.

ఐ. జి. మహేంద్ర సీరియస్‌గా సిగరెట్ మీద సిగరెట్‌ని కాలుస్తూ కూర్చున్నాడు. అతడి ముందర బులుంగా గూర్చి పోలీసులూ, సి. ఐ. డీలూ పంపిన రిపోర్టుల కట్టవుంది టేబుల్ మీద.

ఛటర్జీ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. ఆరా తీసేందుకని నిర్దేశింపబడిన ప్రతి ఏజెంట్ గురించీ అడుగుతున్నాడు ఫోన్‌లో.

"రాధారమణ్ రిపోర్టు రాలేదు ఇంకా! ఆ గోపీనాథ్‌ని ఎటు పంపారూ? నెంబర్ 16 ఏమయినట్టు?"

"రాధారమణీ, గోపీనాథ్‌ల సమాచారంలో ఏవీ ఉపయోగపడేది లేదుసార్! పోతే కృష్ణమూర్తి అదే నెంబర్ 16 సార్! అతడి కెవరో అనుమానాస్పదమైన వ్యక్తి తగిలాడనీ, అతడ్ని వెంటాడటానికి పోతున్నట్టు తిరిగి త్వరలో ఫోన్ చేస్తానని చెప్పాడు."

"అలాగా! అతనికేమైనా సాయం కావాలేమో మరి కొందర్ని పంపండి!" ఛటర్జీ ఫోన్ పెట్టేశాడు.

టేబుల్ మీది మరో ఫోన్ మ్రోగింది.

"సార్! రక్షణ మంత్రిగారు మిమ్మల్ని చూడాలని బయలుదేరారు సర్!"

ఛటర్జీ క్రేడిల్ మీద రిసీవర్ని పడేశాడు.

"రక్షణ మంత్రిగారు వస్తున్నాడట!" అని పెద్దగా వెల్లడించాడు. ఇద్దరు అటెండర్లు వచ్చి టేబుల్ మీది ఏష్ ట్రేలోని సిగరెట్ పీకల్ని తీసి పారేసి శుభ్రం చేశారు. పై అధికారి తనిఖీకి వస్తున్నాడా అన్నట్టుగా ఆఫీసు రూమ్ సర్దారు.

ఛటర్జీ, మహేంద్ర ఇద్దరూ రోడ్ మీదకు వెళ్ళి, కారు ఆగంగానే డోర్ తెరచి, రక్షణ మంత్రిగారిని రిసీవ్ చేసు కుని లోపలకు తీసుకువచ్చారు.

"నిన్నటి ప్రమాదాన్ని ఎదుర్కొన్న తీరు తెలిశాక మిమ్మల్ని అభినందించ లేకుండా ఉన్నాను" ఇద్దరి వంకా చూస్తూ రక్షణ మంత్రి అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

"థాంక్యూ సర్!" ఇద్దరూ ఏకకంఠంతో అన్నారు.

మహేంద్ర జరిగిన వృత్తాంతమంతా ఆయనకు వివరించి చెప్పాడు.

"ఎంత పెద్ద గండం గడిచింది! నిజంగా రాబర్ట్సన్ గనుకే హత్య చేయబడి ఉంటే మనదేశపు పరువూ, ప్రతిష్ట మంట గలిసివుండేవి. ఈ సభను ఏర్పాటుచేసి, కావాలనే ఈ హత్య చేశారని మనపై ఆరోపణ వచ్చేది. దాంతో మనకు శత్రుదేశాల సంఖ్య పెరిగిపోయేది. మనపై ఈ కుట్రని రుద్దటానికి ప్రయత్నించిన దేశం సంతోషించేది."

"నిజమే సార్!"

"ఇకపోతే ఈ సమావేశం ఇంకా రెండు రోజులపాటు కొనసాగవలసి వుంది. గనుక ఈ రెండు రోజులూ వాళ్ళను కంటికి రెప్పలా కాపాడాలి."

"మా ప్రాణాలు ధారబోసి అయినా కాపాడతాం సర్!" మహేంద్ర నొక్కి వక్కాణించాడు.

స్విచ్ బోర్డుమీద ఆకు పచ్చని లైటు వెలిగింది. ఛటర్జీ ఆశ్చర్యంగా అటు చూశాడు. బయట రక్షణ మంత్రితో వచ్చిన రక్షక ఉద్యోగులూ, పోలీస్ డిటెక్టివ్లూ కాచు కుని వున్నారు. ఈ లైటు వెలిగించటానికి స్విచ్ ఎక్కడుందో తమ శాఖలో చాల కొద్దిమందికి మాత్రమే తెలుసు. అయితే ఆ వచ్చిన వ్యక్తి ఎవరయి వుంటారు?

అతడే అత్యవసర సమాచారాన్ని సేకరించాడో.

ముందుకు వంగి టేబుల్ క్రిందుగా వున్న బటన్ నొక్కాడు మహేంద్ర. లోపలకు రావచ్చని పచ్చలైటు వెలగటానికి స్విచ్ నొక్కిన వ్యక్తికి అది జవాబన్నమాట.

గోడ ప్రక్కగా నిలబెట్టివున్న స్టీల్ అల్మరా తెరుచుకుని అందులోంచి ఒక వ్యక్తి వచ్చాడు. అది నిజానికి స్టీలు బీరువా కాదు. రహస్య ప్రవేశ మార్గం.

ఆ వచ్చిన వ్యక్తి చేతిలో ఏదో పేపరు వుంది.

"ఈవెనింగ్ న్యూస్ అనే పేపరు సార్ ఇది. రాబర్ట్సన్‌పై హత్యాప్రయత్నం గురించి సాకల్యంగా వివరించాడు ఇందులో. మన సమావేశానికి ఎవరూ పత్రికా విలేఖరులు హాజరు కాలేదు. మరి ఇతగాడికి ఆ సమాచారం ఎవరిచ్చినట్టు?" వచ్చినతను చెప్పాడు.

రక్షణమంత్రి ఛటర్జీ, మహేంద్రల వంక చూశాడు అయోమయంగా. మహేంద్ర అతడి చేతుల్లోని పేపరు లాక్కుని చూశాడు.

మహేంద్ర టెలిఫోన్ మీదకు చేయిచాచాడు. లాల్‌కి ఫోన్ చేసి వెంటనే "ఈవెనింగ్ న్యూస్" పేపరు కాపీలన్నిటినీ స్వాధీనం చేసుకోమనీ, ఆ ఎడిటర్‌పై వెంటనే కేసుపెట్టమని చెప్పాడు.

"మన పరివారాన్ని కేంద్రీకరించి మరింతగా కట్టుబాట్లు చేయండి. అవసరమైతే సైన్యాన్నికూడ రప్పించండి. ఇక నేను వెళుతున్నాను. ప్రతి మూడు గంటలకి ఒకసారి నాకు ఫోన్ చేసి ఎప్పటి సమాచారం అప్పుడు చెప్పండి."

రక్షణమంత్రి కుర్చీలోంచి లేచాడు. మహేంద్ర, ఛటర్జీ ఆయన్ని బయటివరకూ సాగనంపి తిరిగి వచ్చేలోపల

టేబుల్ మీద టెలిఫోన్ మ్రోగుతోంది.

మహేంద్ర మనసు చికాకుగా వుంది. పరిస్థితి క్షణ క్షణానికి చేయి జారిపోతున్నట్టుగా తోస్తోంది అతడికి.

ఛటర్జీ ఫోన్ రిసీవర్ ఎత్తాడు. "హలో, ఛటర్జీ స్పీకింగ్!"

"గుడ్ ఈవెనింగ్ సార్! నేను కృష్ణమూర్తిని సార్! ఖలుంగా గురించి ఏదో క్లూ దొరికితే దాన్ని వెంటాడుతూ వెళ్ళాను. అందుకని లేటయింది సార్! నేను వెంటబడింది కుందేలుగదా అనుకుంటే పెద్ద తోడేలు ఎదురయింది."

"నిజంగానా? ఇక్కడ మా చేతులు కసితో పిడికిళ్ళు బిగుసుకుంటున్నయ్. మాకు చేతినిండా పని కల్పించే అవసరంకోసమే ఎదురుచూస్తున్నాం!" ఛటర్జీ నవ్వుతూ అన్నాడు.

"హోటల్ సిమ్లాలో ఒక వ్యక్తి తారసపడ్డాడు. అతడిపేరు లక్ష్మణన్. అతడికి మద్రాసు సిటీలోనూ, ఇంకా తమిళనాడులోనూ స్టీల్ మిల్స్ వున్నాయట. అంతేకాదు, తుపాకులూ, రివాల్వర్లూ తయారుచేసే ఫ్యాక్టరీకూడ వున్నదట. అతడు వారం రోజుల క్రితమే దిగాడు ఇక్కడకు.

"హోటల్ సిమ్లాలోనే అరబ్ దేశపు ప్రతినిధులు గూడ బసచేసి వున్నారనే విషయం మీకూ తెలుసు. వాళ్ళతో రహస్యంగా మంతనాలాడుతున్నాడు లక్ష్మణన్. వారితో స్నేహంగా వున్నట్టుగా నటించి వారికేదైనా అపాయం తలపెడతాడేమో అని నా అనుమానం!"

"అలాగా! అయితే అతడ్ని మరింతగా చెక్ చేయలేక పోయూవా?"

"మాలాంటి చిన్న వ్యక్తుల్ని అతడు ఖాతరు చేసేలా

లేదు సార్! మనిషి చాలా పొగరుబోతుగా వ్యవహరిస్తున్నాడు."

"ఇంతకీ అతడికీ ఖులుంగాకీ ఏమిటి కనెక్షన్?"

"అవును సార్! అసలు విషయం చెప్పటం మరిచాను. మూడురోజుల క్రితం ఖులుంగా లక్ష్మణన్‌తో కలిసాడట. ఒకరోజల్లా అతడివెంటే తిరిగాడట."

"హోటల్ సిమ్లాలో అతడి రూమ్‌నెంబరు ఎంత?"

"రూమ్‌నెంబరు పదహారు సార్?"

"ఓకే! నువ్వు, మరికొందరు గూఢచారులతో అక్కడే వుండు. మేం ఇప్పుడే వస్తున్నాం!" ఛటర్జీ ఫోన్ పెట్టేసి కుర్చీలోంచి లేచాడు.

"మిస్టర్ మహేంద్రా! గెటప్, సింహం జూలు దువ్వటానికి వెడుతున్నాం మనం!"

మహేంద్ర హుషారుగా లేచాడు.

# 5

హోటల్ సిమ్లా నిండా వచ్చేపోయే జనంతో హడావిడిగా వుంది.

మహేంద్ర, ఛటర్జీ ఫుల్‌సూట్‌లలో వున్నారు.

కారిడర్‌లో గూఢచారి శాఖలోని వ్యక్తులు అటూ ఇటూ తిరుగుతున్నారు. వారి మధ్యగా ఇద్దరూ నడిచి పై అంతస్థులోకి వెళ్ళారు.

మూడో అంతస్థులో 16 నెంబరు రూమ్‌ముందు నిలబడి కాలింగ్ బెల్ నొక్కాడు ఛటర్జీ.

కాశ్మీరీ యువతి తలుపు తెరిచింది. "మిస్టర్ లక్ష్మణన్, మద్రాసు!ఆయన్ని చూడాలి మేం!" అన్నాడు మహేంద్ర.

"ఆయన ఇప్పుడు ఎవర్నీ చూచే స్థితిలో లేరు" ఆ యువతి కంగారుగా అంది.

"చాలా అర్జెంటు పని! ఆలస్యం అయితే ఇరుపక్షాల వారికీ నష్టం!" అన్నాడు మహేంద్ర.

ఆమె ఒకనిమిషం తటపటాయించింది. "ఆగండి! ఆయనకు చెప్పి వస్తాను" అంటూ లోపలకు వెళ్ళింది.

ఆమె వెనకనే ఇద్దరూ లోపలకు దూసుకుపోయారు. లక్ష్మణన్ శృంగారంలో మునిగి తేలుతున్నట్టున్నాడు. బెడ్ మీద అస్తవ్యస్తంగా పడుకుని వున్నాడు.

ఆగంతకుల్ని చూడగానే అతడు కోపంతో లేచి కూర్చున్నాడు. "ఎవరు వీళ్ళంతా? ఎందుకొచ్చారు? తక్షణం బయటకు నడవండి!" అని అరిచాడు పైజమాని పైకి లాక్కుంటూ.

"మిస్టర్ లక్ష్మణన్! మీతో అత్యవసరమైన పనివుండి వచ్చాం!" ఛటర్జీ అన్నాడు తీవ్రంగా.

"నేను బిజినెస్ వ్యవహారాలు చూసే టయిమ్ వేరే వుంది. అప్పుడు రండి! ప్లీస్ గెటవుట్ ఐసే!"

ఛటర్జీ తన కోటుజేబులోంచి ఐడెండిటీ కార్డుతీసి చూపించాడు. "పైగా ఈయనెవరో తెలుసా? ఐ. జి. ఆఫ్ పోలీస్. ఇకనైనా నీ మర్యాద కాపాడుకో! లేదా నిన్ను కటకటాల వెనుక నిలబెట్టి మరీ ప్రశ్నించాల్సి వుంటుంది."

లక్ష్మణన్ పిల్లి అయిపోయాడు. ఆ యువతి వంక చూస్తూ "నువ్వు కాస్సేపు ఆ లోపలకు వెళ్ళు!" అని ఇటువైపు తిరిగాడు.

కుర్చీలు చూపిస్తూ "కూర్చోండి! నావల్ల మీకు కావలసిన సహాయం ఏమిటి?" అని అడిగాడు.

లక్ష్మణన్ మంచి భారీ మనిషి. ఆరడుగుల ఎత్తు, నల్లగా బలిసి, కండలు తిరిగి వున్నాడు. కోర మీసాలు మధ్య

మధ్యలో దువ్వుతూ మాట్లాడుతున్నాడు.

"చూడు మిస్టర్ లక్ష్మణన్! మీరు ఇక్కడకు వచ్చి ఎన్నాళ్ళయింది. ఇంతదూరం ఏ పనిమీద వచ్చారు" మహేంద్ర అడిగాడు.

"నేను మద్రాసునుంచి వచ్చి వారం రోజులయింది. ఆఫీసు, బిజినెస్ వ్యవహారాలనుంచి రెస్ట్ తీసుకుందామని ఇలా హాలీడే ట్రిప్ మీద వచ్చాను."

"ఈవెనింగ్ న్యూస్ చదివారా?"

"లేదు! ఆ పేపరు పేరే వినలేదు ఇంతవరకు!"

"మూడురోజుల క్రితం మిమ్మల్ని బులుంగా అనే అంగామీ జాతి వ్యక్తి కలిశాడు కదూ? అతడితో మీకేం పని?"

లక్ష్మణన్ ఒక్క నిముషం ఆలోచించాడు.

"అవును. అతడిపేరు బులుంగా అనే చెప్పాడు. అయిదడుగుల ఎత్తు, చిన్న కళ్ళు, చదునైన ముఖం. తెల్లగా వుంటాడు! అతనే కదూ మీరు అడిగేది?"

"అవును! అతడే!"

"అతడెవరో అంతక్రితం నాకు తెలీదు. తనకు స్టీల్ మిల్స్‌లో బాగా అనుభవం వుందనీ, నా మిల్లులో ఏదైనా వుద్యోగం ఇప్పించమని బ్రతిమాలాడు. నేను ఏవీ ఖాళీలేవన్నాను. అంతకంటే నా కెక్కువ పరిచయంలేదు. అతడేదన్నా అఘాయిత్యం తలపెట్టాడా? బహుశా ఆత్మ హత్యకు తలపడి వుండవచ్చు!"

"అలా ఎందుకనుకోవాలి?" ఛటర్జీ అడిగాడు.

"ఏదీ వుద్యోగం దొరక్క మనిషి నిరుత్సాహపడ్డట్టుగా తోచింది నాకు."

"ఆత్మహత్యకాదు. ఒక విదేశీ రాయబారిని హత్య

చేయటానికి ప్రయత్నించాడు.”

“మైగాడ్! బహుశా అతడ్ని కిడ్నాప్ చేసి తద్వారా డబ్బు సంపాదించాలని ఎత్తువేశాడేమో! అతడ్ని గురించిన నా సమాచారాన్ని మీకు వున్నదున్నట్టుగానే చెప్పాను. ఇక నాకు సెల విప్పించాలి!” అన్నాడు లక్ష్మణన్.

“థాంక్స్!” అంటూ మహేంద్ర లేచాడు. ఛటర్జీ వాకిలిదాకా వచ్చి కారిడార్ లో చివర నిలబడిన సి.ఐ.డి.కీ ఒకకంట కనిపెట్టి వుండమని సంజ్ఞ చేశాడు. రెండువేపులా వున్న గదుల మధ్యగా నడుస్తూ ఇద్దరూ మెట్లదాకా వచ్చారో లేదో లక్ష్మణన్ గదిలోంచి పిస్టల్ ప్రేలిన శబ్దమూ, ఆ తర్వాత యువతి ఆక్రందనం వినిపించినయ్.

హడావిడిగా ఇద్దరూ వెనక్కు పరుగెత్తుకొచ్చారు. అయితే గది తలుపు లోపల గడియవేయటం వలన తలుపు తెరవటానికి వీలుకాలేదు.

ఛటర్జీ వెనక్కు వెళ్ళి, ఒక్క వుదుటున తలుపు ఢీ కొన్నాడు. తలుపు విరిగి లోపలకు పడింది.

గదిలో బెడ్ మీద లక్ష్మణన్ రక్తపు మడుగులో పడి వున్నాడు. అతడి ఛాతీలోనూ, పొట్టలోనూ బుల్లెట్ గాయాలు కనబడుతున్నయ్.

అంతక్రితం కనుపించిన కాశ్మీర్ యువతి జాడలేదు.

మహేంద్ర గది నాలుగువేపులా గాలించాడు. యువతి దాక్కోవడానికి ఎటువంటి రహస్యపు చోటూ కనబడ లేదు.

కిటికీలోంచి క్రిందకు చూశాడు. కిటికీలోంచి చూస్తే క్రింద ఏదో సన్నని వీధి పోతోంది. ఆ వీధిలో అట్టే జనం నడవడంలేదు.

హంతకుడెవరో ఈ కిటికీలోంచే వచ్చి వుండాలి. అటు

ప్రక్క వీధిలో అట్టే జనసంచారం లేదు గనుక ఆతడ్నెవరూ గమనించేందుకు గూడ ఆస్కారం లేదు. అయితే ఆ యువతినిగూడ హంతకుడు లాక్కుపోయాడా?

కిటికీలోంచి బాగా క్రిందకు వంగి చూశాడు. బాహాటంగా పడుతున్న మంచులో గాజు స్ఫటికంలోంచి కనుపించినట్టుగా, అప్పుడే పడిన మంచు పొరలోంచి గోడమీద ఎవరివో పాదాల గుర్తులు కనబడుతున్నయ్.

ఆ గుర్తుల్ని ఛటర్జీకి చూపించాడు మహేంద్ర. "ఏదైనా త్రాటిని చ్చైన ఉపయోగించి పైకి వచ్చి, మళ్ళీ ఆ దారినే హంతకుడు వెళ్ళిపోయి వుంటాడు."

"అవునవును. ఈ గదికి సూటిగా క్రిందవున్న గదిలో ఎవరు బసచేశారో కనుక్కోవాలి."

ఇద్దరూ రిసెప్షన్‌లోకి పరుగుతీశారు. మెట్లన్నీ దిగి, జనాన్ని త్రోసుకుంటూ, నెట్టుకుంటూ దారిచేసుకుని వెళ్ళేసరికి పావుగంట పైగానే పట్టింది.

"చూడండి! మూడో అంతసులో పదహారో నెంబరు గదికి నేరుగా క్రింద అంతసులో వున్న గది నెంబరెంత?"

"ఆ గది నెంబరు ముప్ఫయి ఎనిమిది సార్!" రిసెప్షనిస్టు నవ్వుతూ జవాబిచ్చింది.

"ఆ గదిలో ఎవరున్నారు?"

"వాళ్ళు ఇంతకుముందే, పదినిమిషాల క్రితం గది ఖాళీ చేసి వెళ్ళిపోయారు సార్!"

"ఈజ్ ఇట్! అయితే వాళ్ళ అడ్రసు వెదికి ఇవ్వాలి! చాలా అర్జెంట్!" మహేంద్ర ఆదుర్దాగా అడిగాడు.

రిసెప్షనిస్టు కిలకిల నవ్వింది. ఆమె నవ్వుచూస్తే మహేంద్రకు అరికాలిమంట నెత్తికెక్కింది.

"శ్రీనగర్‌లోకల్లా పెద్ద హార్డ్‌వేర్ ఇండస్ట్రియల్

మల్హోత్రా తెలుసా! ఆయన మేనల్లుడు రాకేష్, ఆయన భార్యా పేరిట ఆ గది రిజర్వ్ చేయబడింది."

"అలాగా! రాకేష్ వెంట మరో కాశ్మీరీ యువతి కూడా వుందా?"

"లేదండి. కాశ్మీరీ యువతి ఎవరూ లేరు. ఆంగ్లో ఇండియన్ అమ్మాయి మాత్రమే వుంది."

తమకు కాశ్మీరీ యువతిలా కనపడిన వ్యక్తే వేషం మార్చుకుని వుండాలనుకున్నాడు మహేంద్ర. ఆమెకూడ హంతకుడి తరఫు మనిషి అనటానికి సందేహంలేదు. లక్ష్మణన్ని సుఖపెట్టటానికి వచ్చిన స్త్రీలా అతడి గదిలోకి ప్రవేశం సంపాదించి, అతడ్ని తుదముట్టించటానికి హంతకుడికి సాయపడిందన్నమాట.

# 6

"ముందుగా మనం మల్హోత్రాని ఇంటర్వ్యూ చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం!" మహేంద్ర అడిగాడు.

"బాగానే వుంది! కాని రేపు సమావేశంలో ఏం గొడవలు జరుగుతాయో! దానికి మరింతగా కట్టుదిట్టం చెయ్యాలి గదా!"

"అదెంత పని! పోతూ పోతూ లాల్ని కలుసుకుని అతడికి ఆ పని పురమాయించి మనం మల్హోత్రా దగ్గరకు పోదాం!"

"ఓకే!"

కారు ముందుకు సాగించి. లాల్కి ఇవ్వాల్సిన సూచనలిచ్చి మల్హోత్రా ఆఫీసు ముందు ఆగారు.

అందంగా అలంకరించబడిన గదిలో రోజ్వుడ్ టేబుల్ ముందర కూర్చుని ఏవో కాగితాలు చూసుకుంటున్నాడు మల్హోత్రా.

సాదరంగా ఆ వచ్చిన వ్యక్తుల్ని ఆహ్వానించాడు మల్హోత్రా.

"నా వల్ల మీకే సహాయం కావాలో అడగండి!" అన్నాడు.

మహేంద్ర క్లుప్తంగా తాము వచ్చిన పని వివరించాడు.

"అటు పోలీసు ఉన్నతాధికారి, ఇటు సి. ఐ. డీ. ఉన్నతాధికారి ఇద్దరూ వచ్చారంటే ఏదైనా డొనేషన్ కోసం వచ్చారేమో అనుకున్నాను. లక్ష్మణన్ హత్య గురించే నాకు తెలీదు!"

ఛటర్జీ మల్హోత్రా కళ్ళలోకి సూటిగా చూస్తూ, అతడి ముఖంలో రంగుల్ని గమనించటానికి ప్రయత్నించాడు. కాని మల్హోత్రాలో ఏ విధమైన ఉద్వేగమూ కనబడలేదు.

కాలింగ్ బెల్ నొక్కి ప్యూన్‌ని రప్పించాడు. ఫ్రిజిడేర్‌లోంచి బ్రాందీ బాటిల్ తీశాడు ప్యూన్. గ్లాసుల్లోకి సీసాలోని బ్రాందీని వంచాడు.

"లక్ష్మణన్ దక్షిణ భారతంలో పెద్ద స్టీల్ వ్యాపారస్తుల్లో ఒకడు. అతడు చనిపోతే, మా వ్యాపార రంగంలో ఒక ధృవతార రాలిపోయినట్టే!"

"లక్ష్మణన్ గదిలోంచి మేము అప్పుడే బయటకు వచ్చాం. లోపల్నుంచి రివాల్వర్ షాట్ వినిపించింది. తిరిగి వెళ్ళి చూస్తే లక్ష్మణన్ రక్తపు మడుగులో పడి ఉన్నాడు. ఆ గది కిటికీలోంచి హంతకుడు పారిపోయి ఉండాలని రూఢి అయింది. పై అంతస్థు గదిలోంచి క్రింది అంతస్థు గదిలోకి దిగినట్టుగా అడుగుజాడలుగూడా వున్నాయి. ఆ క్రింది గదిలోకి మీ మేనల్లుడు రాకేష్, అతడి భార్యతోసహా దిగినట్టు ఆరాలో తేలింది."

మల్హోత్రా ఆశ్చర్యంగా చూశాడు. "ఏమిటీ?

రాకేష్ భార్యా?"

"అవును!"

"మీరు పొరబడి ఉంటారు. రాకేష్‌కి ఇంకా వివాహం కాలేదు. పైగా వాడ్ని మా ఫ్యాక్టరీకి పంపాను రెండు రోజుల క్రితం."

"అంటే మీవాడి పేరు మీద మరెవరో ఆ గదిలో దిగాడంటారా!"

"ఆ మాట వేరే చెప్పాలా సార్! లక్ష్మణన్ హత్య వార్త వింటూనే నాకు చాలా విచారం కలిగింది. ఎందు కంటారా? ఈ నెలలో అతడు మా కంపెనీనుంచి ఇనుప కమ్మీల్ని కొంటానికి వస్తానన్నాడు. దాదాపు మూడు నాలుగు లక్షల రూపాయలు విలువచేసే ఆర్డరు. అతడి మరణంతో ఆ ఆర్డరు మేం నష్టపోయినట్టే!" డ్రాయర్ లాగి ఒక ఫైలు తీసి వాళ్ళ ముందుంచాడు మల్‌హోత్రా.

ఇద్దరూ ఆ ఫైల్‌లో లక్ష్మణన్ వ్రాసిన లెటర్స్ చది వారు. మల్‌హోత్రా చెప్పింది నిజమే!

"నా మేనల్లుడు రాకేష్‌ని ఎవరో అనుకరిస్తున్నా రంటే, ఒక విధంగా రాకేష్‌కి కూడ వాళ్ళు ఏదైనా అపాయం తలపెట్టవచ్చు. కనుక నా మేనల్లుడ్ని కూడ కాపాడవలసిన బాధ్యత మీ మీద ఉంచుతున్నాను. దయచేసి మీరు నాకీ సాయంచేయాలి" అన్నాడు మల్‌హోత్రా దీనంగా.

"మా శాయశక్తులా ప్రయత్నించి నిర్దోషులకు రక్షణ, దుర్మార్గులకు తగిన శిక్షా ఇచ్చే ఏర్పాటుచేస్తాం. సరేనా?" అంటూ అతడికి హామీ ఇచ్చాడు మహేంద్ర.

"మీ సమాచారానికి చాలా థ్యాంక్స్! వస్తాం!"

మహేంద్ర, ఛటర్జీ, మల్‌హోత్రా దగ్గర సెలవు తీసు కుని బయటకు నడిచారు.

# 7

మరునాటి వరకూ ఎలాంటి సంఘటనలు లేకుండానే గడిచింది.

ఆ రోజు అలీన రాజ్యాల సభ జరుగవలసి వుంది. సభలో నేపాల్, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, శ్రీలంక మొదలైన దేశాల ప్రతినిధులు ఉపఖండంలో శాంతి స్థాపన గురించి చర్చిస్తారు.

అగ్ర దేశాల ప్రతినిధులెవరూ ఈ సభకు రావటంలేదు. అందువలన భారీ ఎత్తున రక్షణ ఏర్పాట్లు చేయాల్సిన అవసరం లేకపోయింది. అయినా ఛటర్జీ, మహేంద్ర ఇద్దరూ అప్రమత్తతగా ఉన్నారు.

ఛటర్జీకి సెంట్రల్ ఆఫీసునుంచి ఫోన్ రావటం వలన, మరునాడు జరగబోయే ఆఖరి సమావేశానికి ఏర్పాట్ల గురించి మాట్లాడడం కోసం సమావేశ మందిరంనుంచి బయలుదేరాడు.

మహేంద్ర అలీనరాజ్యాల సభకు కాపలాగ ఉండిపోయాడు. అతడి క్రింద పనిచేసే డి.యస్.పీలూ, యస్.ఐ.లూ అతి జాగ్రత్తగా అందర్నీ వెయ్యికళ్ళతో కనిపెడుతున్నారు.

ఛటర్జీ కారు వేగంగా నడుపుతున్నాడు. రోడ్డుమీద ఒక ప్రక్కగా కారు ఆగి ఉంది ఒకచోట. దాని ప్రక్కనే ఒక యువతి నిలబడి చెయ్యి ఊపుతోంది.

కారుని ఆమె దగ్గరగా ఆపాడు ఛటర్జీ. "నేను మీకే విధంగా సాయపడగలను మాడమ్!" అని అడిగాడు.

"నా కారు టైరు పంచరయింది. దయచేసి సిటీలోకి లిఫ్ట్ ఇవ్వగలరా?" ఆమె అడిగింది.

ఛటర్జీ డోర్ తెరిచాడు. ఆమె లోపలకు ఎక్కి

కూర్చుంది. కారు తిరిగి వేగం పుంజుకుంది.

"మీరు చాల వేగంగా నడుపుతారు! నాకు అంత వేగంగా నడపాలంటే చచ్చేభయం!" అంది ఆమె నవ్వుతూ.

ఛటర్జీ ఆమెవంక చూశాడు. ఆమె తెల్లగా, బొద్దుగా వుంది. ఆమె వయసు పాతిక సంవత్సరాలు వుండచ్చు అనుకున్నాడు.

ఆమె మెచ్చుకున్నందుకు కారు స్పీడ్ తగ్గించాడు ఛటర్జీ.

"అరె! ఏదో కారు ఎదుగొస్తున్నట్టుంది. ఈ మంచులో తీరా దగ్గరకు వచ్చేదాకా తెలీదు!" అంది ఆమె.

ఎదురుగా వస్తున్న కారుని తప్పుకునే యత్నంలో ఛటర్జీ స్టీరింగ్ ప్రక్కకు త్రిప్పాడు.

తనవంక చూడటంలేదని రూఢిచేసుకుని ఆ యువతి చేయి బయటకు పెట్టి, ఏదో చిన్న వస్తువుని కారు క్రిందకు విసిరింది.

ఆ వస్తువు మీదుగా వెనుక చక్రం పడంగానే "ఢాం!" అంటూ పెద్ద మ్రోత వినిపించింది.

"ఏమిటది?" అంటూ ఛటర్జీ బ్రేక్ వేసి కారాపాడు. దిగి చూస్తే వెనుక టైర్ బరస్ట్ అయిఉంది.

"చచ్చాం పో! ఇప్పుడెలాగ?" అన్నాడు.

"ఏంచేస్తాం! నా దురదృష్టం మిమ్మల్నీ ఇబ్బందిలో పెటినట్టుంది" ఆ యువతి ఇబ్బందిగా అంది.

"ఫరవాలేదు లెండి! ఏదైనా కారు ఈ రోడ్డమ్మట రాకపోతుందా?"

"బయట మంచుగా వుంది! లోపలకువచ్చి కూర్చోండి!"

ఛటర్జీ డోర్ తెరుచుకుని లోపలకు వచ్చాడు.

"అబ్బ! ఏంచలి!" అంటూ ఆమె అతడికేసి జరిగింది.

ఛటర్జీ మెడచుట్టూ చేతులువేసి అతడ్ని మీదకు లాక్కుంది.

# 8

కారిడార్ లో అటూ ఇటూ పచార్లుచేస్తున్న మహేంద్ర ఆ చివరగా తారట్లాడుతున్న వ్యక్తిని చూసి ఉలిక్కిపడ్డాడు.

అతడు అచ్చం 'బులుంగా' లాగే ఉన్నాడు. చచ్చిపోయిన బులుంగా మళ్ళీ బ్రతికి వచ్చాడా అన్నట్టుగా అనిపించింది.

వడవడిగా అడుగులు వేసుకుంటూ అతడ్ని అనుసరించాడు.

పొట్టిగా వున్న ఆ వ్యక్తి గబగబ ముందుకు నడిచి మలుపు తిరిగి అక్కడున్న గదుల్లో మాయమయ్యాడు. మహేంద్ర అటూ ఇటూ వెదుకుతూ లోపలకు వెళ్ళాడు. అతడు దాటిన గదుల తలుపులు ఒకటొకటే అతడి వెనుకనే మూసుకుపోవటం అతడు గమనించలేదు.

ఎంతగా ముందుకు వెళ్ళినా ఆగంతకుడి ఆచూకీ దొరకలేదు.

నేలమీద అగ్గిపెట్టెకన్న చిన్న సైజులో ఏదో ఆకుపచ్చని పెట్టె కనబడింది. మహేంద్ర వంగి దాన్ని జేబు గుడ్డతో అందుకున్నాడు.

అతి జాగ్రత్తగా దాన్ని తెరవటానికి ప్రయత్నించాడు, నాలుగైదు నిముషాలు శ్రమపడ్డాక అది తెరుచుకుంది.

"ఢాం!" అనే పెద్ద శబ్దం వినబడడంతో మహేంద్ర చేతిలోని వస్తువుని వదిలేశాడు.

అయితే మరుక్షణంలో ఆ ప్రేలుడు ఆ వస్తువునుంచి రాలేదనీ, సభాభవనంలో ఎక్కడో బాంబు ప్రేలిందనీ గ్రహించేసరికి అతడికి ముచ్చెమటలు పోసినయ్.

వెనక్కు తిరిగి బయటకు పోవటానికి ప్రయత్నించాడు. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. తను వచ్చిన దోవ తలుపులు గట్టిగా బంధించబడి ఉన్నయ్. ముందుకు దారిలేదు. వెనక వేపున తలుపులు వేసేసి వున్నాయ్. ఆ గదిలో కిటికీలు కూడ లేవు, కనుక తను అరిచినా ఆ కేకలు ఎవరికీ వినపడవు.

అంతలో తలుపులు తెరుచుకున్నాయ్. ఎవరో ఇన్‌స్పెక్టర్ తలుపు తెరిచాడు. కారిడార్‌లోంచి జనం గుంపులు గుంపులుగా పారిపోతున్నారు.

"మీరిక్కడున్నారా సార్! సభా భవనంలో ఎవరో బాంబు విసిరారు, ప్రేలుడు సంభవించింది, ఫైర్ స్క్వాడ్‌కి ఫోన్ చేశాం!" అన్నాడతడు.

"డెలిగేట్స్‌లో ఎవరికైనా ప్రమాదం సంభవించిందా?" ఆదుర్దాగా అడిగాడు మహేంద్ర.

"నేపాల్ ప్రతినిధికి గాయాలయినయ్. ప్రేక్షకుల గ్యాలరీలో ఇద్దరు వ్యక్తులు చనిపోయారు."

మహేంద్ర హుటాహుటిగా ముందుకు నడిచాడు.

బయట కోలాహలంగా వుంది భవనంలోంచి అరుస్తూ, ఏడుస్తూ పారిపోతున్న జనంతో. సమావేశ మందిరం పొగతో నిండిపోయింది. కొన్ని కొయ్య కుర్చీలు మండుతున్నయ్. ఆ మంటలు ఎలా వచ్చాయో అర్థంకాలేదు మహేంద్రకు.

ఎవరో సెక్యూరిటీ ఆఫీసరు పెద్దగా ప్రమాదం గురించి వివరిస్తూన్నాడు. ముందు పెద్దగా బాంబు ప్రేలుడు విని

పించింది. కిటికీల అద్దాలు పగిలిపోయి గాజు పెంకులు చెల్లా చెదురుగా పడిపోయాయి. ఆ సాయంత్రం వరకూ ప్రశాంతంగా వున్న వాతావరణం క్షణాల్లో భీభత్సంగా తయారయింది.

పారిపోతున్న జనంలో ములుంగా లాంటి వ్యక్తి లెవ రయినా వున్నారేమో పరీక్షగా వెదికాడు మహేంద్ర. కాని అంగామీ జాతివాళ్ళెవరూ లేరు.

అయితే అతని కళ్ళకు మల్‌హోత్రా మేనల్లుడు రాకేష్, అతని వెంట మరో అమ్మాయి కనుపించారు. వాళ్ళు లోప లకు ఎలా రాగలిగారా అని ఆశ్చర్యపోయాడు మహేంద్ర.

ఇన్‌స్పెక్టర్‌ని పిలిచి రాకేష్‌ని చూపించి, అతడ్ని వెంటాడమని చెప్పాడు.

అంతలో ఎవరో అరిచారు "అమ్మో మంటలు! భవనం కాలిపోతున్నది!"

లోపలున్న వ్యక్తులు తలా ఒక దిశగా పారిపో తున్నారు. మంటలు నలువైపులా అలుముకుంటున్నయ్. బయట మంచు కురుస్తుంటే లోపల మంటలు!

మహేంద్ర ముందుకు వెళ్ళటానికి వీల్లేకుండా మంటలు ఎగబ్రాకినయ్. ప్రక్కనే ఉన్న ఇన్‌స్పెక్టర్‌ని సాయంగా పట్టుకుని గోడకానుకుని ప్రక్క ప్రక్కగా అవతల వేపుకి పరుగెత్తాడు. కాలే పెనంమీద కూర్చున్నట్టుగా సెగ కొట్టింది అతడికి. అలాగే ముందుకు దూసుకుపోయాడు గుడ్డిగా. అతడి చేతులు మంటలకు తగిలి బాధపెట్టినయ్.

ఆ భవనంలో ఒక మూలగా పైకప్పు కూలి క్రింద బడింది. కూలిపోయిన శిథిలాల క్రింద ఇరుక్కున్న వాళ్ళనూ, మంటల్లో కాళ్ళూ చేతులూ కాలినవాళ్ళను ఫైర్ సర్వీసు వాళ్ళు వచ్చి వెలికి తీసి అంబులెన్స్‌లో హాస్పిటల్‌కి చేర్చారు.

ఛటర్జీ భవనం ముందు నిలబడి తన జూనియర్ ఆఫీసర్లకు ఆదేశాలిస్తున్నాడు.

"ఏమిటి సంగతి! నీవు అయిపులేకుండా పోయావు!" మహేంద్ర అడిగాడు.

"నన్ను కావాలనే ఎవరో దోవలో ఆటంకపరిచి ఆపారు మిస్టర్ మహేంద్రా!"

"మళ్ళీ అంగామీ జాతివాడు ప్రత్యక్షమయ్యాడు ఇక్కడ ఈ ఘోరం సంభవించటానికి ముందు! అది వాడి పనే అయివుండాలి. అంతేకాదు. రాకేష్, మరో అమ్మాయి గూడ ఈ సమావేశానికి వచ్చారు. వాళ్ళూ అనుమానితులే నా దృష్టిలో" మహేంద్ర తన అనుమానాన్ని వివరించాడు.

పోలీసు ఇన్స్పెక్టర్ తిరిగి వచ్చాడు. "సర్! ఇంతక్రితమే మల్హోత్రా బంగళానుంచి కారులో మల్హోత్రా, రాకేష్, అతని వెంట వున్న అమ్మాయి ముగ్గురూ వెళ్ళిపోయారు. ఇంట్లో ఆరా తీయగా వాళ్ళు ఇక్కడకు పది మైళ్ళ దూరంలో వున్న తమ ఎస్టేట్‌కి వెళ్ళారని తెలిసింది."

"గుడ్! మనంగూడ ఇప్పుడే వెళ్ళి వాళ్ళ సంగతేమిటో తేల్చుకుందాం!" మహేంద్ర ఉత్సాహంగా అన్నాడు.

ఛటర్జీ 'సరే'నన్నాడు.

# 9

శ్రీనగర్ పట్టణ పొలిమేరల్లో రెండు జీపులు వేగంగా పోతున్నయ్. మంచులో జీప్ చక్రాలు జారిపోకుండా బెల్ట్‌లాంటి చైన్‌లు వేయబడినయ్ చక్రాలకు.

ముందు జీప్‌లో మహేంద్ర, ఛటర్జీ కూర్చుని వున్నారు. వెనుక రెండో జీప్‌లో మరికొందరు గూఢచారి శాఖ

ఉద్యోగులూ, మంచులో జారిపోయేటందుకు వీలుగా వుండే స్కేటింగ్ సాధనాలు, త్రాళ్ళూ, లాటీకర్రలు, మెషీన్‌గన్స్, మెడికల్ కిట్ ఇవన్నీ వస్తున్నయ్.

శ్రీనగర్‌కు పది మైళ్ళ దూరంలో చిన్న పల్లెకు దగ్గరగా మల్‌హోత్రా ఎస్టేట్ వుంది.

మంచు కొద్దిగా పడుతోంది. జీప్‌లు మైదానాల మధ్యగా వెడుతోన్నయ్. ప్రకృతి మీద తెల్లని గుడ్డ పరచినట్టుగా ఎటు చూసినా తెల్లని మంచు కప్పబడిన బీళ్ళూ, మైదానాలూ, గుట్టలూ కనబడుతున్నయ్.

ఒక గంట ప్రయాణించిన తర్వాత రెండు జీప్‌లు ఒక పెద్ద బ్రిడ్జివద్దకు చేరుకున్నయ్. ఏదో చిన్ననది పారుతోంది బ్రిడ్జి క్రిందుగా.

"ఇంకా ఎంత దూరం ఇక్కడనుంచి?" మహేంద్ర అడిగాడు.

"అదుగో ఆ కనబడే కొండ మలుపు తిరిగితే అతగాడి ఎస్టేట్ వస్తుంది" ఛటర్జీ బదులు చెప్పాడు.

మహేంద్ర ఫ్లాస్కు తెరిచి టీ పోసుకుని త్రాగాడు. ఛటర్జీ తనకు ప్రస్తుతం ఏమీ అక్కర్లేదన్నాడు.

జీప్‌లు మళ్ళీ కదిలినయ్. మొదటి జీప్ బ్రిడ్జిమీద సగందూరం దాటి వచ్చింది. జీప్‌కి పదిగజాల దూరంలో 'ఢాం' అంటూ బాంబు ప్రేలింది. బ్రిడ్జిలో కొంతభాగం కూలిపోయింది నదిలోకి. అక్కడ అగాధం ఏర్పడింది.

జీప్ నడుపుతున్న ఛటర్జీ ప్రమాదాన్ని గ్రహించి సడన్‌బ్రేక్ వేశాడు. కాని జీప్ కొంచెం ముందుకు వెళ్ళి ఆగింది. అప్పటికే జీప్ ముందు చక్రాలు కూలిపోయిన వంతెన ఖాళీలోకి దిగబడిపోయినై. మరుక్షణంలో జీప్ ముందుకు తూలి పడిపోయింది.

సుడులు తిరుగుతూ, పరవళ్లు త్రొక్కుతూ, మాగడలా పైభాగాన పేరుకున్న మంచుగడ్డలు నీళ్ళమీద తేలుతూ ప్రవాహంలోకి పోతున్న నది తమని కబళించే నెపంతో వాళ్ళమీదకు వురుకుతున్నదా అన్నట్టుగా అనిపించింది, పడిపోతున్న జీప్‌లోని వ్యక్తులకు.

మహేంద్ర, ఛటర్జీ ఇద్దరు జీప్‌లోంచి చెరోవేపుకూ దూకేశారు.

నీళ్ళలో మునిగిపోతున్న వ్యక్తులకు పైనుంచి అరుపులు వినిపిస్తున్నయ్. బరువుగా వున్న జీప్ నీళ్ళలో మునిగి పోయింది. ఆ తర్వాత వ్యక్తులు నీళ్ళలోకి జారారు.

నీటిపైభాగం వాళ్ళిద్దర్నీ కప్పేసింది. ఎముకలు కొరికే చలి. తన నరాలు చచ్చుపడిపోతున్నాయా అనుకున్నాడు మహేంద్ర. తన బలాన్నంతా కూడగట్టుకుని కాళ్ళూ చేతులతో నీళ్ళలోనే తన్నుకున్నాడు. మాగడలా వున్న పైభాగం అడుగున, నీరు వేగంగా ప్రవహిస్తోంది. ఆ ప్రవాహంలో మునుగుతూ తేలుతూ ముందుకుపోతున్నాడు. అలుపుతో నోరు తెరిస్తే నోట్లోకి నీళ్లు పోయినయ్.

అంతలోనే అతడికి తాడులాంటిదేదో చేతికి దొరికింది. రెండు చేతులతో దాన్ని గట్టిగా పుచ్చుకున్నాడు. ప్రవాహం వాలులో అతడు కొట్టుకుపోకుండా ఆగగలిగాడు.

తాడు బ్రిడ్జివేపునుంచి లాగబడుతోంది. నీళ్ళమీదకు తేలి పైకిచూచాడు మహేంద్ర. రెండో జీప్‌లో వచ్చిన సీక్రెట్ ఏజెంట్స్ జరిగిన ప్రమాదాన్ని గ్రహించి నీళ్ళలోకి తాళ్లు విసిరారు.

తాడు సాయంతో వంతెనమీదకు ఎక్కుదామని ప్రయత్నించాడు. కాని చలికి కాళ్ళూ చేతులూ కొంకర్లు

పోయి అతడి స్వాధీనంలోకి రాలేదు. అలాగే తాటిని తన నడుంచుట్టూ చుట్టబెట్టుకుని పైకి లాగమని అరిచాడు. చటర్జీనిగూడ అలాగే రక్షించారు.

జీప్‌లోంచి అల్యూమినియం నిచ్చెనలను వంతెనమీద ఏర్పడిన అగాధంమీద పరిచారు. అవి అల్యూమినియంతో చేయబడినాగాని ఇనుముకన్న గట్టివి. వాటిమీదుగా రెండో జీప్‌ని వంతెన దాటించారు.

మహేంద్ర తడిబట్టలు విప్పేసి, రెండు రగ్గులు కప్పుకుని జీప్‌లో కూర్చున్నాడు.

కొండకు ఇవతలగా, వంతెననుంచి మైలుదూరంలో ఏదో ఇల్లు కనబడుతోంది. అక్కడున్న పల్లెలో అదే మొదటి ఇల్లు. అక్కడకు తీసుకువెళ్ళి ఇద్దరికీ మెడికల్ ఎయిడ్ ఇవ్వాలని నిర్ణయించబడింది.

సీక్రెట్ ఏజంట్ వెళ్ళి ఆ ఇల్లు తలుపు తట్టాడు.

తలుపు తెరుచుకుని ఆజానుబాహువులాంటి వ్యక్తి బయటకు వచ్చాడు.

"ఇద్దరు వ్యక్తులు ప్రమాదస్థితిలో వున్నారు. వాళ్ళకు విశ్రాంతి కావాలి!" అన్నాడు అతడు.

"కాని మా ఇంట్లో వాళ్ళకు కావల్సిన సదుపాయాలేం లేవు."

"అదంతా మేం చూసుకుంటాం! ముందు లోపలకు రానివ్వండి" అంటూ అతడు ఆ ఇంటిలోని వ్యక్తిని నెట్టుకుంటూ లోపలకు వెళ్ళాడు.

అతడి వెనుకనే మిగతావాళ్ళు లోపలకు ప్రవేశించారు మహేంద్ర, ఛటర్జీలను నడిపించుకుంటూ.

లోపల రెండు బెడ్స్ ఏర్పరచి వారిని పడుకోబెట్టారు. ఫ్లాస్కు వంచి వేడివేడి టీ త్రాగించారు.

